


ఉత్తమ చిత్ర

# మనసు-మాంగల్యం

నిర్మాత. కోగంటి కుటుంబరావు : దర్శకత్వం కె ప్రత్యగాత్మ

సంగీతం. పెండ్యాల   రచన. ఆచార్య ఆత్రేయ.

శ్రీ ఫిలింస్

SUVARNA

# ఉత్తరాలు

## సంక్రాంతి ప్రత్యేక సంచిక

15—1—1971 సంక్రాంతి ప్రత్యేక సంచిక పత్రిక యందు శ్రీ పి. వి. రావు విశాఖపట్నం వారు, శ్రీ స్వప్న, విజయవాడ వారి ఉత్తరానికి వివరాన్ని వ్యక్తపరుస్తూ వ్రాసిన ఉత్తరము చూచి, నవ్వాలో, ఏడవాలో తెలియడం లేదు.

శ్రీ ఎన్. టి. రామారావుగారు చైనా—ఇండియా యుద్ధ సమయంలో చందాలు వేసి రు 10 లక్షలు స్వర్గీయ శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రిగారి కిచ్చారని వ్రాశారు. అది నిజం కాదు. 1962 లో చైనా—ఇండియా యుద్ధ సమయమున శ్రీ రామారావు గారి ఆధ్వర్యమున, శ్రీ నాగేశ్వరరావుగారు, వారి మిత్రబృందము చేరి, విజయవాడ, హైదరాబాద్, కర్నూలు లయందు వినోద ప్రదర్శన లిచ్చి నిధి సేకరించి, దేశరక్షణకు ఇచ్చారు. అంతేకాని శ్రీ రామారావుగారు చందావేసి కీ. శే. శ్రీ లాల్ బహదూర్‌శాస్త్రిగార్కి 10 లక్షలు యిచ్చారన్నది శుద్ధ అబద్ధం. అయినా ఆసమయంలో కీ. శే. పండిత జవహర్లాల్ నెహ్రూ గారు ప్రధానిగా యుండగా శ్రీ రామారావుగారు ప్రత్యేకించి, శ్రీ లాల్‌బహదూర్ గారికి నిధి నందించిన ప్రత్యేకతేమిటో శ్రీ పి. వి. రావుగారు తెలుప ప్రార్థన.

శ్రీ రామారావుగారు నిధిని చందాలరూపంలో వసూలు చేసి కీ. శే. లాల్ బహదూర్ శాస్త్రిగారి కిచ్చింది,పాకిస్తాన్—ఇండియా యుద్ధం—1964 లోనని శ్రీ పి. వి. రావుగారు గమనించ ప్రార్థన.

ఏదయినా విమర్శ చేసే ముందు, దాని ముందు వెనుకలు చూచి, దాని గురించి పూర్తిగా తెలుసుకొని మరీ విమర్శిస్తారని ఆశిస్తాను.

—ఎస్. ఎ. ముబారక్ [హైదరాబాద్]

* * *

15—1—71 తేదీ సంచికలో స్వప్నగారు వ్రాసిన లేఖను విమర్శిస్తూ పి. వి. రావుగారు విశాఖపట్నం నుండి వ్రాసిన ఉత్తరం చదివిన పిమ్మట నాకీ ఉత్తరాన్ని వ్రాయాలనిపించింది.

మొదటి పేరాలో వ్రాసిన వారి విమర్శ బాగుగానే ఉంది. కాని రెండవ పేరాలో వారు మీకు తెలుసా ? శీర్షిక కేవలం సినిమాకు సంబంధించినదే, స్వప్న గారికి ఈ విషయం తెలియదేమో అని వ్రాశారు. అసలు స్వప్నగారు వ్రాసినదేమిటి ? ఇకనుంచైనా మీకు తెలుసా ? అనే శీర్షికలో మహానాయకుల జీవిత ఘట్టాలను కొన్నింటిని ప్రచురించ వలసినదిగా వారి అభిప్రాయాన్ని వ్రాశారు. దాన్ని సరిగాఅర్థం చేసుకోకుండా రావు గారు హేళనా పూర్వకంగా స్వప్నగారు స్వప్నావస్థలో నున్నట్లున్నారనీ, వీరికి మీకు తెలుసా? అనే శీర్షిక కేవలం సినిమాకు సంబంధించిన దని తెలియదు కాబోలని దురుసుగా పదాల నుపయోగించడం సాటి పాటకులైన పి. వి. రావు గారికి సముచితం కాదని నాభావన.

—కుమారి కో[illegible] భారతి [చిలకలపూడి]

ఇంతటితో ఈ విషయం పయిన ఉత్తరాలు ప్రచురించటం ఆపివేస్తున్నాము. —సం.

* * *

సంక్రాంతి సంచికకు శ్రీ గెనిసెట్టి గారి ముఖచిత్రం ఎంతో నిండుదనాన్ని చేకూర్చింది.

ముఖ్యంగా శ్రీ మహేష్ గారు ముగ్గురు మూర్ఖులు శీర్షికలో మధ్యంతర ఎన్నికలపై చేసిన సద్విమర్శ చక్కని రాజకీయ విజ్ఞానాన్ని కలిగించింది.

—జి. విజయ విజయరాజు [తిరుచిరాపల్లి]

* * *

సంక్రాంతి ప్రత్యేక సంచిక చాలా బాగుంది. కథలన్నీ, ముఖ్యంగా సంసార సాగరంలో అన్న కథ చాలా బాగుంది.

——జె. నీలాసుందరి, [చిత్తూరు]

* * *

సంక్రాంతి సంచిక గెనిసెట్టి ముఖచిత్ర సంపదను అలంభనంగా జేసుకొని పాటకుల హృదయాలలో ఆనందలహరులు రేపింది.

సంక్రాంతి ముగ్గులు, సుబ్బారావూ—సన్మానం ఈ రెండు కథలు రచయిత కావాలనే వ్యక్తి అంతర్యాన్ని, అతడు అందుకోవన్మై చేసే ప్రయత్నాలని ఆదినుండి తుది వరకు అందించాయి.

నిజంగానే సంక్రాంతి ముగ్గులు లో కైలాసం కనీసం తన పేరు ఉత్తరాల శీర్షికలో నైనా చూసుకోందామని చేసిన ప్రయత్నాలన్నీ అడియాసలు కావడం ఎంతో బాధ కల్గించింది. అటువంటి కైలాసం గొప్ప రచయితగా చలామణి అవుదామని కోరుకొని చివరికి ముగ్గుల రచయితగా మారి కనీసం అందులోనైనా తన పేరు అచ్చులో చూసుకొని పరవశించాడు. ఆ అదృష్టానికి కూడా నోచుకోని, దురదృష్టవంతులెందరో వున్నారు. పాపం వాళ్ళ గీత ఎలా వుందో మరి?

— మాధవీలత [వరంగల్]

* * *

సంక్రాంతి సంచికగా వెలువడిన ఈవారం పత్రికలో, ముగ్గురు మూర్ఖులు శీర్షికలో మధ్యంతర యెన్నికలను గూర్చి ఇందిరాగాంధి మనస్తత్వాన్ని గూర్చి బహుచక్కగా వివరించిన మహేష్‌గారు అభినందనీయులు. వారిని ముగ్గుర్ని మూర్ఖులు అనడం యెంతమాత్రం సమంజసంగా లేదు.

—ఎస్. ఎ. రహమాన్ [అయిరాల]

* * *

గెనిసెట్టి గారి ముఖచిత్రంలో సంక్రాంతి ప్రత్యేక సంచిక నిండుగా వుంది. వాస్తవానికి ఈ సంచిక మేమాశించిన దాని కంటే ఎక్కువ సంతృప్తి యిచ్చింది. కథలు, వివిధ రకాల శీర్షికలు, కార్టూనులు, ఒకవారం విపరీతం, చిత్రాలను గురించి ఎంతను వ్రాయను.

* * *

ఆంధ్రపత్రిక సంక్రాంతి సంచిక రమ్యముగా నున్నది. ముఖచిత్రము చూడ ముచ్చటగా నున్నది.

ప్రత్యేక సంచికలకు ధర పెంచకుండా ఆంధ్ర సచిత్ర వారపత్రిక మామూలు ధరకే మీరుంచుట ముదావహము.

మధ్యంతర ఎన్నికలపై మహేష్ వ్రాసిన వ్యాసం ముగ్గురు మూర్ఖులు హాస్య మిళితముగా వాస్తవము చిత్రించినది.

నట జమున, రమణారావు [శ్రీమతి] వ్రాసిన సంక్రాంతి రోజులు చాలా బాగున్నది.

చేగొండి రామజోగయ్య వ్రాసిన సంక్రాంతి ముగ్గులు నాకు నచ్చినది.

కృష్ణప్రియ గారిచ్చిన ఎయిర్ లైన్ ఫ్రాక్ ఈవారు ప్రయత్నించాలి.

లీలా సీతారామయ్య. [కాకినాడ]

## క థ లు

గత రెండు వారాల నుండి రెండు భాగములుగా వెలువడిన పెద్దకథ చంద్రశేఖరం చాల బాగుంది. ఆకథలో చంద్రశేఖరం లాగ మనస్సులోని భావాలను వ్యక్త పరచలేని వ్యక్తులు ఇప్పుడు కూడవుంటారనుటలో అతిశయోక్తి లేదేమో!

——బి. మంజుల [నెల్లూర్]

* * *

శ్రీ పెద్దింటి రామమూర్తి లక్ష్మణ్ గార్ల రచన సంసార సాగరంలో అనుకథ చదివి ఎప్పుడూ పత్రికలకి ఉత్తరాలు వ్రాయటం అలవాటు లేని నేను ఈ ఉత్తరం వ్రాయలేకుండా వుండలేక వ్రాసియున్నాను.

"సంసార సాగరంలో" అను కథ కేవలం హాస్యభరితమే కాక సాంఘిక జీవితానికి వాస్తవంగా రచించిన రచయితలు అభినందనీయులు. ఇంత హాస్య పూరితమైన కథను గత రెండు సంవత్సరాలుగా ఏపత్రికలోను చదివి యుండ లేదనుట నా అతిశయోక్తి మాత్రము కాదు. కథ చదువుతున్నంత సేపును నవ్వునూ ఆపుకోలేక నేనూ, మా శ్రీమతి నవ్వుకున్నాం.

కనీసం వారానికొక కథనైనా అటువంటి కథ మించ వలసినదిగా మిమ్మల్ని కోరుతున్నాం.

వెంకట రమణ [శ్రీశైలం ప్రాజెక్టు]

* * *

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం: 12—2—'71
శ్రీసాధారణనామ సం॥ మాఘమాసం॥ బ॥ విదియ
సంపుటము: 64 సంచిక: 23

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

విడి ప్రతి వెల 40 పైసలు

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26 00 |
| 6 మాసముల చందా | 13 00 |
| 3 మాసముల చందా | 6.50 |


## విషయానుక్రమణిక



# ఉత్తరాలు

## తిక్కన కాంస్యవిగ్రహం

29—1—71 నాటి పత్రికలో హైదరాబాద్ నుంచి మిత్రులు మూర్తిగారు వగైరాలు వ్రాసిన ఉత్తరాలు చూశాను. తిక్కన కళాభారతి విషయాలు యింతకుముందే చూశాను.

తిక్కనగారిమీద కళా భారతి సంస్థాపకులకు, సభ్యులకు ఉన్న అభిమానాన్ని నేను శంకించను. అయితే యీనాడు శిలా విగ్రహాలకి, ఆ విగ్రహాల్లో సమాధి అయిపోయిన మహానుభావులకి మనం యెంత విలువ యిస్తున్నామో విజ్ఞులకి తెలియనిది కాదు. సామాన్య ప్రజలు కావ్యాలు చదవకపోయినా యింతవరకూ నన్నయ, తిక్కన, పెద్దన మొదలైన లైన వాళ్ళంటే కొంత గౌరవం చూపుతున్నారు. ప్రస్తుతం కాంస్య విగ్రహ ప్రతిష్ఠాపన వల్ల ప్రజలకి తిక్కనగార్ని గురించి అదనంగా యేమీ తెలియదు. సరిగదా, ఉన్నదికూడా ఉడిపోతుంది. మిగతా కాంస్య విగ్రహాల్లాగానే తిక్కనగార్ని కూడా సమాధి చేసేయడం తప్ప మరేదీ జరగదు.

తిక్కనగారి మీద నిజంగా గౌరవం ఉన్నవాళ్ళు చేయవలసినపని యిదికాదేమో!! భారతానికి యింత వరకూ సరైన వ్యాఖ్యానం రాలేదు. విపుల వ్యాఖ్యలో [ప్రతిపదార్థతాత్పర్యాలు వ్యాఖ్యకాదు!] చౌకధరకి భారతాన్ని ప్రచురించవచ్చునే! లేకపోతే ఒకోసంపుటం రెండేసి రూపాయలకో, రెండున్నరకో 7 సంపుటాల్లో భారతాన్ని ప్రచురించ వచ్చునే!

పండిత వర్యులు నాబోటి అనామకునిపై ఆగ్రహించకుండా, జాగ్రత్తగా ఆలోచించగోర్తాను.

—సి. రవిశర్మ, [విశాఖ]

## సీరియల్

కొత్త సీరియల్ 'మల్లెలు ఎర్రగులాబీలు' చాలా గమ్మత్తుగా, హుషారుగా మనస్సుకు సంతోషం కలిగించేలా సరదాగా ఉంది.

మద్దా వెంకటరామయ్య [ఉరవకొండ]

* * *

మల్లెలు—ఎర్ర గులాబీలు సీరియల్ మొదటి భాగము చదువుతుంటే ఇలాంటి సీరియల్ ఎలా సెలక్ట్ చేసారా అనిపించింది. 2, 3 భాగాలు రక్తి కట్టినాయి. పత్రిక ఎప్పుడొస్తుందా? అని ఎదురు చూస్తున్నాను. అతని లక్ష్యం సీరియల్ కూడ చాల బాగుంది.

ఎమ్. ఎల్. సులోచనారాణి, [మద్రాసు]

## గమనిక

8—1—71 సంచికలో ప్రచురించబడిన గతస్మృతులు' కథ రాసినవారు శ్రీమతి డి (దర్భా) కామేశ్వరి అని పాఠకులు గమనించ గోరుతాము.

—సంపాదకుడు.

ప్రేమనాద్‌గారి 'వాకీ తృప్తి చాలు' అనే కథలో గూడూరు నుండి తిరుపతికి పోయే దోవలో రైళ్లు వచ్చుని పైర్లు మధ్యగా వెళుతుంది.. ఆ దృశ్యం ఎంత చూసినా చూడాలని పిస్తుంది. వారు బహుశా ఒకసారి కూడా గూడూరు నుండి తిరుపతికి రైలు ప్రయాణము చేయలేదేమో చేసి వుంటే తెలిసేది. గూడూరు నుండి కాళహస్తి వరకూ కూడా అన్నీ పొదలు దిబ్బలు ఉన్నాయి. కాని అందం లోనే ఎల్లకారు స్టేషను వచ్చింది అని వ్రాశారు. కాబట్టి ఇటువంటి అభూత కల్పనలు చేయకుండా ఉంటే మంచిది.!

జి. యస్. యస్. నారాయణరావు [పృథ్వీపురి]

* * *

తాతా రామశాస్త్రిగారి చంద్రశేఖరం ముగింపు నాకు విరక్తిని కలిగించినది.

సంసార సాగరం చాలా బాగున్నది. ఇటు వంటి కథలే ప్రచురించకోరతాను. ముఖ్యంగా కమలా వళ్ళని సిలచుట బాగున్నది.

వారణాశి వెంకట రమణమూర్తి [ఏలూరు]

* * *

చందు సోంబాబు క్షమించు సీతా అనే ముత్యంలాంటి కథ. పాఠకుల మనస్సులో మళ్లీ మళ్లీ మనలి మనస్సుకు వెయ్యి ఆలోచనలు కలిగించే కథ అది.

స్వార్థాల సంఘర్షణకు ఫలితం ఎప్పుడూ కష్టాలే—కరిగిపోయిన కలలే అన్న నగ్న సత్యాన్ని అతి సునిశితంగా సుందరంగా మలచిన కథకుడు మన అందరి అభినందనలకు, పెద్దల ఆశీస్సులకు—అర్హుడు. మీ పత్రిక ద్వారా పాఠకులకు పరిచయమైన యీ చిరంజీవి మన అందరి గర్వ కారణానికి కారకుడు కాగలడని యీ కథ సూచిస్తోంది.

వల్లూరి సూరిబాబు [మచిలీపట్నం]

* * *

మన రేడియో కేంద్రమైన విజయవాడ తెలుగు కేంద్రమా, లేక అఖిలభారత భాషల కేంద్రమా, అనే సందేహాన్ని కల్గించుచున్నది. ఎందుచేతనంటే భారతదేశములో మద్రాసు, కేంద్రము, వివిధభారతి [ఒక పావుగంట మాత్రమే రోజుకు.] తప్ప మిగిలిన కేంద్రములన్నియు ఆయా భాషల కార్యక్రమములనే ప్రసారం చేస్తున్నాయి. కాని మన విజయవాడ కేంద్రము మాత్రము ఉదయము 6—30 నుండి 6—40 వరకు భక్తిరంజని కార్యక్రమములకి మరాటీ, బెంగాలీ, తమిళ, కన్నడ మొదలైన అనేక ఇతర భాషల భక్తిగీతాలు ప్రసారం చేస్తుందంటే అది మన చేతకాని తనము కోవాలా? లేక ఇతర కారణ మేమన్నా ఉందా? తెలుప కోర్తాను.

కల్యాణి వాసుదేవరావు [కాకినాడ]

## సంజయఉవాచ

సంజయ ఉవాచ చదివి పెద్దవారే ఇట్లావున్న ఈ దేశమెట్లు బాగుపడును అనివిచారించితిని.

—టి. ముద్దుకృష్ణపిళ్లై [చంద్రగిరి]


సోషలిజానికే మా వోటు!
పొండి, నా జాతికే నా వోటు!


మనగమ్యంకూడా అదే
కాంగ్రెస్ ప్రజాస్వామిక
స్వతంత్ర ప్రజాస్వామిక


కేరళలో కృష్ణమీనన్ పరిస్థితి
కమ్యూనిస్టులు
మార్క్సిస్టులు


టాక్సీ
కొత్త కాంగ్రెస్
వెంకటసుబ్బయ్య
పాత కాంగ్రెస్
OOMMEN

# 'బ్లాక్ గ్రాంటు' పై ఆధారపడిన ఉస్మానియా

ఉత్తమ అధ్యాపకుడే ఒక విశ్వ విద్యాలయ ఉపాధ్యక్ష పదవికి యోగ్యుడు అని భావిస్తే డాక్టర్ రావాడ సత్యనారాయణగారు ఉస్మానియా విశ్వ విద్యాలయ ఉపాధ్యక్ష పదవి నలంకరించడానికి అన్ని విధాల అరులు. అతి సామాన్యమైన కుటుంబానికి చెంది, కేవలం స్వయం కృషితో ఉన్నతమైన విద్యార్జన చేసి ఒక ఆదర్శ అధ్యాపకుడిగా అసంఖ్యాక విద్యార్థుల కృతజ్ఞతల నందుకున్న వ్యక్తి డాక్టర్ రావాడ. కపటం లేకుండా మొహమాటమి లేకుండా కుండ బద్దలు కొట్టినట్లు మాట్లాడే స్వభావం కల డాక్టర్ రావాడకు, సీనియర్ ప్రొఫెసర్ ఐనప్పటికీ రావలసిన మన్నన పరిగణన రాకుండా పోయాయి. తెలంగాణా ఉద్యమమంటూ ఉస్మానియా విద్యార్థులు లేవదీయకపోతే ఈసారి కూడా ఉపాధ్యక్ష పదవి ఆయనకు వచ్చేదికాదు. కేవలం విశ్వ విద్యాలయాధ్యాపకుడిగానేకాక విజ్ఞానశాస్త్రంపట్ల సామాన్య ప్రజల్లో ఆసక్తి కలిగించేటందుకు కూడా డాక్టర్ రావాడ చెప్పుకోదగిన కృషి చేశారు. కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం అధ్వర్యంలో ఆయన చక్కని సరళమైన తెలుగులో చిక్కులతో కూడిన ఎన్నో విజ్ఞాన శాస్త్ర విషయాలను సైన్సు విద్యార్థులు కానివారికి సైతం అర్థమయేవిధంగా ఉపన్యాసాలు ప్రసంగాలు చేశారు.

## ఉపాధ్యక్ష పదవికి అర్హతలు

ఐతే ఒక విశ్వవిద్యాలయ ఉపాధ్యక్ష పదవికి కేవలం వో ఆదర్శనీయమైన అధ్యాపకునికి ఉండవలసిన యోగ్యతలకంటే భిన్నమైనవి కూడా ఉండాలి. ఒకవైపు విద్యార్థుల్లో అలజడి రెండవ వైపు అసహాయకరమైన ప్రభుత్వ వైఖరి — ఈ పరిస్థితితో తల్లడిల్లి డాక్టర్ రావాడ నిరాహార దీక్షను పూనడం ఈ విషయాన్ని 'రూపిస్తున్నది. సరిగా ఇలాంటి పరిస్థితే, రావాడగారికి పూర్వం పది సంవత్సరాలకుపైగా ఉపాధ్యక్షుడుగా నున్న డాక్టర్ డి యస్ రెడ్డిగారిని మూడు నాలుగు సంవత్సరాల క్రితం ఎదుర్కొన్నది. ఆ రోజుల్లో రాష్ట్ర ప్రభుత్వానికి డాక్టర్ డి. యస్. రెడ్డిగారికి మధ్య తీవ్రమైన స్పర్ధ లేర్పడ్డాయి. వారి సంబంధాలు ఒకొకప్పుడు అసహ్యకరంగాను ఎవరికీ మర్యాదకరంగాను లేనంతగా దిగజారాయి. ఐనా ప్రభుత్వం విశ్వ విద్యాలయానికి తగువిధంగా ఆర్థిక సహాయం చేయవలసి వచ్చింది. అక్షరాలా బ్లాక్‌మెయిల్ కాకపోయినా దాదాపు అంత పనీ చేసి ఆయన ప్రభుత్వంనుంచి ఆర్థిక సహాయాన్నో రాబట్టారు. అది సరియైన మార్గమా కాదా అనేది వేరే విషయం. అమాయకులైనవారికీ దక్షులైనవారికీ మధ్య కల తేడాను మాత్రమే అప్పటి డి. యస్. రెడ్డిగారి వైఖరిఈనాటి డాక్టర్ రావాడ చర్యసూచిస్తున్నాయి.

## డి. యస్. రెడ్డి చాకచక్యం

ప్రతి సంస్థకు ఒక చరిత్ర ఉంటుంది. దీనిని సరిగా అవగాహన చేసుకొనకపోతే చిక్కులు వస్తాయి. ఉస్మానియా విశ్వ విద్యాలయంపట్ల ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఇలాంటి అవగాహనలేమినే మొదటి నుంచీ ప్రదర్శించింది. 1958 లో డాక్టర్ డి. యస్. రెడ్డిని ఉపాధ్యక్షుడుగా నియమించినప్పుడు తెలంగాణాలోను, ఉస్మానియా అధ్యాపకవర్గం, విద్యార్థిలోకంలోను పెద్ద అలజడి బయల్దేరింది. ప్రభుత్వంకంటే డి. యస్. రెడ్డిగారే తన చాకచక్యాన్నుపయోగించుకొని విశ్వ విద్యాలయంలో తమకు వ్యతిరేకంగానున్న వాతావరణాన్ని అనుకూలంగా మార్చుకొని వివిధ రంగాల్లో విశ్వ విద్యాలయ అభ్యున్నతికి కృషి చేయగలిగారు. కాని ఇంతలో ఆయనకు ముఖ్యమంత్రిగారికి స్పర్థ లేర్పడ్డాయి. వారి పరస్పర దూషణలు పత్రికా ప్రకటనలు, శాసనసభ వక్తృతలను చేయడం, వాటిని మృత్సిపాలకోర్టు రద్దు చేయడం — ఇవన్నీ అందరికీ తెలిసినవే.

## జీతాలివ్వలేని ప్రభుత్వం

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆర్థికస్థితి 1965 66లో నుంచి దిగజారి, ఒకొకప్పుడు ప్రభుత్వం తమ ఉద్యోగులకే వేతనాలివ్వడంలో ఇబ్బంది పడడం కూడా అందరికీ తెలిసిందే కాని చాలావరకు ప్రభుత్వ సహాయంపైననే ఆధారపడవలసిన విశ్వవిద్యాలయాన్ని ఇబ్బంది పెట్టడంలో అర్థం లేదు. ఏభై సంవత్సరాల క్రితం ఏడవ నిజాం ప్రభువు జారీచేసిన ప్రత్యేక చార్టరుద్వారా ఉస్మానియా విశ్వ




'[illegible] వెయ్యండి! — నేను ఎన్నికయితే స్నో, పౌడర్, [illegible] హెయిరాయిల్ మీద పన్నులు తీయించివేస్తా.'

విద్యాలయం వెలిసింది. కాని అప్పటినుంచి 1958 అప్పటి విద్యామంత్రి పట్టాభి రామారావుగారు ప్రవేశపెట్టిన ఉస్మానియా విశ్వ విద్యాలయం చట్టంవరకు ఇది ఒక ప్రభుత్వాంగంగా ప్రభుత్వ ఆర్థిక సహాయంపై ఆధారపడి నడుస్తూ ఉండేది. దీనికి కారణం లేకపోలేదు. అప్పటి హైదరాబాదు రాష్ట్రంలోని దాదాపు అన్ని కళాశాలలు కాన్‌స్టిట్యుయెంట్ కళాశాలలుగా విశ్వ విద్యాలయ నిర్వహణ క్రిందనే ఉంటివి. అనుబంధ కళాశాలలు ఒకటో రెండో మాత్రమే ఉండేవి. దానికితోడు విద్యార్థులు ఫీజులు చాలా తక్కువగా ఉండేవి. అనుబంధ కళాశాలల సంఖ్య ఈమధ్య బాగా హెచ్చింది. విశ్వ విద్యాలయ కళాశాలల్లో ఫీజులు కూడా రెండింతలు మూడింతలు ఈ పది సంవత్సరాల్లో పెరిగాయి. ఐనా ఉస్మానియా ఫీజులు ఆంధ్ర, శ్రీ వేంకటేశ్వర ఫీజులకంటే తక్కువ. కనుకనే ఉస్మానియా ఆనాటికి ఈనాటికీ ప్రభుత్వ బ్లాక్ గ్రాంటుల పైనే హెచ్చుగా ఆధారపడి ఉంది. దీనికి చారిత్రకమైన కారణాలున్నాయి. వీటిని విస్మరించి గ్రాంట్లు ఇవ్వడంలో తాత్సారం చేసినా, గ్రాంట్లను హెచ్చిస్తూ సవరింపులు చేయకపోయినా విశ్వ విద్యాలయంలో ఆర్థిక క్లిష్టత సంభవిస్తుంది. ఫీజు హెచ్చింపు వ్యతిరేకంగా విద్యార్థులు ఆందోళన లేవదీస్తే, డి. ఎస్. రెడ్డిగారే వారి నలా ప్రేరేపిస్తున్నారని ప్రభుత్వ నాయకులు ఆరోపించేవారు. కాని డాక్టర్ రావాడ విషయంలో అలా ఎవరూ ఆరోపించలేరు. విశ్వ విద్యాలయమంతా తెలంగాణా ఆందోళన, ఇతర కారణాలవల్ల పూర్తిగా స్తంభించిపోయిన రోజుల్లో ఆయన్ను ప్రభుత్వం ఉపాధ్యక్షుడుగా నియమించింది. ఆయనకు విద్యార్థుల సహకారం లేదు. అధ్యాపకుల మద్దతు లేదు. ప్రభుత్వంనుంచి సానుభూతి, ప్రోత్సాహం కూడా కరువయాయి.

## విద్యారంగంలో రాజకీయవేత్తలు

గత రెండు సంవత్సరాలుగా ఉస్మానియా విశ్వ విద్యాలయంలో విద్యార్జనకు అనుకూలమైన వాతావరణం పూర్తిగా నశించింది. 1969—70 లో హెచ్చుకాలం కళాశాలలు అసలు పని చేయలేదు. పరీక్షలు జరగలేదు. చివరికి ఏదోవిధంగా తరగతుల నిర్వహణను ప్రారంభించి పరీక్షల సమయమాసన్నమయేటప్పటికి, అదిరించి బెదిరించి కన్సెషన్లు పొందడానికి అలవాటు పడిన విద్యార్థిలోకం, పరీక్షలను వాయిదా వేయమని అలజడిని ప్రారంభించారు. లోక్‌సభ ఎన్నికల్లో ప్రత్యేక రాష్ట్రవాదుల పక్షాన ప్రచారం చేయడానికి పరీక్షలు వీరికి అడ్డు తగులుతాయి. అందుకే పరీక్షలను వాయిదా వేయమని కోరుతున్నారంటే, విద్యార్థులకు ఆగ్రహం కలగవచ్చును కాని వారు పరీక్షలో కూర్చునే మానసిక స్థితిలో లేరు. అధ్యాపకుల స్థితి ఆవిధంగానే ఉంది. ఇందువల్ల బాగా నష్టబడుతున్నది విద్యార్జనపై ఆసక్తి కలిగిన విద్యార్థులు, వారి తలిదండ్రులు. విద్యారంగంలో రాజకీయవేత్తలు ప్రవేశిస్తే ఫలితం వేరువిధంగా ఎలా ఉంటుంది?

—వి. నాగేశ్వరరావు.

# తమసోమా జ్యోతిర్గమయ



సునాళి అచ్యుతరావు

చిన్న పట్టణంలాంటి ఆ పెద్ద గ్రామానికి పంచాయితీ ఎన్నికలు పండుగులా వచ్చాయి. ఎంతో సందడిని తెచ్చాయి. ఎవరినిచూసినా ఏదో హడావుడి. ...సినా ఆదోగడబిడ.

ఇంట్లోవున్నా పొలంలో పనిచేస్తున్నా, ఎవరినోట విన్నా పంచాయితీ ఎన్నికల గురించే ! నలుగురు కలసిన ప్రతిచోట, నాలుగువీధులు కలసిన ప్రతిసెంటర్లో పంచాయితీ రాజకీయాలే ప్రాధాన్యం వహిస్తున్నాయి. పార్టీల బలాబలాల విషయాలే చోటు చేసుకుంటున్నాయి.

రోజూ ఆలోచనలు, సమాలోచనలు జరుగుతున్నాయి. రహస్య సమావేశాలు జరుపుకుంటున్నారు. గూడుపుఠాణీ చేసుకుంటున్నారు గుండెల్లో స్వార్థాన్ని నింపుకుంటున్నారు.

అంతటా చిమ్మచీకటి ఆవరించుకుంది. రాత్రి పన్నెండుగంటలు అవుతుంది. ఆకాశంలో నక్షత్రములు వెలిగలేక వెలుగుతున్న దీపాల్లా కనబడుతున్నాయా చీకట్లో. ఒక చిన్న యింట్లో అతి రహస్యమైన ఒక చిన్న సమావేశం ఏర్పాటయింది. అందరూ గుసగుసలాడుతున్నారు. వారి మధ్య రామిరెడ్డి కూర్చొని ఏదో చెబుతున్నాడు. వారంతా నాగస్వరానికి తన్మయమైన నాగుపాముల్లా శ్రద్ధగా వింటున్నారు. అందరి నోట్లోను గవర్నమెంటు సారా వాసన గుప్పుమంటోంది. కళ్ళల్లో ఎరుపుదనం స్పష్టంగా కనిపిస్తోంది.

కోటిరెడ్డి వున్నట్టుండి ఒక్కసారి చిన్నగా నవ్వుతూ కోరమీసాలు మెలివేశాడు, తనంతటివాడు లేనట్టుగా ! క్రౌర్యం, కల్మషం కలిసిన విషపు నవ్వులా వుందా నవ్వు!!

అక్కడున్న వారికంతా రామిరెడ్డి డబ్బు యిచ్చాడు. అందరూ డబ్బు తీసుకుంటూ ఆ చేతులతో దండాలుపెట్టి సెలవు తీసుకొని వెళ్ళిపోతున్నారు.

చివరికి రామిరెడ్డి, పోలయ్య మిగిలిపోయారు

'పోలయ్యా! జాగ్రత్త!! నీవు చేయబోయే పని ఎవ్వరికీ తెలియకూడదు. నీవు ఎవరికంటా పడకూడదు!!' రామిరెడ్డి మరోసారి గుర్తుచేసి హెచ్చరించాడు పోలయ్యను.

పోలయ్య 'అలాగే' నంటూ తలూపాడు. అతని చేతుల్లో నాలుగువందల రూపాయలనోట్లు పడ్డాయి! పోలయ్యలోని సంతోషం గంతులేసింది. క్రూరత్వాన్ని తెలిపేవాడి ముఖంలో ఆశ అంచులు దాటుతోంది. రూపాయల్ని జేబులో భద్రంగా దాచుకున్నాడు.

ధైర్యానికి ప్రోత్సాహమిస్తున్నట్టుగా రామిరెడ్డి పోలయ్య భుజంపై తన చేయి

వేసి "జాగ్రత్త!" అన్నట్లుగా మరోసారి చూపుల్తోనే హెచ్చరించి వెళ్ళిపోయాడు. పోలయ్య ఒంటరిగా మిగిలిపోయాడు.

ఆ గ్రామంలో రామిరెడ్డి పెద్దరైతు. మోతుబరి. మస్తుగా ఆస్తిపాస్తులు వున్నవాడు. అంతేకాకుండా గ్రామంలో ఒక వర్గానికి నాయకుడు. పల్లెటూరు పోలిటిక్స్‌లో ఆరితేరినవాడు.

అర్థబలంతోను, అధికారంతోను గత రెండు పంచాయితీ ఎన్నికల్లోను ప్రెశిడెంట్ పదవిని అతి సునాయాసంగా వశపరచుకొన్నాడు అంతటితో ఆగకుండా సమితి ప్రెశిడెంట్ గిరికి పోటీచేసి తన ఎత్తులు, కుయుక్తులు నెరవేరకపోగా ఓడిపోయాడు. నెలకొక పార్టీ మారే ఎమ్. ఎల్. ఏ లాగ చివరకు ప్లేటుమార్చి, పార్టీ ఫిరాయించి ప్రత్యర్థి వర్గంతో లాలూచీపడి సమితి వైస్ ప్రెశిడెంట్ అయ్యాడు.

రామిరెడ్డంటే ఆ గ్రామంలో ఎక్కువ మందికి సదభిప్రాయం లేదు. స్వార్థం, ఆశ్రిత పక్షపాతం అతను ప్రాణాల్లాగా చూసుకుంటాడు!

అధికారం, అహంకారం తనకు అందమైన అలంకారాలుగా ఎంచుకుంటాడు.

అతను రెండుసార్లు పంచాయితీ ప్రెశిడెంటైన కాలంలో ఆ గ్రామానికి అభివృద్ధిగాని, ప్రజలకు మేలుగాని చేయకపోగా గ్రామంలో రాజకీయాలు, వర్గాలు, ముఠాతత్వాలు తారస్థాయి నందుకోడానికి మాత్రం పూర్తిగా కారకుడయ్యాడు. ఉత్తమ పంచాయితీలకు కాకుండా, రాజకీయాలలో ప్రథమ స్థానములోవున్న పంచాయతీలకు బహుమతు లివ్వడానికి ప్రభుత్వంలో అవకాశములుంటే రామిరెడ్డి గ్రామ పంచాయితీయే మొదటి బహుమతి అందుకుంటుందనడంలో ఎట్టి సందేహం లేదు

భారతదేశ స్వాతంత్ర్యానికి పల్లెగ్రామాలు వెన్నెముక అన్నాడు మహాత్ముడొకనాడు. ఈనాడు గ్రామాలు ముఠాతత్వాల్లో, వర్గ వాగ్వాదాల్లో, కులమత ద్వేషాల్లో మునిగిపోయి కలుషితమై పోతున్నాయి. దుష్ట రాజకీయాలకు కేంద్రాలయి పోతున్నాయి.

ఏ ఆశయాలకోసం ప్రభుత్వం పంచాయితీ రాజ్ ప్రవేశపెట్టిందో, అవి మృగ్యమై వాటి అర్థం తారుమారై విపరీతమైన అనర్థాలకు దారితీస్తోంది, స్వార్థమే పరమార్థమై పోయింది!! తత్ఫలితంగా కొంతమంది వ్యక్తులే అవకాశాలకు అధికారాలకు అధిపతులై పోతున్నారు. ప్రజాక్షేమం, ప్రజాస్వామ్యం మంటగలిసి పోతున్నాయి.

పైన చెప్పినటువంటి అధిపతులలో రామిరెడ్డి ఒకడు. స్వార్థానికి ప్రతినిధి! స్వలాభానికి ప్రతిబింబం!! అతను ఏమి చేసినా ఎదురుతిరిగి మాట్లాడ్డం గ్రామంలో కష్టమే! కొండంత ధైర్యమే!!

కాలమెప్పుడు ఒకేలాగ నడువదు.

జీవిత మెప్పుడు ఒకేలా జరుగదు.

కాలం, జీవితం ఎప్పుడూ మారుతుంటాయి.

రామిరెడ్డి జీవితంలో యిది సత్యమైంది. తనకు ఎదురులేని గ్రామంలో తిరుగులేని పెత్తనంలో మార్పు వచ్చింది. గ్రామ ప్రజలు కళ్ళు తెరిచారు యువకులలో చైతన్యం కలిగింది. అందుకే యీసారి పంచాయితీ ఎన్నికలలో రామిరెడ్డికి పోటీగా అర్హతగలవాడు, మంచిమనిషి అయిన సాంబమూర్తిగారిని నిలబెట్టారు.

రామిరెడ్డికి అర్థబలం, అధికారబలం ఎక్కువగా వుంటే సాంబమూర్తిగారికి గ్రామస్థుల అభిమానం. పేదప్రజల అండదండలు దండిగా వున్నాయి! అందుకే రామిరెడ్డిలాంటి వాడికి సాంబమూర్తిగారు గట్టి ప్రత్యర్థి అయ్యాడు. ఆయనకు పోటీగా నిలువ గలిగాడు.

సాంబమూర్తిగారి వర్గంలో పేదప్రజలకు, యువకులకు నాయకత్వం వహించిన ముఖ్యమైన వారిలో చంద్రయ్య ఒకడు. సాంబమూర్తిగారి శ్రేయస్సుకు ఎన్నికల్లో విజయానికి నిజాయితీగా, నిండు హృదయంతో కృషిచేస్తున్నవాడు చంద్రయ్య అందుకే చంద్రయ్యంటె రామిరెడ్డికి తీరని కసి! మనసు నిండా కక్ష!! చంద్రయ్యను రామిరెడ్డి ఎప్పుడైనా చూస్తే బుస్సుమంటాడు త్రాచుపాములా!!!

గ్రామానికి దూరంగా, నాగరికతకు ఎడంగా. నీతి నిజాయితీలకు చేరువగా, కూలీనాలీ చేసుకు బ్రతికే ఆ వాడలో కొన్ని కుటుంబాలు కాపురముంటున్నాయి ప్రత్యేకంగా!

దేవుని దృష్టిలో వారందరిదీ ఒకే కులం. అది నిరుపేదలనే కులం. శ్రమకోర్చి కష్టపడటం వారి మతం. కానీ మనుష్యుల దృష్టిలో, సమాజం దృష్టిలో తక్కువ కులాలనబడే నాలుగైదు కులాలవారు ఆ వాడలో వుంటున్నారు! ఎక్కువగా ఆ వాడలో హరిజన కుటుంబాలు వుండడం వల్ల దాన్ని హరిజనవాడగా అందరూ పిలుస్తారు.

హరిజనవాడకి, గ్రామానికి మధ్యగా పెద్ద చెరువులాంటి కొనేరు, సమాజంలో కులమతాల అడ్డుగోడలా వుంది!

హరిజనవాడలో వున్నవారంతా గర్భదరిద్రులే! వ్యవసాయపనులు, కూలిచేసుకొని కాలం వెళ్ళబుచ్చుతున్నారు. బ్రతుకుల్ని గానుగెద్దుల్లా ఈడ్చుకొస్తున్నారు.

సాంబమూర్తిగారి తరఫున మనుష్యులు, ముఖ్యంగా గ్రామంలోని యువకులు ఎన్నికలకు చాలా ముందుగానే హరిజనవాడలో ప్రతియింటికి వెళ్ళి బాగోగులు, మంచిచెడ్డలు వారికి విడమర్చి బోధించారు. కొంతమందికి నచ్చచెప్పి ఒప్పించారు రాత్రింబవళ్ళు కృషిచేశారు. హరిజనవాడను ఒక త్రాటిపై తేవడానికి. వాళ్ళ ఆదరాభిమానాలతోనే సాంబమూర్తిగారిని నిలబెట్టడానికి నిర్ణయం తీసుకున్నారు.

రామిరెడ్డి తనకున్న బలాలన్నీ వుపయోగించి గ్రామంలో సగం మందిని తనవేపుకు తిప్పుకోగలిగాడు. ఎంత ప్రయత్నించినా అతని డబ్బుగానీ, ఎత్తులు, పన్నాగాలుగాని హరిజనవాడలో పని చేయలేదు. వారంతా ఒకే మాటమీద నిలబడ్డారు, జంకూ, గొంకూ లేకుండా!

రామిరెడ్డి దృష్టంతా హరిజనవాడ మీదే వుంది. వానిమీదనే అతనికి, అతని వర్గానికీ కక్ష, కసీను!! ఎలాగైనా వాళ్ళ సమైక్యతను ఛేదించాలని ప్రయత్నిస్తున్నాడు ఏదైనా చేయడానికి సిద్ధమవుతున్నాడు.

పోలయ్య రామిరెడ్డి వర్గానికి ముఖ్యమైనవాడు. రామిరెడ్డి దగ్గరకు వచ్చి ఎన్నోరోజులు కాలేదుకూడా. అయినా అతనికి నమ్మకమైన బంటుఅయి పోయాడు. రామిరెడ్డి తలపెట్టే పనులు చేయడంలో ప్రథముడై పోయాడు.

## నెం. 78: 16 క్లూలు (తెలుగు తర్జుమా)

1. మనము భౌతిక జగత్తును చాలా మట్టుకు అదుపు చేయగలం కాని మనలను మనం మార్పు/అదుపు చేసుకొన గలమా?
2. దేశముల మధ్య సాంస్కృతిక/విద్యా వ్యాసంగ భావముల, నీతుల మరియు వ్యవహారముల లావాదేవీల మార్పులు అవశ్యకాలసమ్మానితక్రమమైయున్నది.
3. శుద్ధయోచనగల ప్రాణికి అన్య ఏ పవిత్రతయున్నూ వేకువ/మృత్యువు అంత గాఢమైనది కాదు.
4. ఆదిమ లేక ఆధునిక జనులందరూ ఏదో విధమైన దేవతలను/నియతులను స్వీకరించారు.
5. రొట్టె జీవనానికి ప్రథమ అవశ్యకతయైన యెడల శిక్ష/మనోరంజన దాని తోటిదే. మరి రాష్ట్రం రెండింటిని కాంక్షించును.
6. మనోభావము/కల్పన యొక్క ప్రకటనా రీతులన్నిటిలో అతి సూక్ష్మమైనటువంటి సంగీతం గిలిగింతలాడించుట క్కూడ సామర్థ్యమైనది.
7. అపఫలతా/నిరర్థకతా బోధము, పని చేయుటకు సంకల్పము, జయించుటకు సంకల్పము, లేక జీవించి యుండుటకు సంకల్పములకు అత్యంత గొప్ప శత్రువులలో ఒకటి.
8. పిల్లలు తమ భయము/భావనలను తమ తల్లిదండ్రులనుండి అలవర్చుకుంటారు.
9. సుఖం/సఫలత యొక్క ఏ భావనయైనా మానసిక శక్తినుండి ప్రత్యేకింపబడనేరదు.
10. భూమి/భాష ముందు సంభవించి యుండునటువంటి సాధనమై వున్నది. అది దాంతోపాటు గొప్ప బాధ్యతలను కూడ కలుగజేయుచున్నది.
11. హావభావములు/మనోస్థితులు పొంగు మచ్చల వంటివి. మీలో అవి ఉన్నట్లు మీరు చూడజాలక పోవచ్చును. కాని అన్యులందరు చూతురు. మరియు అవి సమానంగాసోకునవికూడా అయివున్నవి.
12. గత అనివార్య ఆవశ్యకతల/సంబంధముల ఫలితంగా వర్తమానం వర్ణించబడగలదు.
13. శాంతి/ప్రార్థన వంటి శక్తి ఏమియును లేదు.
14. మనుష్యుడు స్వాభావికంగా తిరుగబడేవాడు/ధార్మికుడు అయివున్నాడు.
15. ఈ ధర్తి మనుష్యుని గృహంకాదు. కాని అతని వీలునామా/సమాధి అయివున్నది.
16. అనిశ్చితం/అస్వార్థం అయివున్నంత వరకూ జీవనం జీవనమే.

## No. 78 : 16 CLUES

(1) We can almost control the physical universe. Can we **Change/ Control oursleves?**

(2) Exchange of **Cultural / Educational** ideas, policies and practices among nations is, of course, a time-honoured process.

(3) There is no solemnity so deep to a rightly-thinking creature, as that of **Dawn /Death.**

(4) All peoples, primitive or modern, have acknowledged some kind of **Deity/ Destiny.**

(5) If bread is the first necessity of life, **Education /Recreation** is a close second, and the nation caters for both.

(6) Music, subtlest of all the modes of expression of the **Emotion/ Emagination,** is able as well to titillate the senses

(7) One of the greatest enemies of the will to work, the will to win, or the will to live, is a sense of **Failure/Futility**

(8) Children catch their **Fears / Feelings** from their parents.

(9) No concept of **Happiness / Success** can be divorced from peace of mind

(10) **Land / Language** is an asset of unprecedented potentiality: it also entails heavy responsibilities

(11) **Mannerisms / Moods** are like measles; you may not see that you have them, but everyone else does! and they are equally catching.

(12) The present can be explained as a result of the inevitable **Necessities /Ties** of the past

(13) There is no power like **Peace/ Prayer.**

(14) Man is innately **Rebellious / Religious**

(15) This earth is not man's home, but his **Testament/Tomb,**

(16) Life is life in so far as it is **Uncertain /Unselfish.**

---

**లిట్‌క్విక్ కొటేషను అన్నియు రచయితల రచనల నుండి గ్రహింపబడినవి. అవి వేనికవే పూర్తి అర్థములు గలవి. ఒక్కొక్క క్లూకు మారు పదములు అక్షర క్రమమున యేర్పాటు చేయబడినవి. మొదటి మారు పదముల యొక్క అక్షరక్రమమున క్లూలన్నియు యేర్పాటు చేయబడినవి. లిట్‌క్విక్ పక్షి అఫిషియల్ సొల్యూషనుతో రచయితల పేర్లు, వారి రచనం పేర్లు ప్రకటింపబడును.**

---

# తమసోమా...

ఎన్నికల రోజులు దగ్గర పడుతున్న కొలదీ గ్రామంలో ఆవేశాలు—పట్టుదలలు పెరిగిపోతున్నాయి!

కక్షలు, కావేశాలు ఒకటి కొకటి కౌగలించుకొంటున్నాయి!! అప్పుడప్పుడు చిన్నచిన్న పోట్లాటలు, కొట్లాటలు చోటు చేసుకొంటున్నాయి!!!

అక్రమాలు అన్యాయాలు జరిగి పోతున్నాయి!

* * *

చీకటిలో పోలయ్య, రామిరెడ్డి పురమాయించిన పనిగురించే ఆలోచిస్తున్నాడు. సిగరెట్టుపై సిగరెట్టు కాలుస్తున్నాడు.

స్వార్థమనే నాగుపాము పోలయ్యను కాటు వేసింది. లేచి ఆరిపోయిన సిగరెట్టును ముట్టించి నడక సాగించాడు. సిగరెట్టులో అగ్నిరవ్వ ఆశ చివరి కోరికలా ఎర్రగా వెలిగిపోతూ సిగరెట్టును చివరివరకు కాల్చేస్తోంది! వీధులన్నీనిర్మానుష్యంగా వున్నాయి. లోకం నిద్రాదేవి ఒడిలో గాఢంగా నిద్రపోతోంది. ఏదో అనిర్వచనీయమైన సుఖాన్ని అనుభవిస్తోంది!

పోలయ్య ఆలోచిస్తూ నడుస్తున్నాడు. నడుస్తూ ఆలోచిస్తున్నాడు.

ఎంత వద్దనుకున్నా పోలయ్యను ఆలోచన పురుగులు ముసురుతోనే వున్నాయి! తనెవరు? రామిరెడ్డి ఎవరు? రామిరెడ్డి, తను విచిత్రంగా కలుసుకున్నారు. రామిరెడ్డి హైదరాబాదునుండి వస్తున్నాడు, ఒకనాడు రైల్లో, దారంలేని గాలిపటంలా తిరుగుతున్న తానూ ఆ రైల్లోనే వస్తున్నాడు. మాటలు కలిశాయి. అదే సమయమనుకొని తన కథంతా చెప్పుకున్నాడు. రామిరెడ్డి తనకథ విని, జాలిపడి, (తనకు పనికొస్తాడని రామిరెడ్డి మనసులో అనుకొని) తనవెంట రమ్మన్నాడు. రమ్మనగానే మరి ముందువెనుక ఆలోచించకుండా అతనివెంట తను వచ్చేశాడు. ఆలోచించటానికి అసలు తనకెవరున్నారని?

రామిరెడ్డి చెప్పిన పనులన్నీ చేస్తే, అతను పురమాయించిన పనులన్నీ నెరవేరుస్తే, అతను పంచాయితీ ప్రెసిడెంటైతే తనకు వ్రాసిస్తానన్న భూమి, అందులో అందమైన తోట, తనను ఒక యింటివాడిని చేసి




బడును."సి" మూడవ కూపనుతో ఉచితంగా యివ్వబడును. "డి" నాలుగవ కూపనుతో ఉచితంగా యివ్వబడును.

4 కూపనులకు తక్కువ పంపు పోటీదారు తన యిష్టము ప్రకారము యెన్ని కూపనులైనా పంపవచ్చును. ఈ కూపనులు మొదటి కూపను నుండి ఆరంభింపవలెననే నిబంధన లేదు.

## లిట్ క్విజ నెం. 78 అధికారం ఎంట్రీ ఫారము

మొత్తము బహుమతి రు. 60,000/— ఆఖరు ముగింపు తేదీ 17—2—71 బుధవారం

ADDRESS· LITQUIZ.No 78, ALANKAR BALARAM STREET, BOMBAY-7. (W B.)

గమనిక 1) ఒక్కొక్క కాలంలో మీరు వద్దనే పదమును కొట్టివేయండి. 2) ఒక కూపన్ మాత్రం పంపినచో ఇతర కూపనులను కొట్టివేయండి. (3) ఎంట్రీరుసుము M.O ద్వారా పంపినచో, పోస్టాఫీసునుండి పొందిన M.O రసీదును ఎంట్రీ ఫారమునకు జతపరచవలెను. M. O రసీదు లేని ఎంట్రీలు నిరాకరింపబడును. (4) I. P O క్రాస్‌చేయవద్దు. అది లిట్‌క్విజ్ నెం 78, బొంబాయి—7 వారికి చెల్లించునట్లు ఉండవలెను.

| 78 | Re. 1 | 1 | Re. 1 | 2 | Re. 1 | 3 | Re. 1 | 4 |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | CHANGE | CONTROL | CHANGE | CONTROL | CHANGE | CONTROL | CHANGE | CONTROL |
| 2 | CULTURAL | EDUCATIO- | CULTURAL | EDUCATIO- | CULTURAL | EDUCATIO- | CULTURAL | EDUCATIO- |
| 3 | DAWN | DEATH | DAWN | DEATH | DAWN | DEATH | DAWN | DEATH |
| 4 | DEITY | DESTINY | DEITY | DESTINY | DEITY | DESTINY | DEITY | DESTINY |
| 5 | EDUCATION | RECREATI- | EDUCATION | RECREATI- | EDUCATION | RECREATI- | EDUCATION | RECREATI- |
| 6 | EMOTION | IMAGINAT- | EMOTION | IMAGINAT- | EMOTION | IMAGINAT- | EMOTION | IMAGINAT- |
| 7 | FAILURE | FUTILITY | FAILURE | FUTILITY | FAILURE | FUTILITY | FAILURE | FUTILITY |
| 8 | FEARS | FEELINGS | FEARS | FEELINGS | FEARS | FEELINGS | FEARS | FEELINGS |
| 9 | HAPPINESS | SUCCESS | HAPPINESS | SUCCESS | HAPPINESS | SUCCESS | HAPPINESS | SUCCESS |
| 10 | LAND | LANGUAGE | LAND | LANGUAGE | LAND | LANGUAGE | LAND | LANGUAGE |
| 11 | MANNERI- | MOODS | MANNERI- | MOODS | MANNERI- | MOODS | MANNERI- | MOODS |
| 12 | NECESSIT- | TIES | NECESSIT- | TIES | NECESSIT- | TIES | NECESSIT- | TIES |
| 13 | PEACE | PRAYER | PEACE | PRAYER | PEACE | PRAYER | PEACE | PRAYER |
| 14 | REBELLI- | RELIGIOUS | REBELLI- | RELIGIOUS | REBELLI- | RELIGIOUS | REBELLI- | RELIGIOUS |
| 15 | TESTAMENT | TOMB | TESTAMENT | TOMB | TESTAMENT | TOMB | TESTAMENT | TOMB |
| 16 | UNCERTAIN | UNSELFISH | UNCERTAIN | UNSELFISH | UNCERTAIN | UNSELFISH | UNCERTAIN | UNSELFISH |

| A FREE | | B FREE | | C FREE | | D FREE | |
|---|---|---|---|---|---|---|---|
| CHANGE | CONTROL | EDUCATION | RECREATI- | HAPPINESS | SUCCESS | PEACE | PRAYER |
| CULTURAL | EDUCATIO- | EMOTION | IMAGINAT- | LAND | LANGUAGE | REBELLI- | RELIGIOUS |
| DAWN | DEATH | FAILURE | FUTILITY | MANNERI- | MOODS | TESTAMENT | TOMB |
| DEITY | DESTINY | FEARS | FEELINGS | NECESS . - | TIES | UNCERTAIN | UNSELFISH |

ఈ క్విజ్ ప్రవేశమునకు చెందిన నిబంధనలను, షరతులను పాటించుటకు అంగీకరిస్తున్నాను మరియు కాంపిటీషన్ ఎడిటరుగారి నిర్ణయమును తుది నిర్ణయముగాను, న్యాయబద్ధమైనదిగాను అంగీకరించుటకు ఆమోదిస్తున్నాను. ప్రతి కూపనుకు ఎంట్రీ ఫీజు రు. 1/—. ఈపూర్తి ఎంట్రీ ఫారము |4 కూపనులకు| ఫీజు రు. 4/— M. O. రసీదు / I. P. O. / లిట్‌క్విజ్ క్యాష్ రశీదు/ప్రైజు కార్డు జతపరుస్తున్నాను. వాటి నెం. ..........................

నెం. 79 ఫారములు పొందుటకై దీనిని పూర్తిచేయండి

IN ENGLISH: CAPITAL LETTERS

| | | |
|---|---|---|
| FULL NAME .............................. | 78 (ASVP) | FULL NAME .............................. |
| .............................. | | .............................. |
| ADDRESS .............................. | | ADDRESS .............................. |
| .............................. | | .............................. |
| .............................. | | .............................. |
| POST............ DIST............ | | POST.................DIST............ |

ఈ పూర్తి ఫారము కత్తిరించి పంపవలెను

గమనిక. ఇవ్వబడిన క్లూసులు వీనికి రచయిత వాడిన పదములే సరియైన జవాబులు అఫిషియల్ సొల్యూషన్ తేదీ 21–2–71 గల సండే స్టాండర్డ్ సిటీ ఎడిషన్ [కడపటి పేజీ వందున్నా, బహుమతుల పట్టి లిట్‌క్విజ్ వీక్లీ అద్వాన్సు—28–2–71 యందును పూర్తిగ కుదింపబడి తేదీ 7–3–71 సండే స్టాండర్డు నందును కట్టింపబడగలదు. 30 పైసలు పంపి 9 భాషలలో, అనగా తమిళము, తెలుగు, కన్నడ భాషలందు గల లిస్టుమాలను పొందండి. మీ ఎంట్రీలతో 10 పైసల పోస్టు మీద మీ అడ్రసు వ్రాసి జతపర్చి పంపండి. అఫిషియల్ సొల్యూషన్ వంటలము. లిట్‌క్విజ్ వీక్లీ నగిరి వారిని కూడా వ్రాసి పొందండి.

# తమసోమా...

ఆ తోటలో కట్టేస్తానన్న...ఇల్లు...అప్పుడే అవన్నీ తనవైపోయినట్లు... వాటన్నిటినీ తాను అనుభవిస్తున్నట్లు ... పోలయ్య హృదయం ఆశతో, ఆనందంతో పరవశించి గంతులు వేస్తోంది! మనసు అందమైన సౌధాన్ని నిర్మిస్తోంది!! తీయని ఊహల్లో విహరిస్తోంది!!!

పోలయ్య అడుగులు వడివడిగా పడుతున్నాయి. అతనికి దగ్గర్లోనే ఒక కుక్క అరచింది.

'అప్రను! కుక్క అరవదూ, తనవేషాన్ని చూసి!'

పోలయ్య చిన్నగా, పిచ్చిగా నవ్వుకున్నాడు తనలోనే. ఆ కుక్క అరుపును దూరంగా మరో కుక్క అందుకొని వంత పాడింది. అవి ఒకటి కొకటి సహకరిస్తాయి. ఐక్యతగా వుంటాయి. మరి మనుష్యులలో ఆ గుణాలేవి?

మనుష్యులలో వర్గాలు! మనస్తత్వాలలో విభిన్నధోరణులు!! దురాశలరధానికి అన్యాయపు హయాలు అలంకరించి, అనేకమందిని తోకలుకట్టి హింసల బాజా భజంత్రీలతో ఊరేగిస్తున్నాడు రామిరెడ్డి!

పోలయ్య పడుస్తున్నాడు దురాశల ముళ్లమీద!

జీవిస్తున్నాడు మంటలుమండే కోరికల వలయాలమధ్య!!

ఆకాశంలో చుక్కలు తనను, తాను చేయబోయే పనిని పరీక్షిస్తున్నట్లు వున్నాయి అనుకున్నాడు.

పోలయ్య కళ్లల్లో రక్తపుజీరలు చీకట్లో దారిని, మనసు గమ్యాన్ని వెదుకుతున్నాయి.

నడుస్తున్న పోలయ్య ఆగి జేబులో నుండి సారాసీసాతీసి నాలుగు ఔన్సులు గొంతుకలో పోసుకున్నాడు. గవర్నమెంటు సారా ఎంత తాగినా పోలయ్యలాంటివారికి మత్తు ఇవ్వటంలేదు! నిషా కలిగించటం లేదు!!

స్తబ్దమైన వాడి ఆలోచనలకు ఆ రెండు చుక్కలు మళ్ళీ పడితేగాని చలనం రాలేదు! హుషారెక్కలేదు!! వేడెక్కి వాడి మస్తిష్కం అడుగులు వడివడిగా వేయి ...! ఆ అడుగులు హరిజనవాడవేపుగా ...యాయి. హరిజనవాడ చివర తనకు ... గుర్తులు దగ్గర పోలయ్య ఆగి పోయాడు. వాడంతా నిశ్శబ్దంగా, నిర్మానుష్యంగా వుంది. పేదరికానికి ప్రతినిధుల్లా చీకటిలో పూరిళ్లు కనబడుతున్నాయి.

పోలయ్యలో మానవత్వం నశించి దానవత్వం పురికొల్పింది! చుట్టూ చూశాడొకసారి! దూరంగా కుక్కల అరుపులు వినిపించుతూనే వున్నాయి.

జేబులోనుండి అగ్గిపెట్టె తీశాడు. మరోసారి అటు ఇటు చూసి అగ్గిపుల్ల గీసి ఇంటికి అంటించాడు, సిగరెట్టుకు అంటించినంత తేలికగా!

అంతే! మరుక్షణంలో మంటలు లేచాయి. ఇల్లంతా అంటుకోసాగింది. అగ్నితో గాలి స్నేహం చేస్తుంటే లేచిన మంటల్ని ప్రక్కల నున్న ఇళ్ళు సాదరంగా ఆహ్వానిస్తున్నాయి!

ఆ కాలుతున్న యింటోవారు ఒక్కసారి గొల్లుమంటూ లేచారు. భూకంపం వచ్చినట్లు! వాడవాడంతా మేల్కొంది,.. హాహా కారాలతో పెడబొబ్బలు పెడుతూ.

'మంటలు!......నీళ్ళు తీసుకరండి... నీళ్ళు' అంటూ కేకలేస్తున్నారు కొంతమంది.

ఆక్రందనలు, హాహా కారాలు, లేచిన మంటలతో మిన్నుముట్ట సాగాయి. అంత వరకు ఆవరించిన అంధకారాన్ని మంటలు తరుముతూ వెంటాడుతున్నాయి. దారిద్ర్య దేవతకు తోడ్పడుతున్నాయి!!

జనం కోలాహలం వినడమే తడవుగా పోలయ్య కాళ్లకు బుద్ధిచెప్పి గ్రామం వైపు పరుగు లంకించుకున్నాడు.

దూరంగా పారిపోతున్న వ్యక్తిని చూసి 'అడుగో పారిపోతున్నాడు పట్టుకుండి'! అన్నారెవరో. చీకటిలో అస్పష్టంగా కనిపిస్తూ పారిపోతున్న వ్యక్తిని పోల్చుకోలేక పోయారు. అతని వెనుక గుంపుగా వెంట బడ్డారు. తనవెంట దూరంగా వస్తున్న గుంపును చూసి పోలయ్య గుండెలు గుభేలుమన్నాయి. తాను పట్టుబడితే ఇంకేముంది! కాళ్లు, చేతులు కట్టి తీసి కెళ్లి మంటల్లో పడేస్తారనుకున్నాడు. ప్రాణాలు చేతిలో పెట్టుకొని సత్తువ కొద్దీ పరుగు తీశాడు, ప్రాణంపై తీపి కొద్దీ.

వెంట తరుముతున్న వారంతా వింత పరిగెత్తినా వాళ్లకు దూరంలో వున్న పోలయ్య హరిజనవాడకు, గ్రామానికి మధ్యన వున్న చెరువుగట్టు, వాళ్ళ కళ్లు కప్పి గ్రామంలోకి వెళ్లిపోయాడు.

రొప్పుతూ, రోజుతూ పరిగెత్తుతున్న పోలయ్య యింకా తాను ఆ చివరనున్న రామిరెడ్డి యింటి వరకు పరిగెత్తితే తన వెంట పరిగెత్తి వస్తున్నవారు రావచ్చు. లేక గ్రామములో ఎవరైనా లేచి తనను చూడవచ్చు అనుకున్నాడు. అప్పటికే తన ఒళ్లంతా పరిగెత్తుకు వస్తున్నప్పుడు రెండు, మూడు సార్లు పడిపోవడం వలన రక్కుకు పోయింది! మోకాళ్ళు, మోచేతులు రగిలి రక్తం కారుతున్నాయి అలసటతో నాలుక పిడచ కట్టుకుపోతోంది!

ఇక లాభంలేదు, వెంటనే ఎక్కడో అక్కడ దాక్కోవాలనుకున్నాడు. పోలయ్య హఠాత్తుగా ఒక పూరింటి ముందు ఆగి గోడ ప్రక్కగా చీకటిలో నిలుచున్నాడు. ఇంతలో గ్రామంలోనివారుకూడా లేచి కొంత మంది, మంటలు వస్తున్న హరిజన వాడ వేపు పరుగెత్త సాగారు. యింకా తను అలా నిలబడటంకూడా ప్రమాదమేనని తలచి ఆయింటి గుమ్మందగ్గరకెళ్ళి తలుపు కొట్టాడు. కొంతసేపటికి తలుపు తీసుకొని 'యెవరూ?' అంటూ ఒకామె బయటికి వచ్చింది తలపై ముసుగేసుకొని.

'హరిజనవాడ తగలబడి పోతోంది. అక్కడనుండే వస్తున్నాను అందరికీ చెప్పుదామని!! పాపం చాలాయిళ్ళు కాలి పోయాయి!' అన్నాడు పోలయ్య ఆయాసంగా అందమైన అబద్ధం ఆడుతూ!

'ఆ! హరిజనవాడ తగలబడిపోతున్నాదా?' అంటూ ఆమె వాకిట్లోకివచ్చి మంటలు వస్తున్నవేపుగా చూసింది, వెదికిన గుండెలతో.

'దాహంగా వుంది! కొంచెం మంచి నీళ్ళు!' అన్నాడు పోలయ్య అటు ఇటు చూస్తూ ఎవరైనా వస్తున్నారేమోనని.

నీళ్లిద్దామని యింట్లోకి వెళ్తున్న ఆమె వెనకాలే పోలయ్యకూడా ఇంట్లోకి వెళ్లి నెమ్మదిగా తలుపులు దగ్గరకు వేసి నిస్త్రాణగా గోడప్రక్క చేరబడ్డాడు.

ఇంట్లో దీపం గుడ్డి వెలుగు ...ది. ఇద్దరు పిల్లలు చాపమీద పడుకొని

వున్నారు.

ఆమె గ్లాసుతో నీళ్లుతెచ్చి పోలయ్య కిచ్చి దూరంగా నిలుచుంది. అలసిన పోలయ్య కానీళ్లు అమృతమయ్యాయి.

'ఎవరన్నా నీవు? హరిజనవాడకు నీవు ఎలా అంటుకుందీ?' అడిగిందామె నీరసమైన కంఠంతో.

'ఏమో! ఎలా అంటుకుందో తెలీదు' అన్నాడు పోలయ్య. అబద్ధం తొలాకు మసి వాడి ముఖాన్ని నల్లగ చేసింది. వాడి ఒళ్లంతా మంటగా వుంది. ఎవరైనా వచ్చి, తనను పోల్చి పట్టుకుంటారేమోనని గుండె దడదడగా వుంది.

ఆమె దీపం దగ్గరకువెళ్లి వత్తి పెద్దది చేసింది. ఇంటినిండా వెలుతురు పరుచుకుంది. ఆ వెలుతురులో తాగిన గ్లాసు ఆమె చేతికిస్తూ కృతజ్ఞతగా ఆమె కళ్లల్లోకి చూశాడు పోలయ్య

ఆమెముఖం వాడి విచారంగా వుంది. అప్పటివరకు ఏడ్చినట్లు ఆమె కనుబొమలు వాచి వున్నాయి. చెంపమీద కన్నీరు చారలు కట్టివున్నాయి. చెంప క్రిందుగా కుడిప్రక్క గెడ్డంమీద...పెద్ద పుట్టుమచ్చ! ఆమె...ఆమె...ముత్యాల!!... సందేహం లేదు...ముత్యాలే!!! పోలయ్య మనసు గట్టిగా నిర్ణయించుకుంది.

'ముత్యాలు!' అని పిలిచాడు అప్రయత్నంగా, అనుకోకుండా— పోలయ్య గ్లాసు తీసుకొని వెళ్తున్న ఆమెను ఆ పిలుపు విని హఠాత్తుగా వెనుకకు తిరిగి చూసిందామె

పోలయ్య ఆశ్చర్యంతో కూడిన ఆతృతతో 'అమ్మా...చెల్లీ!!...ముత్యాలూ!!!' అన్నాడు. కూర్చునవాడు లేస్తూ.

ఆ పిలుపు, ఆ పిలుపులోని ఆప్యాయత, అనురాగం, ఆమె ఎప్పటికీ మరిచిపోలేదు. అలా ఎవరు పిలుస్తారో? అలా తనను ఎవరు పిలవగలరో క్షణంలో గ్రహించిన ఆమె 'అన్నా!...పోలయ్యా! నీవా!!' అంది సంభ్రమాశ్చర్యాలు ముప్పిరి గొనగా.

'అవునమ్మా! నేనే! పోలయ్యని!! పోల్చుకోలేక పోతున్నావా? నా పరిస్థితిని చూసి!' అన్నాడు. పోలయ్య గుండెల నిండా సంతోషం నింపుకుంటూ.

'లేదన్నా! వేషం మారినా నీ పిలుపు నాకెప్పుడూ గుర్తే!!' అంది ముత్యాలు బరువుగా.

'పోలయ్య మనసు జ్ఞాపకాల దొంతర్లను తిరుగవేయ సాగింది.

పదిహేను సంవత్సరముల క్రితం ... దిక్కూ, మొక్కూ లేని తాను అదుపూ, ఆజ్ఞ లేకుండా పెరిగాడు. విచ్చలవిడిగా తిరిగాడు. శ్రీకాకుళం బస్సు స్టేండులో తోటి కుర్రవాళ్లతో బస్సులు కడిగేవాడు. తుడిచి క్లీనింగు చేసేవాడు. కండక్టర్లు డబ్బులిచ్చేవారు. రోజుకు రెండు, మూడు రూపాయిలు దొరికేవి. ఏ హోటల్లోనో తిని రాత్రులు బస్సుస్టాండులోనే ఏ బస్సులోనో పడుకొనేవాడు. బస్సుస్టేండే తనకు యిల్లూ, జీవితం అయిపోయింది.

చెడుసావాసాలు మొదలై క్రమంగా చిన్నచిన్న జేబు దొంగతనాలు చేసేవాడు. జీవితంలో ఏదో అనుభవించాలని వుండేది. మనసులో తీరని కోర్కెలు అప్పుడప్పుడు బుసకొడుతూ వుండేవి. బలహీనతల్ని రెచ్చగొట్టే కోరలు చాస్తుండేవి. చేతులో ఎక్కువ డబ్బున్నవాడు బస్సు స్టాండులో రాత్రులు పేకాటాడేవాడు,

ఒకనాడు జేబు దొంగతనం చేసి బస్సు స్టాండులోనే దొరికి పోయాడు. అందరి చేత చావుదెబ్బలు తిన్నాడు. స్పృహలేక పడివున్న తనను బస్సులపై లగేజీ వేసే కలాసి గంగన్న జాలిపడి వాళ్లింటికి తీసుకెళ్లాడు. ఆ రోజే తనకు వళ్లు తెలియని జ్వరం వచ్చేసింది. మగతగా ఏవేవో కలవరించేవాడు. తన జీవితం చావు బ్రతుకుల అంచులమీద వూగిసలాడింది.

గంగన్నా, అతని కూతురు ముత్యాలు తనకు జ్వరం తగ్గేవరకు కంటికి రెప్పలా కాపాడేరు. దెబ్బలువలన తగిలిన గాయాలు పూర్తిగా మానేదాక సేవచేసి తన ప్రాణాల్ని రక్షించారు. తనను వారి కుటుంబంలో ఒకనిగా చేసుకున్నారు ఆ నాటినుండి వాళ్ల యిల్లే తనకు స్వంత యిల్లయింది.

ఆ రోజునుండి గంగన్న ముత్యాలకే కాదు, తనకు కూడా తండ్రిలాంటి వాడయ్యాడు!

రోజూ గంగన్నతో బస్సుస్టేండుకు వెళ్లి బస్సులపై లగేజీ వెయ్యడంలోను, దించడంలోను సహాయపడేవాడు. ముత్యాలును 'చెల్లీ' అని పిలుస్తూ, ఇంటి పనుల్లో సహాయ పడుతూండేవాడు.

గంగన్న పెంపకంలో, ముత్యాలు, సాహచర్యంలో తనలో చాల మార్పు వచ్చింది. తన జీవితవిధానమే మారిపోయింది. గంగన్న తనపట్ల చూపే ప్రేమ, అభిమానం. ముత్యాలుచూపే సోదరభావం, ఆప్యాయత తనను ముంచెత్తేవి తనకు 'నా' అనే వాళ్లు ఎవరూ లేరన్న బెంగ తొలగిపోయింది. రక్తసంబంధం కన్నా అతీతమైన అనుబంధమేదో ముత్యాలును, తనను బందీచేసింది.

తను ఒకదారిన పడి, తన జీవితం సరైన మార్గంలో పయనిస్తోందనుకొంటున్నంతలో, తాను ఒక మానవుడవుతున్న తరుణంలో తనను దురదృష్టం కాటేసింది మళ్లీ!

తాను చేయని దొంగతనం తనపై పడింది. మనిషిలో మాయంమానినా మచ్చ పోనదన్నట్లు అందరూ ఆ దొంగతనం తనే చేశాడన్నారు! పాతవాడే నన్నారు!! గంగన్న ఎంతకాదని మొత్తుకున్నా, తానెంత మొరపెట్టుకున్నా ఎవరూ వినలేదు. పోలీసులు అరెస్టుచేశారు. తరువాత తనను విశాఖపట్నం జైలుకు తీసుకు పోయారు.

తానా రోజునుంచి ఎప్పుడూ మళ్లీ



రాష్ట్రమంత్రి శ్రీ గిరిగారికి గౌరవహోమియోపతి వైద్యులుగా నియమితులయిన డాక్టర్ ఎస్. కుటుంబరావుగారు. వీరు గుడివాడ హోమియోపతి కాలేజికి ప్రిన్సిపాలు వీరు ఎం.బి, బి.ఎస్., డి. హెచ్. ఎమ్. పట్టభద్రులు.

పోలేదు. జైలు కెళ్ళిపోతూ తనను ఒక వ్యక్తిగా, నిండు మానవునిగా మార్చిదిద్దుతున్న దేవతలాంటి గంగన్నకు, ముత్యాలుకు, తన ప్రాణాల్ని రక్షించిన ఆ మానవులకు హృదయం ద్రవిస్తుండగా, కళ్ల వెంట అశ్రువులు కారుతుండగా, చేతులెత్తి దండంపెట్టి సెలవు తీసుకున్న దృశ్యం ఈ నాటికీ కళ్లముందే కదులుతోంది!

కట్లు తెంచుకున్న దుఃఖంలో నిలబడిన గంగన్న, అశ్రుసిక్త నయనాలతో మాటలురాని మూగవానిలా, తన వేపు చూస్తున్న ముత్యాలుకు మరోసారి మనసులోనే నమస్కరించి కళ్ళు తుడుచుకుంటూ పోలీస్‌వాన్ ఎక్కాడు.

ఐదు సంవత్సరములు విశాఖపట్నంలో జైలుశిక్ష గడిపిన తరువాత మళ్లీ శ్రీకాకుళం వెళ్ళాడు. తాను గంగన్నగురించి తెలుసుకోగా, గంగన్న అంతకు సంవత్సరము క్రితమే, బస్సుపై లగేజి వేస్తూ, కాలుజారి పడిపోవడాని తలకు బాగా దెబ్బ తగలడంవలన కొన్నాళ్లు జనరల్ హాస్పిటల్‌లోనే చనిపోయాడని చెప్పారు. ముత్యాలును బంధువులెవరో వచ్చి గోదావరి ప్రాంతం తీసుకెళ్ళి పెళ్లిచేసారని తెలిసి తాను అనుభవించిన దుఃఖానికి అంతులేకపోయింది.

నీతిగా, నిజాయితిగా తాను బ్రతకలేకపోయాడు. ఒకనాడు తను అలా బ్రతకడానికి ప్రయత్నిస్తే యీ లోకం తనను అలా బ్రతకనివ్వలేదు. చేయని నేరం తనపై మోపి కఠినశిక్ష విధించి! తన జీవితాన్ని నాశనం చేసింది!!

బ్రతుకులోని నిరాశ నిస్పృహలు తనను మానవత్వానికి దూరం చేశాయి. జీవితంపై కసి, సమాజంపై తీరని కక్ష కలసి తనను దానవత్వం వేపు నడిపించాయి!!

ఆ ప్రాంతాల్లో వుండకూడదని నిర్ణయించుకున్నాడు. దూరంగా వెళ్లిపోయాడు. క్రమంగా దొంగ సావాసాలు, పాత అలవాట్లకు బానిస అయ్యాడు. దారంతెగిన గాలిపటంలా తిరుగసాగాడు.

ఆనాడు జైలుకు వెళ్తున్నప్పుడు కన్నీరు పెట్టుకుంటూ తనకు వీడ్కోలు

# తమసోమా...

యిచ్చినపుడు చూసిన ముత్యాలు...మళ్లీ...యీనాడు... తన ఎదుట ... పోలయ్య గతంలోనుండి వర్తమానంలోకి వచ్చాడు.

* * *

'చెల్లీ!... ముత్యాలు!!' అన్నాడు. పోలయ్య ఆప్యాయంగా ఆనందంగా.

'అన్నా! యిన్నాళ్లు నీకు మేము గుర్తుకు రాలేదా?' ముత్యాలు బాధగా, బరువుగా అడిగింది.

'లేదు చెల్లీ! జైలునుండి వచ్చిన తరువాత నీ జాడే తెలియలేదు' అన్నాడు పోలయ్య కృశించి, నీరశించిపోయిన ముత్యాలు ముఖంలోకి చూస్తూ.

చాపమీద పడుకున్న మూడేళ్లపిల్ల నిద్రలో లేచి ఏడుస్తుంటే ముత్యాలు ఆ పిల్ల దగ్గరకెళ్లి సముదాయిస్తోంది.

'అమ్మా! ముత్యాలు! బావ ఏడమ్మా? ఎక్కడికెళ్లాడు?' అన్నాడు పోలయ్య పిల్లలిద్దర్నీ చూస్తూ, అప్పటికే ఆ మాట అడగడం ఆలస్యమైనట్టు.

'నీ బావమరిదా? అదుగో ఆ గదిలో వున్నాడు! చూద్దువుగాని రా...అన్నా!' అంది గంభీరంగా. పోలయ్యకూడా మౌనంగా అనుసరించాడు.

'అదుగో నీ బావమరది! చూడన్నా!!' అంది ముత్యాలు గదిలో ఒక పాత టేబిల్ మీద పువ్వులదండ మధ్య చిరునవ్వుతో వున్న ఫోటోను చూపిస్తూ, దీపం వెలుతుర్లో వస్తున్న దుఃఖాన్ని ఆపుకోలేక ముత్యాలు కుప్పలా కూలిపోయింది. ఫోటోను చూసిన పోలయ్య త్రుళ్లిపడ్డాడు! నిశ్చేష్టుడై అలాగే నిలబడిపోయాడు!! నోట మాట రాలేదు. ఆ ఫోటో...అతను కాళ్ల క్రింద భూమి బ్రద్దలవుతున్నట్లుగా పోలయ్య తల గిరగిర తిరిగి పోతోంది. నరాలు బిగుసుకుపోతున్నాయి. గుండెలో ఏదో ఆందోళన! ఘోష!!...దడ!

'అన్నా! చూడరా మీ బావని! రెండు వారాల క్రితం ఎవరో మీ బావను పంతం పట్టి...కక్షకట్టి... సాయంత్రం చీకటి పడుతుండగా పొలంనుండి వస్తుంటే... తోటదగ్గర...కత్తితో... పొడిచి చంపేశారు. ...నా మంగళసూత్రాన్ని తెంపేసారు!!...యీ పాడెలక్షన్లు, పార్టీలు నా భర్తను పొట్టన పెట్టుకున్నాయి! నాకు, నా పిల్లలకు అన్యాయం చేసి, పుణ్యం కట్టుకున్నారు!...' ముత్యాలు మరి మాట్లాడలేక వెక్కివెక్కి ఏడవసాగింది, గుండెలు ద్రవించేలా! ఆ యేడుపుకు పిల్లలిద్దరూ లేచివచ్చి తల్లిని చుట్టేసుకొని బావురుమన్నారు.

పోలయ్య ఆమాటలు వినలేకపోతున్నాడు. ఆ దృశ్యం చూడలేకపోయాడు.

'చంద్రయ్య!...ముత్యాలు భర్త తన చేతులతో తానే చంపాడన్నమాట! రాక్షసుడై కత్తితో తానే పొడిచేడన్నమాట!! తన చెల్లెలి మంగళసూత్రాన్ని తనచేతులతోనే తెంపేసాడు!!!' పోలయ్య నోట్లోనే అస్పష్టంగా అనుకున్నాడు.

ఆరోజు తోటలో దృశ్యం యింకా తన కళ్లముందే కట్టినట్టుంది? దామిరెడ్డి పురమాయించిన ప్లాను ప్రకారం, మరికొందరితో తాను, ఎదురుపడుతుండగా పొలంలోనుండి వస్తున్న చంద్రయ్యను తోటమధ్యకు రానిచ్చి, కత్తితో పొడిచి తానే క్రూరంగా చంపేడు. చంద్రయ్య ఆ కత్తిపోటుకు బాధతో నేలకొరిగిపోయాడు.

'అమ్మా!' అని పెట్టిన ఆ ఏడుపు కేక యింకా తన చెవుల్లో గింగురుమంటూనే వుంది. తానారోజు దానవుడిలా ప్రవర్తించాడు. నాలుగైదు రోజులవరకు రాత్రులు తనకు ఆ దృశ్యమే కనబడి కలవరపెట్టింది.

'ఎవరైతే ఒకనాడు దిక్కూమొక్కూలేని తనను ఆదరించి ఆశ్రయమిచ్చారో, వారికే ఘోరమైన అన్యాయం తన చేతులారా చేశాడు. బాధ...ఆవేదన...పశ్చాత్తాపం... పోలయ్య గుండెల్ని పిండివేస్తున్నాయి! మనసును దహించి వేస్తున్నాయి! పోలయ్యలోని దానవత్వంపోయి మానవత్వం చోటు చేసుకుంది! !!

'చెల్లీ! నీకు చాలా ... ఘోరమైన అన్యాయం జరిగిపోయిందమ్మా' అన్నాడు పోలయ్య, ముత్యాలు తలపై చేయివేసి దగ్గరకు తీసుకుంటూ, భారమైన గుండెల్ని తేలిక చేసుకొని! అతని చెంపలపై కన్నీరు చారలు కట్టింది.

'మేమెవరికీ అన్యాయం చేయలేదు.

(16వ పేజీ చూడండి)

# జైల్లో సంబంధం!

సెప్టెంబర్ 1969లో గ్రెండన్ అండర్‌వుడ్ జైలులో దొంగతనం కేసులో జైలుశిక్ష అనుభవిస్తున్న జాన్‌మెయిన్ అనే అతన్ని చూడటానికి మిసెస్ బ్రాన్డన్ అనే ఆమె వెళ్లిందట. తదుపరి ఆమె యీనాడు గర్భిణి అయ్యిందట. దీనికి తాను ఏవిధంగాను బాధ్యుడు కానని ఆమెభర్త ఆమె మీద, ఆమె ప్రవర్తన మీద కేసుపెట్టి విడాకులు కోరాడట. ఈ విషయం మీద బ్రాన్డన్ మాట్లాడుతూ జైలులో వున్న జాన్‌మెయిన్‌ని చూసి నపుడు జైలు అధికారుల సహాయంతో తానతనితో లైంగిక సంబంధం పెట్టుకున్నట్టు, వోగంట తరువాత యింటికి వచ్చేసినట్టూ అన్నదట. జైలులో యిలాంటి వాటికి కాస్త సదుపాయం ఉండడం, అక్కడివారు సహకరించడం చాలా మంచి విషయమని కూడా ఆమె అన్నదట. జాన్ మెయిన్ కూడ తనామెను కలసినట్టు ఒప్పుకున్నా జైలు అధికారులు మాత్రం వప్పుకోలేదట. జైలులో అలాంటి వాటిని వప్పుకోటానికి వీలుండదని, యిది నమ్మరానిదనీ, వారన్నారట. అందరూ ఎప్పుకునే విషయం వుంటుందా!

## ట్రాన్సిస్టర్ ముచ్చట

రాబర్ట్‌సన్ పేటలో బస్ స్టాండువద్ద వో ప్రయాణికుడు బస్సుకోసం నిలబడ్డాడట అతని




చేతిలో ట్రాన్సిస్టర్ని చూసిన పురుషోత్తమన్ అనే వో యువకుడు ముచ్చట పడి, నెమ్మదిగా అతని పక్కకు చేరి, చటుక్కున ఆ ట్రాన్సిస్టరూడలాక్కుని కాలికొద్దీ పరిగెత్తాడట. దొంగ దొంగ బాబోయ్ అని ట్రాన్సిస్టరు సొంతదారు గావుకేక లేసేసరికి డ్యూటీలో వున్న పోలీసు ఆ పురుషోత్తముణ్ని పట్టేశారట.

# ఒక వారం విపరీతం

ఫాలాక్షుడు

## అమెరికాలో యువతరంవారి భావాలు!

యునైటెడ్ స్టేట్స్‌లో యువజన వాహినంతా పెళ్లికి ముందు లైంగిక సంబంధం వుంటే ఏమీ తప్పులేదని, ఆ మాటకు వస్తే ఆ రకమైన సంబంధం వుండి తీరాలని అనుకునే పద్ధతికి వచ్చేశారని పెన్సిల్వేనియా విశ్వవిద్యాలయం సోషియాలజీ ప్రొఫెసరు డాక్టర్ బ్రోడెరిక్ విన్నవించారట. కట్టిన లెక్కల ప్రకారం ఒడవారు 10 నుంచి 30 శాతం వరకూ వివాహానికి ముందు లైంగిక సంబంధాలు కలవారు వుంటున్నారని, కొన్నిచోట్ల యీ శాతం యాభై వరకు పెరుగుతోందని కూడా ఆయనన్నారట— గ్రోయింగ్ వరల్డ్.

## 'పొగతాగం' సప్తాహం!

ఇంగ్లడుకు చెందిన లాన్‌గ్నర్ అనే గ్రామవాసులంతా చేరి, 'పొగత్రాగము' సప్తాహం చేసుకున్నారట. ఆ వారం రోజులూ ఊరిలోని [పొగ త్రాగువారు] వారంతా ఆ పని మానేశారట. దీనితో హోటొమ్మండుగురు మాత్రం కలవలేదట. ఈ వారమే గాక, ఎప్పటికి కూడా పొగత్రాగకుండా వుండడానికి ప్రయత్నిస్తామని చాలామంది వుత్సాహపడ్డారట. ఈ వుత్సవభారాన్ని నెత్తిన పెట్టుకుని జయప్రదంగా జరిపిన ఐమె తాప్సు సనే అనే ఆయనకు 72 ఏళ్లట. ఆయనకు సిగిరెట్టు కాల్చడం పైపుకాల్చడం పొగాకు నమలడం వంటివి అలవాటున్నాయట.అంతా సిగిరెటు మానేస్తే ఆకంపెనీలు ఘూతపడితే దేశాల్లో నిరుద్యోగ సమస్య యింకా ఎదగదూ..

## కుక్క నోట్లో పసిగుడ్డు

ఐదురోజుల పసిగుడ్డును నోట కరచుకుని, వోకుక్క హాబ్లీ [మైసూరు రాష్ట్రం] మార్కెట్టుకు పరిగెత్తుకు వచ్చిందట. ఈ దారుణం చూసిన జనం ఆ కుక్క నదిలించేసరి కది తన నోట్లోంచా బిడ్డని వదిలి పారిపోయిందట. ఐదు రోజుల ఆ పసిపిల్లాడికి పొట్టమీద, మెడమీదా బాగా గాయాలయ్యాయట. ఆసుపత్రిలో చేర్చాక చనిపోయాడట— చాలా సంతవత్సరాల క్రితం గుంటూరు రాసుపత్రిలో పసిగుడ్డును కుక్కలు నోట కరుచుకు పోయా యిలానే!

## ఆదాయపు పన్ను అధికారి ఇంటిమీద పరిశోధనశాఖవారిదాడి!

కేంద్రప్రభుత్వ పరిశోధనాశాఖ ఢిల్లీలో ఆదాయపు పన్ను శాఖ అధికారి గారింటి మీద చేసిన సోదాలో 1,79,000 కిమ్మత్తయిన నగానట్రా నగదూ దొరికాయట. వీటికి ఎక్కడా జమాఖర్చు లెక్కలు లేవట.

## ఉద్యోగాలు కావాలా?

జపానులో బాబూ! మీ కెవరికైనావుద్యోగాలు కావాలా అంటూ కంపెనీల ఏజంట్లు ఇళ్ల వెంట తిరుగుతున్నారట. మాకంపెనీలోనే చేరుతామని రాసిస్తే మీకు పెద్ద చదువులుకూడా చెప్పిస్తాం అని కూడా వాగ్దానాలు చేస్తున్నారట. అక్కడ వుత్పత్తివుతున్న వుద్యోగాలకన్నా వుద్యో




గాల, సుమారైదురెట్లు ఎక్కువట. దీనితో వుద్యోగుల వేట ప్రారంభించి, కావాలంటే జర్మనీ కూడా మిమ్మల్ని పంపిస్తాం అని ఆశ పెడుతున్నా పెడుతున్నారట. అయ్యో! పోసి పొరుగ.దేశమైన మనదేశం నుంచి అప్పుగా కొన్నిలక్షల మందిని పట్టుకెళ్ళరాదూ!! హౌ వుయ్ విష్.టుబి ఇన్ జపాన్.

## హోటల్లో దౌర్జన్యం!

పారిస్‌లోని హోటళ్లలోకి పోయిన ఆదివారం సాయంత్రం 10 న తేది] వో అరడజను మంది గుండాలు తుపాకులతోను, మెషిన్ గన్‌లతోనూ, జొరపడి అక్కడున్న 30 మంది మగవారినీ, ఆడవారిని కూడా బట్టలు విప్పి నగ్నంగా తయారవ్వమని వారు విప్పిన బట్టల్లోని డబ్బు దస్కం ఎత్తుకు పోయారట. హవురవురా!!!..

* * *

ఢిల్లీ, కైలాష్ నగర్‌లో జాస్సీ నైన్‌సింగ్ అనే యిద్దరు వ్యక్తులు మస్తుగా తాగి తందానాలాడతుంటే 22 ఏళ్ళ పృధ్విరాజా వారి ప్రవర్తనను ఆక్షేపించాడట. దాంతో వారికోపం వచ్చి పృధ్విరాజుని పొడిచి చంపేశారట.

## స్టేట్ బ్యాంక్ లో రు. 18,71,000 అపహరణ!

ఏడవతేదీ మిట్టమధ్యాహ్నం వేళ చిత్తరంజన్ స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా బ్రాంచిలో వో ఐదుగురు వ్యక్తులు ప్రవేశించి, అక్కడి వాళ్ళను హెచ్చరించి, లోపల బాంబులు వంటివి పేల్చి చిత్తరంజన్ లోకో మోటార్ వర్క్స్ గార్డ్సు బ్యాంకులో వేయడానికి తీసుకెళ్ళిన 18,71,000 రూపాయలనూ అతని వద్దనుంచి ఊడలాక్కుని పారిపోయారట. ఆ గార్డు కాస్సేపు పెనుగులాడేసరి కాతన్ని వారు చంపేశారట. ఇదంతా కొన్ని క్షణాల్లో అయిపోయిందట. ఈ కేసు సందర్భంలో పోలీసు ఆరా తీసి, ముగ్గుర్ని అరెస్టు చేసిందట. ఆముగ్గురూ అన్నదమ్ములట వారిలో ఒకతను ప్రభుత్వ — కళ్ళజోడు అద్దాలు చేసే ఫ్యాక్టరీలో పని చేస్తున్నాడట. అతనివద్ద 1.26 లక్షలు దొరికిందట.

* * *

హేంబర్గ్ కోర్టులో 33 ఏళ్ళ యుగోస్లావ్ ముస్లిమ్ యువకుడు తాను మత్తు పదార్థం సేవించలేదని, తాను కేవలం బీరు త్రాగినట్లూ ఇస్లాం ఆల్కహాలు త్రాగుడు నిషేధించిందని, అందులో బీరును గురించి చెప్పలేదని అన్నాడట. కనుక తను ఇస్లాం లెక్క ప్రకారం తాగనట్టే లెక్క అనేశాడటా యువకుడు.



# ఒకవారం విపరీతం

## లైట్స్ ఆన్

19వ తేదీన జాదవపూర్ లో వో మార్క్సిస్టు వ్యక్తి, మధ్యామ్ గ్రామ్ స్టేషను ప్రాంతంలో శ్యామల్ దత్తా అనే వో ఫార్వర్డ్ బ్లాక్ వ్యక్తి హత్య చేయబడ్డారట. 18వ తేదీ రాత్రి నుంచి 19వ తేదీ నాటికి కలకత్తాలోనూ, పశ్చిమ బెంగాల్లోనూ, కలిపి కనీసం 9 హత్యలు లెక్కకు తేలాయట. 13 మంది తీవ్రంగా గాయపడ్డారట.

ఉత్సాహంతో కొంతమంది యువకులు [కలకత్తా] మణీంద్ర చంద్ర కాలేజీ మీదపడి ఆఫీసు కాగితాలన్నీ తగల బెట్టారట. ప్రిన్సిపాలుగారిరూములో వారు పెట్టిన బాంబును పేలేలోగా పోలీసులు వశ్చేసుకున్నారట.

కలకత్తాకు చెందిన ఉలుడంగాలో ముగ్గురు సి. పి. ఐ— యమ్ వ్యక్తులను పట్టుకు పోయారన్న వార్తను రూఢి చేసుకుని విచారించడానికి పోలీసు




బలగం అక్కడికు వెళ్ళే సరికి అక్కడి నక్సలైటులు వారికి బాంబులతోనూ, తదితర ఆయుధాలతోనూ స్వాగతం పలికారట. ఈ స్వాగతాన్ని అణచడానికి పోలీసులు తప్ప నిసరిగా కాల్పులు చేయవలసి వచ్చిందట.

కలకత్తాకు చెందిన మక్తలలో వో ఇంజనీరింగ్ కంపెనీ వర్క్సు మేనేజరు కారుమీద [ఎవరో] విరివిగా బాంబులు వేసి, కారును కదలకుండా చేసి, కారులోని వారందర్నీ ఇనపకమ్మీలతో కొట్టారట.

దక్షిణ కలకత్తాలో అసిస్టెంటు పోలీసు కమిషనర్ మిస్టర్ చక్రవర్తి 21వ తేదీ రాత్రి తన డ్యూటీ ముగించుకుని, జీపులో యింటికి వెళ్తుండగా ఎవరో జీపుమీద బాంబు విసిరారట. గురితప్పి ఆ బాంబు జీపును ఏమీ చేయలేక పోయేసరికి బాంబు విసిరిన వ్యక్తి ఆవేశంతో మరో బాంబు విసరబోతే అది అతని చేతిలోకే పేలిందట. దాంతో అతను గావుకేక వేసేసరికి పోలీసులకు దొరికి పోయాడట పాపం!! ●

# తమసోమా...


(14వ పేజీ తరువాయి)


అయినా భగవంతుడు మాకు అన్యాయం చేశాడు! ఈ పిల్లల్ని దిక్కులేనోళ్ళని చేశాడు!!' అంది ముత్యాలు దుఃఖాన్ని దిగమింగుతూ పిల్లవంక చూసి.

'దేవుడు కాదమ్మా! నీ కన్యాయం చేసింది!...ఈ...మనుషులే... నీ కన్యాయం చేశారమ్మా!!' అన్నాడు పోలయ్య గాద్గదికంగా.

'అన్నా! నిన్నొకటి అడగాలనుంది, ఈ అభాగ్యురాలికోరికి తీర్చుతావా?' అంది ముత్యాలు తేరుకొని ప్రాధేయపూర్వకంగా.

'అడుగమ్మా! నీవేదడిగినా ఈ... అన్న కాదనడు...కాదనలేడు! సందేహించక చెప్పు తల్లీ!' అన్నాడు పోలయ్య ఆత్రుతగా.

'దేవుడిలా వచ్చావు. ఈ దిక్కులేని పిల్లలకు, నాకు, నీవాసరాగా, అండగా వుంటే కాయకష్టంచేసి ఈ పిల్లల్ని పోషించుకోగలను! నామాట కాదనకన్నా!' అంది ముత్యాలు పోలయ్య విచారం గూడు కట్టుకున్న ముఖంలోకి చూస్తూ ప్రాధేయపూర్వకంగా.

'అలాగే చెల్లీ! నీమాట కాదనను నా కంఠకంటే వుణ్యాం... ఏం కావాలి తల్లీ! కానీ మనం ఇక్కడుండొద్దమ్మా! ఇక్కడ మనం బ్రతకలేం. మనల్ని మనుషులుగా బ్రతకనివ్వరీ రాక్షసులు! ఎక్కడికైనా వెళ్ళిపోయి కష్టపడి బ్రదుకుదాం. పదమ్మా! ఇట్టాఅదీ సర్దుకో ... యిపుడే తెలవారేసరికే ఎవరికీ తెలియకుండా వెళ్ళిపోదాం!' అన్నాడు పోలయ్య నిండైన మానవుడై.

కొద్దినిముషాల తరవాత చీకటిని మింగేస్తున్న వెలుగు రేఖలు విచ్చుకుంటుండగా పశ్చాత్తాపదగ్ధుడై, మేల్కొన్న మానవత్వంలో పునీతుడైన పోలయ్య, ముత్యాలు యిద్దరు పిల్లల్ని ఎత్తుకుని ఆ వెలుగురేఖల దిశగా నడిచిపోసాగాడు. ●

బస్సాగింది.

చుట్టూ జనం. తోపర్లించి దిగే జనం. దిగే జనాన్ని ఎక్కించుకోడానికి బళ్ల జనం బయట్నించి గోల.

ఎర్రటి బూడిద గాలిలోకి యెగు రో్తంది.

కడుపులో ఆకలి. కోపం. చిరాకు. ఆలోచనలు.

ఇంకా దిగనేలేదు

'అబ్బాయిగారో! రేవుకి బండేత్తాను.'

చేతిలో బరువుగా ఉన్న బేగ్ వాడి మొహాన్ని కొట్టాను.

'రండి బాబో! పెసల్‌గా యెల్లి పోదాం.'

బండివాడు పరుగందుకున్నాడు.

వెనక నేనూ!

'ఏవిమ్మంటావోయ్?'

'అయబాబో! మీకు తెల్దంటి?'

'చెప్పు— సిగ్గుపడక—'

'నాల్రూపాలియ్యండి— పెసల్‌గా తోలేత్తాను.'

'నాలుగు రూపాయిలే!'

'పోనీ మూడున్నరిత్తారా?'

'మేడమీదున్నావేవిటోయ్!'

'మేడమీదుండేవోల్లు మీరు బాబో! ఎక్కండెక్కండి.'

'రూపాయిన్నర పుచ్చుకో.'

'నయం! పావలా యిత్తానన్నారు కాదు!'

'పద!— రెండురూపాయ లిస్తాను.'

'అన్నీ తెలుసున్నోల్లు — తవరే అలా బేరవాడితే ఎలాగ బాబో! ఎక్కండి మూడురూపాయిలిద్దురుగాని...'

ఇంక లాభంలేదు. మరొక్కమాటంటే బేగ్ విసిరేస్తాడు.

బండి బయలుదేరింది.

ఆరేళ్ల తర్వాత అమలాపురం కొత్తగా ఉంది. మనుష్యులు కొత్తగా ఉన్నారు. మాట కొత్తగా ఉంది.

బక్క గుర్రం.

బండివాడు బండబూతులు తిడ్తున్నా గుర్రం గుడ్డినడక నడుస్తోంది.

ఆరేళ్ల తర్వాత పరాయి రాష్ట్రం నించి యింటికొస్తున్న నాలో సవాలక్ష ఆలోచనలు సందడి చేస్తున్నాయి. ఆరేళ్ల పర్యంతం స్వగ్రామం మీదా, స్వజనం మీదా కన్న కలలన్నీ ఆలోచనల ద్వార బంధాల వెనక నిలబడి ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి.




గతుకుల రోడ్డు.

బండిగూడు నా తలని బాధిస్తోంది.

ఆనంద గురించి ఆలోచన కూడా అదే మాదిరి.

అందమైన అమ్మాయి జీవితంలో ప్రవేశించనంతకాలం అది ప్రశాంత సరోవరం. వన్నెచిన్నెలున్న కన్నెపిల్ల బ్రతుకులో కాలుపెట్టిందో యిక బ్రతుకొక సమస్యల పుట్ట.

ఆనంద నాకు తెలిసినంతకాలం ఆనందంగా గడిచిపోయింది. ఆ పిల్ల నన్ను చూచి నవ్విన మరుక్షణం నించి నేను నేను కాదు.

ఆనంద మా మేనమామ 'కూతురు కాదు. స్వప్నసుందరి కాదు. నేను అయిదో క్లాసులో ఉండగా పరిచయమైంది. హైస్కూలు విడిచేవరకూ నాతోబాటే బతికింది ఆ తరవాత నేను ఊరు విడిచి, నాడు విడిచి పరాయి రాష్ట్రానికు వెళ్లిపోయాను.

ఆనంద పూర్తి పేరు ఆనందలక్ష్మి. ఆనంద అంటేనే నాకిష్టం. ఆమె కూనూ!

'నువ్వు రేపు వెళ్లిపోతావు. నువ్వు లేకుండా నాకేం తోచదు' అంది ఆనంద— ఆ సాయంకాలంపూట— దొడ్లో చిక్కుడు పాదు వెనుక.

నిజమేనేమో !

'మళ్ళీ ఎప్పుడొస్తావ్?'

'అసలు ముందు వెళ్ళనీ!' అన్నాను.

అంతవరకూ దాచుకున్న దుఃఖం వరద లాగ, వెనుతుఫానులాగ పెల్లుబికి ఆమె చెక్కిళ్ళమీంచి ప్రవహించి పోతూంటే నాకు నోటమాట రాలేదు.

ఆనందకు నామీద ఇంత యిష్టమా!

ఆనందకు నేను లేకపోతే యింత కష్టమా!

ఆనందకు నా తోడిదే బ్రతుకని పిస్తోందా!

ఆమె కప్పుడు పద్దెనుగేళ్ళు. నాకు పదహారు. ఆమె తండ్రి ఎలిమెంటరీ స్కూల్లో టీచరు. మా నాన్న బోలెడంత ఆస్తి సంపాదించిన మనిషి. ఆనందకు అక్క చెల్లెళ్ళు లేరు. అన్నదమ్ములేరు. నాకూను. ఒక్కగా నొక్క కొడుకుని. కొంపకి కొంచెం దూరంగా ఉంటేనేగాని చదువబ్బదని కాబోలు మా అబ్బ మద రాసు చదువుకు నన్ను ఒప్పించాడు.

ప్రయాణం ఆ మరువాడే! అందికే ఆనందకంత బెంగ.

థర్డ్‌ఫామ్ చదువుతూండగా నాకు టైఫాయిడ్. బాగా గుర్తుంది. ఇరవై రోజులపాటు ఆనంద నా మంచం పక్కనే వుంది.

నాకు జ్వరం తగ్గగానే ఆనంద మంచమెక్కింది. నాకు కళ్ళల్లో నీళ్ళు. నా బాధ చూచి, 'నీకు తగ్గిందిగా! నేను చచ్చిపోయినా ఫరవాలేదు' అంది ఆనంద.

పదిరోజుల్లోనే ఆనంద లేచి తిరిగింది.

ఆరేళ్ళుగా ఆ ఆనంద సంగతి తెలీ లేదు. నేను మదరాసు వెళ్ళాక నాలుగు ఉత్తరాలకు ఆనంద ఒక్కసారి రాసింది. ఆ ఉత్తరం నిండుకూ ఆనంద కన్నీళ్ళే!

ఆ తరవాత ఎన్ని ఉత్తరాలకూ ఆనందనించి జవాబు లేదు.

మదరాసులో ఉన్న నాలుగేళ్ళలోనూ ఒక్కసారీ నేను యింటికి రాలేదు. నాకే విటో ఆనంద మీద కోపం వొచ్చింది. ఉత్తరాలకు జవాబు రాయని పిల్లని చూడ కూడదనుకున్నాను.

మదరాసు మంచి నా మకాం బొంబా యికి మారింది. అక్కడ మా మేనమామ ఏదో కంపెనీలో పెద్ద ఉద్యోగం చేస్తు న్నాడు. మేనమామకో పెద్దకూతురు కూడా ఉంది. నాకంటె నాలుగేళ్ళు పెద్ద. గుణంలో నాకంటె చిన్నది కావాలనుకుంది.

బండి ఆగింది.




ఆలోచనల్లోంచి తుళిక్కిపడి తలెత్తాను.

ఎదురుగా కల్లోలిత గోదావరీ తరం గాలు.

నా మనసులోనూ!

దిగండి బాబూ!'

దిగాను.

పడవవాడు బేగ్ అందుకున్నాడు.

పడవలో ఒక్కడిని.

పెద్ద పెద్ద కెరటాలతో చుట్టూ గోదా వరి.

ఆలోచనలు మనిషికి బాహ్య జ్ఞానాన్ని పోగొడతాయి.

మనసుకు గతమంటే యిష్టం.

మాటి మాటికి నెమరువేయడమే ఆలో చనలకి అభిరుచి.

ఆనంద గురించే అన్నీ ఆలోచనలు.

ఒకరోజు అమ్మ అంది — 'ఆనందా! మవ్వెప్పుడూ ఈ యింట్లో ఉండి పోకూడదా!'

ఆనంద ఆశగా చూసింది.

నా వంక ఆనందంగా చూసింది.

అప్పుడే ఆనంద విషయమై నేనేదో ఒక నిర్ణయం చేసుకుని ఉండవలసిందని పిస్తోంది.

ఆనంద నాదే అయితే—

ఆనందను నా కష్ట సుఖాల్లో భాగం పంచుకోవలసిందిగా నా జీవితంలోకి ఆహ్వా నించి ఉంటే—

అప్పుడెంత బావుణ్ణు!

ఇప్పుడందుకని ఇంత విచారం!

గతం గుర్తొచ్చినపుడు మనిషి పశ్చాత్తాపం.

పోనీ— ఈ ఆరేళ్లలో ఎప్పుడో వో సారైనా ఆనంద కోసం నే వచ్చానా!!

ఆనంద మీద నాకిష్టం లేదా?

లేకపోవడమేమి!

మరెందుకు రాలేదు?

ఆనంద నా ఉత్తరాలకు జవాబెందుకు రాయకూడదు?

ఆనందకు పెళ్ళయితే—

అమ్మో! ఆనందకు మరెవడితోనో పెళ్ళా? ఇంకేమైనా ఉందా? నా గుండె గడ్డ కట్టుకు పోదూ! నా ఆశలన్నీ నిలువునా కాలిపోవూ! ఆనంద ఇంకొ డితో కాపరం చేయడమా! నా రక్తం

కళపెళలాడదూ!

ఇంతవరకూ నే చేసినది తప్పని పశ్చాత్తాప పడుతున్న వేళ ఈ ఆలోచన మరి భరించలేకుండా ఉంది.

ఆనందకిప్పుడు ఇరవయ్యేళ్ళుంటాయి. ఇంతవరకూ పెళ్ళి చేయకుండా ఉంటారా! ఇంత వయసొచ్చి పెళ్ళి చేయకపోతే లోకం బ్రతకనిస్తుందా?

మనిషి ఆలోచనకు వో తీరుండదు.

మనిషి ఆలోచనకు వో దారుండదు.

ఆలోచనకు అడ్డుండదు.

కూతురు పెళ్ళి ఏదోలా చేయక తప్పని స్థితిలో ఏదో ఒక ముసలాడు ఆనందకు పెళ్ళికొడుకుగా దొరికితే—

ఆనంద అప్పుడెంత బాధపడి ఉంటుంది?

నాకోసం ఎంతగా తపించి పోయి ఉంటుంది!

పోనీ—ఒక ఉత్తరమ్మక్కయినా రాయొచ్చుగా! ఆనంద నాకోసం విలవిల్లాడి పోతున్నదని తెలుసినప్పుడు నేను రెక్కలు కట్టుకు వాలక పోదునా!!

తరంగాలుగా తరంగాలుగా గోదావరి.

వలయాలు వలయాలుగా ఆలోచనలు.

ముసలి పెళ్ళికొడుకును తప్పించుకోవాలని ఆనంద ఎక్కడైనా పారిపోతే—

బతుకు మీద కోపం వొచ్చి—తన మీద తనకే కోపం వొచ్చి ఇంత విషం తాగితే—

నా ఆలోచనలు ఉరితాళ్ళుగా—

నా ఆలోచనలు ముళ్ళుగా—

నాలో ఎనలేని భయం.

ఆనంద కోసం తపన.

అవును వెంటనే చెప్పలేనంత ఆశ.

చలిలో మంచులో తడిసిపోతూ—

నిలబడ్డ మనిషికి ఉషాదయమౌతున్నప్పటికి ఆనందం.

ఆనంద పెళ్ళి చేసుకోదు.

ఆనంద పారిపోదు.

ఆనంద చచ్చిపోదు.

నా కోసమే—నా రాకకోసమే—నన్ను పెళ్ళి చేసుకోడం కోసమే ఎదురు చూస్తూంటుంది.

ఊగుతూ తూగుతూ పడవ ఒడ్డుకు చేరుకుంది.

ఆలోచిస్తూనే ఒడ్డుకు గెంతాను.

మళ్ళీ గుర్రబ్బండి.

12—2—71

'ఏం అబ్బాయిగారో! ఇంకా పెళ్ళి చేసుకోలేదేంటి?' అని అడుగుతున్నాడు బండి ఆసామీ:

నా ఆలోచనలు నన్ను ఉక్కిబిక్కిరి చేసేస్తున్నాయి.

ఒకవేళ ఆనంద దేశం మీదికి పారిపోతే ఎన్ని కష్టాలు పడుతూ ఉంటుందో! ఒంటరి ఆడది ఒకంతట సమాజంలో సరిగ్గా బతకలేదు. మిసమిసలాడే యవ్వనం మిరుమిట్లు గొల్పుతుంది.

ఆడదీ—ఆశా—

మనిషీ—నీడా!

అప్పుడు ఆమెమీద కోపం వొచ్చింది. ఆరేళ్ళ నాకెందుకుత్తరం రాయలేదు? రాయకూడదనే రాయలేదా? పెళ్ళి కట్టుకన్నవాడి కళ్ళల్లో కాంతి పుంజాలు చూసుకుంటూ, కన్న బిడ్డల చిరునవ్వుల్లో భవిష్యత్తు గురించి ఆశలు రాసులు పోసుకుంటూ బతుకున్నదేమో!!

అదే నిజమైతే నా సంగతేమిటి?

నేను నిజంగా ఆనందను ప్రేమించానా?

మరి—ఆమెను విడిచి ఆరేళ్ళు నేనెలా ఉండగలిగాను?

అప్పుడు నేనెందుకు బాధపడిపోలేదు?

'ఆనందా! నిన్ను విడిచి నే ఉండగల్గనా!' అని నా హృదయం ఎందుకు ఘోషించలేదు!!!

ఇంక ఆలోచిస్తే తల బ్రద్దలైపోతుంది. ఇంక ఆలోచిస్తే నిజంగా నే పిచ్చెక్కుతుంది. అప్పుడు బయటికి చూశాను.

ఆరేళ్ళలో ఎంత మార్పు!!

చెట్టూ చేమా ఉండే స్థలంలో అందమైన యెత్తైన ఆధునాతన పద్ధతిలో యిళ్ళు—ఒంటినిండా బట్టకప్పుకునే స్త్రీలంతా ఒళ్ళు కన్పించే సన్నటి బట్టలో ఎంతో నాగరికతని మోస్తున్నట్టు—పూరికొంపలు మరింత దిగజారిపోయి—చెరువునీళ్ళు వచ్చబారి—ఏమిటో చాలా విచిత్రంగా దృశ్యమానమైంది. ఇది వరకిట్లా మనుష్యుల మొహాలమీద వెలుగు కన్పించలేదు. ఒకరిద్దరు మధ్య దారిలో పలకరించారు. వాళ్ళ మొహాల్లో తెచ్చిపెట్టుకున్న నవ్వు.

# కథానాయిక...

గమ్యం చేరువైంది. బండి దిగాను. గుమ్మంలో అడుగుపెట్టాను.

'అమ్మా!' అని పిలిచాను. వంటింట్లో ఉందేమో— 'ఎవరు?' అని ప్రశ్న. వెళ్ళాను. అమ్మ చాలా మారిపోయింది. ఆరేళ్ళల్లో అమ్మ అరవయ్యేళ్ళదైపోయింది. నన్ను చూస్తూనే అమ్మ ముఖంలో సంతోషం వికసించింది. ఏవిటలా చిక్కిపోయావంది. ఇన్నాళ్ళకి నే జ్ఞాపకం వొచ్చానా అంది. గబగబా వేణ్ణీళ్ళు తోడింది. స్నానంచేస్తే హాయిగా ఉంది. భోంచేస్తూండగా నాన్నగారొచ్చారు. ఆ సాయంకాలం వరకూ నిద్రే. ఆ తరవాత ఊళ్ళోకి బయలుదేరాను. ఆనంద గురించి ఎవరి నడగను!! ఆనంద గురించి ఎవరు చెబుతారు నాకు!! ఆ రాత్రి అమ్మ నడిగాను. భయపడుతూ అడిగాను. అమ్మ నన్ను నఖశిఖ పర్యంతం చూసింది. నీకు తెలీదా అన్నట్టు చూసింది. నేను అమాయకంగా నిలబడ్డాను. తప్పుచేసినట్టు నిలబడ్డాను. ఏం సమాధానం వొస్తుందో అన్న ఆత్రంతో నిలబడ్డాను.

ఆనంద వాళ్ళ నాన్నగారికి కాకినాడ ట్రాన్స్‌ఫరైందట. నేను వెళ్ళిన నాలుగైదు నెల్లకే ఆనంద వాళ్ళ నాన్నగారు కుటుంబంతోసహా వెళ్ళిపోయారట.

నా ఆత్రుత ఏమని చెప్పను!

అప్పుడు నామీద నాకు కోపం వొచ్చింది.

నా కోపం మీద కోపం వొచ్చింది.

మరునాడు కాకినాడలో ఎలిమెంటరీ స్కూళ్ళన్నీ వెదికాను. సుందర్రావు మేష్టారి గురించి ఆమాకీ తెలియలేదు.

నిరాశ నన్ను నిలువునా ముంచెత్తింది.

ఆ రాత్రి పిచ్చెత్తినట్టు కాకినాడ రోడ్లన్నీ తిరిగాను. ముసలి పెళ్ళికొడుకుల బారినుంచి పారిపోయిన పడుచుకన్నెల దుఃఖవార్తలెన్నో జ్ఞాపకం వొచ్చాయి.

నన్ను నేను అసహ్యించుకునే ఆలోచనలవి.

ఎన్నమకుని ఏం ప్రయోజనం?

తలవంచుకు వెళిపోతూంటే కలలో మాదిరి ఎవరో పిలిచారు. నన్ను కాదనుకున్నాను. మళ్ళీ పిలుపు.

'ఒరే బాల!'

ఆగి చూచాను.

చంద్రశేఖరం.

ఆవేదనతో కాగిపోతున్న నాకు ఆప్తమిత్రుడు కనిపించగానే దుఃఖం ఆగలేదు.

నన్ను చూచి చంద్రశేఖరం ఆశ్చర్యపోయాడు.

'ఏవిట్రా! ఏవిటా వాలకం? గుర్రం ఎక్కావా?' అనడిగాడు.

సమాధానం చెప్పేస్థితి కాదు నాది.

ఇద్దరం వాళ్ళింటివేపు నడుస్తున్నాం.

వెళుతూంటే మళ్ళీ ఆలోచన

చంద్రశేఖరం ఇంటికి వెడతాను వెళ్ళగానే మనవాడు తలుపు తట్టుతాడు. అతనిభార్య తలుపు తీస్తుంది. నన్ను చూచి నవ్వేయబోతుంది. నేను రాయిలా నిలబడిపోతాను 'ఈవిడేరా మా ఆవిడ' అంటూ చంద్రశేఖరం పరిచయం చేస్తాడు. నేను మర్యాదకు నమస్కారం చేస్తాను. ఆనంద కూడా నాకు నమస్కరిస్తుంది. నా గుండెల్లో అగ్నిపర్వతం పేలుతుంది.

వాళ్ళింటి కొచ్చేశాం.

చంద్రశేఖరం తాళం తీశాడు.

'ఇంట్లో ఎవరూ లేరేవిట్రా?' అనడిగాను.

'మా ఆవిడ నిన్ననే పుట్టింటికి వెళ్ళింది' అని సమాధానం చెబుతాడని ఆశించాను. కాని వాడు నవ్వాడు.

'అమ్మ నిన్ననే చెల్లాయి వాళ్ళింటికి వెళ్ళింది. ఇంట్లో ఒక్కడ్నీ' అన్నాడు.

'ఇంకా పెళ్ళి చేసుకోలేదురా!'

'పెళ్ళా—' అనేసి నవ్వాడు వాడు. వాడినవ్వు చాలా విషాదంగా ఉన్నట్టునా ఉంది. ఆ నవ్వు మళ్ళీ నాలో ఎన్నో ఆలోచనల్ని పుట్టించింది.

అతగాడు నా మాదిరిగా ఒకానొక వయ్యారికోసం తపించి పోతున్నాడేమో! కాక, అతను వలచినకాంత మరొకరిపై కన్ను వేసిందేమో!

కడలికి చెలియలికట్ట ఉంది.

ఆలోచనకు ఆనకట్ట లేదు.

మెత్తని పరుపు మీదైనా కొత్త ప్రదేశంలో కనురెప్పలు కలుసుకోవు.

'నీకు సుందర్రావుగారని ఎవరైనా

మాష్టారు తెలుసా ?' అనడిగాము.

'సుందరరావు గారా ? మేష్టారా ? నాకు తెలుసునా అని అడుగుతున్నావా ? తెలియక పోవడమేం! రెండేళ్ల కితం వరకూ మా యింట్లోనే అద్దెకుండే వారు.'

ఇది నిజమేనా అనిపించింది.

'నీకెలా తెలుసు ?' అని అడగలేదు చంద్రశేఖరం.

'అంతకు ముందు సుందరరావుగారు మీ యింటి పక్కనే ఉండేవారని నాకు తెలుసు. ఆనందలక్ష్మి ఎప్పుడూ నీ సంగతే చెబుతూ ఉండేది.'

నా మనసొక్కసారి సముద్రం మాదిరి ఉప్పొంగి పోయింది. ఆ తన్మయత్వంలో అలాగే పడుకున్నాను.

కాకినాడలో మా దూరపు బంధువొకాయన అప్పట్లో ఉద్యోగం చేస్తూండే వాడు వాళ్లింటికి వొచ్చినపుడు చంద్రశేఖరం పరిచయమై ఆప్తమిత్రుడై పోయాడు.

ఆ ఆప్తమిత్రుడికి ఆనందతో సన్నిహిత పరిచయం ఉందని తెలియగానే నాకు ఈర్ష్య కలిగింది.

చంద్రశేఖరం పెళ్లెందుకు చేసుకోలేదు ?

ఆనంద నన్ను ప్రేమించలేదు కదా!

ఆనంద అతన్ని తిరస్కరించలేదు కదా!

'ఇప్పుడు సుందరరావు మేష్టారు ఎక్కడున్నారో తెలుసా ?' అనడిగాను.

సమాధానం లేదు.

అప్పటికే అతను నిద్రలో మునిగి పోయాడు.

ఆలోచనలమధ్య సుషుప్తిలోకి ఎప్పుడు జారిపోయానో తెలియదు. మెలకువ వచ్చే సరికి బోలెడంత వెలుగు.

కన్ను విప్పితే చంద్రశేఖరం ఎక్కడికో బయలుదేరడానికి రెడీగా ఉన్నాడు.

'తమరేదో దూరప్రయాణం మీద...'

'ఆ నామొహం! వో గంటలో వచ్చేస్తాగాని కాఫీ రెడీగాఉంది ఫ్లాస్కులో' అంటూ చెప్పులు తొడుక్కుని వెళ్లిపోయాడు.

లేచి ముఖం కడుక్కున్నాను. వేడికాఫీ వేడి ఆలోచనలని పుట్టిస్తోంది. చంద్రశేఖరం డైరీ దొరికితే బావుణ్ను! నాలోపలి మనిషి ఎంత దుర్మార్గుడో నాకే అంతు పట్టడంలేదు.

దొడ్లో పూలమొక్కలు అందంగా వేశారు. పూలు అమాయకంగా నవ్వుతున్నాయి.

ఎంత వెదికినా డైరీ దొరకలేదు.

ఒక మంచి స్నేహితుడు యింట్లో లేనిట్లా రహస్యశోధనం చేయడం నాకేం బావుండలేదు.

గంట గడిచింది.

రెండోగంట కూడా!

చంద్రశేఖరం రాలేదు.

కడుపులో బ్రహ్మాండమైన ఆకలి.

ఒక్కగంటలో వొస్తానని వెళ్లిన వాడు ఎంతకూ రాడేమిటి?

ఆనందగురించి అడుగుతానని కాబోలు తన్ను యింట్లోపెట్టి దాటేశాడు.

ఇలా ఆలోచనల్తో ఉండగా చంద్రశేఖరం వొచ్చాడు. ఇద్దరం హోటల్‌కి బయలుదేరాం.

దారిలో అడిగాను—

'సుందరరావుగారు ఇప్పుడెక్కడున్నారు?' అని.

'ఆయనలేరు' అన్నాడు చంద్రశేఖరం.

'అంటే?'

'ఆయనపోయి ఏడాది దాటింది'

ఇద్దరం భోజనానికి కూచున్నాం. నేనింక నా ప్రశ్నని దాచుకోలేను.

'ఆనంద ఏమైంది?' అనడిగేశాను.

చంద్రశేఖరం ఏం సమాధానం చెప్పలేదు.

భోజనం ముగించుకుని, కిళ్లీ బిగించి, యింటికి బయలుదేరాం.

'నా ప్రశ్న అలాగే ఉంది' అన్నాను.

'నువ్వెన్నాళ్లూ ఆనందకు కనీసం ఉత్తరాలైనా రాయకపోడానికి కారణం ఏమిటి?' అనడిగాడు.

నేనేం సమాధానం చెప్పను!!

ఏ సమాధానంవల్ల నా హృదయాన్ని అతను చదవగలడు?

ఆ ఉదయం చంద్రశేఖరం ఎక్కడికి వెళ్లివచ్చాడో నా మెదడులో సౌదామినిలా కదలాడింది.

'నువ్వు ఉదయం ఆనంద దగ్గరకు వెళ్లావు కదా!' అని సూటిగా అడిగాను.

చంద్రశేఖరం నా వొంక జాలిగా



చూశాను.

# కథానాయిక ...

'బాలరాజా! నిన్ను చూస్తే జాలేస్తోంది తక్కువ. ఇన్నాళ్లూ ఆనందను నువ్వెందిరా! నీకు ఆలోచన లెక్కువ. ఆచరణ దుకు నిర్లక్ష్యం చేశావో నాకర్థం కావడం




పనామా బ్లేడ్లు క్షౌరము ఆనందదాయకం చేయును. వానితో చేసికొన్న క్షౌరములు మరువరానివి. అవి మీకు ఉత్సాహకరమైన చక్కని క్షౌరముల నిచ్చును.

లేదు. ఆనంద నీ ఉత్తరం కోసం నీ రాక కోసం తపించిపోయింది. తండ్రి ఏవో సంబంధాలు తెచ్చినప్పుడెల్లా కుంటిసాకు చెప్పి తప్పించుకునేది. తండ్రిపోయాక సంసారం గడవటం కష్టమై ఉద్యోగం చేస్తూ తల్లిని పోషిస్తోంది. నీ కోసం యిన్నాళ్లూ ఎదురుచూసిన ఆనంద నువ్వొచ్చావని తెలిసీ, నిన్ను చూడడానికి ఎందుకు రానందో నాకు తెలీడం లేదు.'

నేను నిర్విణ్ణుడనయ్యాను.

నేను విసిరివరాయి నన్నే గాయపరిచింది.

నా ఆలోచన నా కంఠాన్నే బిగించింది.

బాధ నన్ను నిలువునా దహించడం ప్రారంభించింది.

'చంద్రా! నువ్వు తప్పు చేశావు ఆనంద కోసం నేను స్వయంగా వెళ్లాలి. ఆనందను తీసుకురావడానికి నువ్వెందుకు వెళ్లావురా! ఇన్నాళ్లుగా వేలకాని తరంలో నేను మగ్గిపోయినమాట నిజమే కాని — ఇకపై ఆనందను విడిచి మాత్రం ఉండలేను. నన్ను చూడడానికి ఆనంద రాకపోడంలో అర్థం ఉంది, నా కోసం నువ్వు శ్రమపడి వెళ్లావు. మాట మాత్రం చెప్పి ఉంటే ఆనంద దగ్గరికి నేను వచ్చేవాణ్ని. ఆనంద దుఃఖంలో వేగిన మనిషి. నా రాక కోసం తపించిన మనిషి. ఆప్యాయంగా ఒక్క సానుభూతి వచనం పలికినా, ఆనంద అంత విచారాన్ని మరిచి పోగలదు. నాకు నేనై దయలు దేరాను. అంతేగాని ఆమెను నా దగ్గరికి తీసుకురావడానికి నువ్వు వెళ్లడంలో ఏమైనా అర్థం ఉందా?'

నాతీరు చూచి చంద్రశేఖరం మరేమీ మాట్లాడ్లేదు.

ఇంటికి చేరుకునే సరికి గుమ్మానికి తాళం లేదు.

వేగంగా అడుగులు వేశాను.

'ఆనందా!' అంటూ ఆమెను చుట్టేశాను. ●




మనం మగాళ్ల గురించి మాట్లాడే ముందే మనల్ని గురించి వాళ్లేమనుకుంటా రన్నది తెలుసుకోవడం కుషీగా ఉంటుంది. ఆడవారిపట్ల మగవాళ్ల దృక్పథం మారు తోంది అంటారు. నిజమేనా? నిజంగానే పూర్వీకులకన్నా ఈ కాలం మగవాడు— కొంచెం దయగా, కొంచెం ఎక్కువ సాను భూతి ప్రకటిస్తున్నా డంటారా? మనలో ఆశల అలలు చెలరేగించి నేలకాలూని నిలవకుండా చేసేస్తున్నాడా? భార్యా విధేయుడై మానసిక రాజ్యాధిపతి ఎక్కువ రాణిస్తున్నాడంటారా? నేనడిగితే 'నిజమే'నంటూ చాలామంది ఆడవాళ్లూ మగవాళ్లూ కూడా తలూగించారు. 'కాలం మారింది. ఈ రోజుల్లో అధికారదాహంతో దహించుకుపోయే మొగాళ్లు అరుదే' అందొక చిట్టితల్లి. బల్లగుద్ది 'ఈ కొంపలో ఎవరు యజమానో తెలుసుకో' అని భూనభోంతరాళాలు దద్దరిల్లేలా అరిచే మగాళ్లేరీ—తగ్గిపోయారు ఈనాడు కొత్తరకం ఒప్పందం కుదురుతోంది— ఆడ—మగలమధ్య అధికారం స్థానాన్ని సహచర్యం ఆక్రమించుకుంటూంది. మీరెక్కడేనా చూడండి — బజార్లలో, సినిమాహాళ్లలో, కాఫీ హోటళ్లలో ప్రయాణాల్లో—'మగవాడితనం' అన్న పొగరుబోతుతనం—సడలిపోతూంది—నదొక వరమే స్త్రీలకి. 'నల్గురు పిల్లలతల్లి అయినా స్త్రీపట్ల సానుభూతితో ఉంటారు. మా నాన్నగారి రోజుల్లో ఇల్లా- కాదే. ఎటువంటి పరిస్థితిలోనైనా ఆయనదే ప్రథమస్థానం. తరవాతే అమ్మ. ఇక మా తాతగారి కాలంలోనా—రామరామ ఆడదాన్ని దుమ్ముకంటె హీనంగా చూసే వారు! ఇప్పుడదేం కుదరదు' అన్నా రొకాయన చాలా గర్వంగా.

ఇలా ఆడదానిపట్ల సానుభూతి పెరగడం ఆమెగారి ధోరణి విని చూద్దాం అనుకోవడం ఖులాస్న, మగవాడి పౌరుషానికేమైనా హాని కల్గుతూం దంటారా? ఈ ప్రశ్న యువకులను వేస్తే బాధలేదు. వాళ్లకి- బట్టలెవరు కొంటారు. సినిమాకి టిక్కట్లు ఎవరు బుక్ చేశారు? బిల్లు లెవరు కడుతున్నారు? అజమాయిషి ఎవరిది? అని పరీక్షగా పట్టించుకోరు. 'ఎవరుకొంటేనేం? ఎవరో ఒకరు కొనడం ముఖ్యం' అన్నాడో విద్యార్థి భర్త! పూర్వంలో మగవాళ్లు, ఆడవాళ్లు చేసే పనులకి తేడా ఉండేది. కాని రోజులు మారాయి. ఇవాళ ఆడదీ మగవాడూ చేసే పన్లు చాలామటుకు ఒకటిగానే ఉంటు న్నాయి. విద్యలో సమానత్వం; వివా హంలో ఆడదానికి ఆధిక్యత నిచ్చింది. అందుకే — ఒకరినొకరు అర్థం చేసు కోవడం, ఒకరికొకరు సమానం అనుకో వడం జరుగుతోంది. దానివల్ల లాభం ఏమిటి? ఇద్దరికీ కొత్తచిగుళ్లు తొడిగిన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు వచ్చాయి. 'ఈ రోజుల్లో ఈ భావన ఎంతోముఖ్యం. ఎందుకంటారా? ఈ కాలంలో భార్య ఒక్క శరీరకంగా అవసరమైన జీవిగాని భావించడంలేదు మగవాడు. ఇంట్లో చాకిరీ చేసేందుకే అని భావించడంలేదు. ఈనాడు తనతోపాటు చర్చించకల్గిన సహజీవిని తన స్త్రీలో చూస్తున్నాడు. తన సరదాల్లో పాలు పంచుకునే వ్యక్తిని చూస్తున్నాడు ఆడదానిలో. కాని! ఎంత మందికి ఉంది. ఇలాంటి దృక్పథం అని ప్రశ్నిస్తే—తక్కువగుందికే అని తెలు స్తుంది. కాని అసలు 'కాని'చోట 'ప్రారం భం' గొప్పకదా? ఇటువంటి దృక్పథం అప్పటి కప్పుడురాదు. నెమ్మదిగా పెరగాలి. మగవాడు మానసిక జీవి. అందుకే తనను ప్రేమించే వ్యక్తిని ప్రేమిస్తాడు — ఈ కాలంలో ఓర్పుతోపాటు ప్రేమలో నేర్పుకి కూడా ప్రాధాన్యత యిస్తున్నాడు. 'వంటకే రసాధిదేవత అయిన ఆడది మాటకారి నేర్పరి, రంజింప చేయికల్గినదీ అయితే సంసారం హాయిగా గడుస్తుంది' అన్నా రొకాయన.

'ఆడపన్లు చేయడం సిల్లీ' అన్నాడో కుర్రాడు. 'మారతాయిలే' అంది కన్నె పిల్ల. ఎలా? అన్నాను. 'ఏముంది. వాళ్ల తాతలనాడు ఆడది వంటింటి కుందేలు. వాళ్లనాన్న నాటికి మారలేదా? పిండి పక్కమారిస్తే 'ఆడతనం' అనుకోరే నాటి మగవాళ్లు.' అంది నిశ్చింతగా. 'పని తెములుతుంది' అనుకుంటారు మా ఆయన అంటూ లక్ష్మి ●




## జరిగిన కథ

రఘు, రామం, వేణు ముగ్గురూ అన్న దమ్ములు. వాళ్ల ముద్దుల మరదలు సుధ. సుధ కుంటిపిల్ల. సుధ తల్లి జానకమ్మ. బర్మానుంచి బాధితురాలిగా వచ్చిన జానకమ్మకి ఆశ్రయ మిచ్చారు శర్మగారు. ఆయన భార్య పార్వతమ్మకి సుధ అంటే ఎనలేని అభిమానం. సుధ తండ్రి యుద్ధానికి ఎలా బలి అయిపోయిందీ జానకమ్మ వివరించి చెబుతుంటే పార్వతమ్మ, వేణు ఆసక్తిగా విన్నారు. తండ్రి మరణాన్ని తలచుకుని బాధ పడింది సుధ. రామమ్మగారు సుధని చూసినప్పు డల్లా కుంటిపిల్ల అని ఎత్తిపొడుపుగా మాట్లాడు తుంది. సుధ బాధపడుతుంది. రఘు సుధ మీద ఎక్కువ అభిమానం చూపిస్తూ వుండడం రాధ కనిపెడుతూనే వుంది. రఘుని ఆకర్షించడానికి రాధ విఫల ప్రయత్నలను చేస్తుంది. కార్యసాధనకు మంచి దని ట్రాన్స్‌ఫరయిన అన్నయ్య తిలక్ కుటుం బంతో హసాన్ సర్జరీకి విశాఖ చేర్తుంది. తను ప్రేమించిన నళినితో తనకు వివాహం జరిగేలా చూడమని వదిన నిర్మలను కోరుతాడు మురళి. మంచి డాక్టరనిపించుకోవాలని, లక్ష్యాన్ని సాధించా లని రఘు కోరిక.

## 8

అన్నింటికన్నా, అతన్ని మరీ బాధిస్తున్నది ఎప్పుడూ తన కళ్ల ముందే తిరుగుతూండే రాధ సౌందర్యం. ఒక్కొక్కసారి తన మనసుని బొత్తిగా నిభాయించుకోలేని సమయాల్లో ఆ విశ్వామిత్రుడి తపస్సుని నాశనం చేసేందు కొచ్చిన మేనకలాగ నా లక్ష్యాన్ని సర్వ నాశనం చేసేందుకే, రాధగాని దాపు రించిందా ఏం ఇక్కడ అనికూడా విసుక్కుంటూండేవాడు రఘు.

లేకపోతే నాలుగేళ్లపాటూ ఎన్నెన్ని అవాంతరాలొచ్చినా అతి సునాయాసంగా దాటుకుంటూ సాగించిన తన పట్టుదల రాధవచ్చాక ఈ రెండేళ్లబట్టీ, ఇలా దిగ జారుతూండడం ఎందుకూ.

రాధని తొలిసారిగా రఘు తన ఇంట్లో చూసినపుడు ఒంపుసొంపుల్తో వయ్యా రంగా తిరుగుతూన్న రాధను చూసి 'హుం' తన అందాన్నిచూసి వశులు కాని వారంటూ వుంటారా, అనిగామల్లు ఈపిల్ల నిబ్బరం' అనుకుని ఒకవిధంగా రాధని ఏవగించుకున్నాడు రఘు. అయితే ఆరూపమే. తిప్పించి, మళ్లించి తరుమూ మళ్లీ తన మనసుని గిలిగింతలు పెడుతూండడం, అందు ఫలితంగా తనలోని స్థిర భావం చంచలమవు తూండడం గ్రహించిన రఘు, 'దైవ సృష్టిని విభాయించాలనుకోవడంలో ఎంత ఇబ్బందుందీ' అనుకుంటూ అతి ప్రయ త్నంగా రాధరూపాన్ని తనలో తోచనివ్వ కుండా ఎప్పటికప్పుడు తుడిచెయ్యసాగాడు.

ఈ ప్రయత్నంలో అతడు కృతార్థు డవుతూండేలోగా ఇంతలో మళ్లీ శాశ్వ తంగా అతని ఎదుటే వుండేటందుకు రాధ రానే వచ్చేసింది. ఈ సంగతి తెలియడం తోనే తను మరో హాస్పటల్‌కి మార్చేసు కోవాలనికూడా అనుకున్నాడు రఘు. అయితే ఇక్కడివారంతా తనని వదిలి పెట్టేందు కొప్పుకుంటేగా, అదీగాక తన మనసుని తను నిబ్బరంగా వుంచుకుందుకు చేతకాక ఇందుకు జడిసి దుర్బలుళ్లాగ పారిపోవడమా? అన్న రోషమూ కల్గింది అతనికి. అందుకని తన మనసుమీద తనకే అంత నమ్మకం లేకపోతే తనిక ఎందుకు పనికొచ్చేటట్లూ, అనుకుని అక్కడేవుండి పోయాడు రఘు. అదీగాక ఎవ్వరెలా అనుకున్నా రోషపడకుండా వీలైనంత వరకూ రాధకి తనుదూరంగానే వుంటూండా లన్నది అప్పుడే తీర్మానించుకున్నాడు రఘు. అందుకే ఎంతకెంత రాధ తనకి సాన్నిధ్యంలో వుండాలనుకుని ప్రయత్నిం చేదో అంతకంతకూ తను తప్పించుకుని ఎడమెడంగానే తప్పుకుంటూండేవాడు రఘు.

అయితే పైకి తనిలా ఎంత గంభీ రంగా మసులుకున్నా, మనసుమాత్రం లొంగకుండా ఏవేవో మధురభావాల్ని సృష్టించి ఒళ్లు పులకరింపజేయిస్తూ పల్టీలు కొట్టిస్తూండేది తనని. అటు వంటప్పుడల్లా తను మరికొంత పట్టు దలని పుంజుకుంటూ ఆ స్థానంలో తన సుధని పిల్చుకుని అప్పటప్పటికి ఆ గండంనుండి బయట పడుతూండేవాడు రఘు.

మొత్తానికి ప్రకృతి నియమాల్తో పోరుతూ, ముందుకి సాగడమన్నది అటు వంటి వాతావరణంలోవున్న తనకి ఇదొక గుండెల్లో గుద్దులాటే అనుకుంటూ ఎలాగో కాలక్షేపం చేస్తూన్న రఘుకి ఈ రాధ రాక మరింత తీవ్ర మనో పోరా టానికి గురి చేసిందనే చెప్పాలి.

ఎన్నిమార్లో 'ఆపరేషన్' బోర్డువద్ద తన కతి సమీపంలో రాధ నిలబడు తూండడం, ఏవన్నా పరికరాల్ని అందించే నిమిత్తంగా, చెయ్యి చెయ్యి తగులుతూం డడం. అటువంటి సమయాల్లో ఏదో అర్థం కాని అనుభూతి అతన్ని ఏ లోకం లోనో. సంచరించేటట్టు చేసేది. అయితే, ఆ పరిస్థితి కొన్ని క్షణాల కాలం మాత్రమే. అంతలో తను యథాస్థితిని గుర్తించేసుకునేవాడు రఘు.

స్టూడెన్ట్సూ, చికిత్సకోసరం వచ్చే వారూ, డాక్టర్సూ, ఇలా కొందరు జంటలు జంటలుగా స్కూటర్లలోనూ, కార్లలోనూ, కాలినడకనీ, నవ్వుకుంటూ కేరుకుంటూ, ప్రతిరోజూ వస్తూండడం చూసినప్పుడల్లా సుధతో తను గడప

ల్చున్న కాలాన్ని తల్చుకుని నిరుత్సాహపడి పోయేవాడు రఘు.

గుర్రాన్నీ, గాడిదనీ, ఒకేబండికి కట్టినట్టుంటుందేమో తను సంసార జీవితం — అని బాధపడేవాడు కొంతసేపు. మళ్లీ అంతలో ఆరోజు పాతవీణని శృతి చేస్తూ సుధ అన్న మాటలు గుర్తుకు రావడంతోనే నిజంగా అసలైన సుఖం అటువంటి స్వశక్తిమీద సృష్టించుకున్నప్పుడే కల్గడం, అనుకుని సర్దుకుంటూండేవాడు.

మొత్తానికి మొదట్లో ఎప్పుడో కల్గుతూండే ఈ కలవరం తరవాత్తరవాత అప్పుడప్పుడూ కదుల్తూ ఇప్పుడు తరుచూ తనని వివశుణ్ణి చేసేస్తూంది. 'అయినా ఇది తనతప్పా, రాధతప్పా? లేక ఇటువంటి అర్థంమాలిన మమతల్ని పుట్టించి మనసులోని సంకల్పాన్ని తారుమారుచేసి ఆనందిస్తూండే విశ్వకర్త తప్పా, అనుకునేవాడుకూడా రఘు.

పొద్దున్న హాస్పటల్ కెళ్లి కొన్ని 'ఔట్ పేషెంట్స్' కేసుల్ని పరీక్ష చేశాక పెద్దడాక్టరుతో కలిసి 'రౌన్డ్స్' కెళ్లొచ్చిన రఘు డక్టరు పురమాయించిన కొన్ని ముఖ్య పనులమీద దబదబా మేడమీది కెళ్తున్నాడు.

'ఇంతసేపూ మీ కోసరమే వెయిట్ చేశా డక్టర్' అంది గబగబా పైనుంచి దిగొస్తూ మెట్ల మలుపులో తారసపడ్డ రాధ ఆదుర్దాగా.

'ఏం ఎందుకూ' అన్నట్టుగా మొహం ఎగరేశాడు రఘు.

'మొన్న ఆపరేషన్ అయిన ఆ ఆర్ నెంబరు—ఒకటే ఆయాస పడుతున్నాడు డాక్టర్. మీ పేరేప్పి! 'ఆ డాక్టరింకా రాలేదా' అంటూ లేచిందగ్గర్నుంచీ ఒకటే గొడవ' అంది గుక్కతిప్పుకోకుండా.

'బ్లాక్ ఎయిట్'లో వార్డు పిలో వున్న తనేనా

'ఔను డక్టర్'

'కడుపేమన్నా ఉబ్బరంగా వుందా'

'కొద్దిగా యూరిన్ పాస్ చేయించి చూశా కూడా'

'అయితే గాస్ ట్రబుల్ అయ్యుంటుంది. ఈ మెడిసన్ ఒక డోస్ ఇవ్వండి' అన్నాడు దబ్బున తన పేంటజేబుగోని చిన్న పుస్తకంలో ఏదో మందుపేరు రాసి ఆ కాయితాన్ని చింపి అందిస్తూ:

'ఇస్తాగాని మీరోసారి వచ్చి చూసేసి వెళ్తే కాస్త అణుగుతాడేమో, పొద్దుట్నుంచీ అందరినీ అప్పగింతలు పెట్టేస్తున్నాడేకంగా' నవ్వుతూ అంది రాధ.

ఉత్త హడావిడి మనిషి. 'నేనిప్పుడటు వేపే పనిగా వెళ్తున్నా చూస్తాలెండి.'

'అన్నట్టు ఆ డి. ఎమ్. సి. కేసులు సిద్ధంగా వుంచేం. కిందికి పంపించమంటారా!'

'వద్దు. ఈ ఉదయాన్నే గొప్ప బస్సు ప్రమాదానికి గురై, చెయ్యి విరిగిపోయిన ఒక కేసుకి ఇప్పుడు పెద్దాపరేషన్ జరుగుతుంది. అది అయ్యాక ఇవి చూద్దాం, మీరూ వస్తారా?'



'ఏ థియేటరో'

'నెంబరు డి.'

'ప్రయత్నిస్తా' వెళ్లిపోయింది రాధ. స్టెతస్కోపుని విలాసంగా తిప్పుతూ ఎడమ కాలు కుడికాలిమీదనుంచీ పక్కకు మళ్లించి బొటనవేల్ని నేలకానిచ్చి బాలకృష్ణుడి ఫోజులో నిలబడి మాట్లాడుతున్న రఘు నిరాదరాన్ని తల్చుకుంటూ రాధ మెట్లు దిగి కిందికెళ్లిపోతే, ఉల్లిపొరవంటి తెల్లచీరె కట్టుకుని కొత్తరకపు చుట్ట చుట్టుకుని టకటకామంటూ లేడిపిల్లలా మెట్లుదిగి వొచ్చిన రాధ అందాన్నే తల్చుకుంటూ పైకెళ్లిపోయాడు రఘు. ఇటువంటి సంఘటనలు తరచూ జరుగుతూండడం పరిపాటే.

* * *

శాంత రాకకోసరం రోజులు లెక్కపెట్టుకుంటూ కూర్చున్న సుధకి, శాంత వొచ్చిన కొద్దిరోజులకే ఎక్కడి సంతోషం అక్కడ మాయమై కూర్చుంది. కేవలం పల్లెటూర్లో పుట్టి పెరిగిన శాంతకి గౌరవం అంటే ఏమిటో సభ్యతంటే ఏమిటో మచ్చుకూడా తెలిసున్నట్టు కనిపించదు సరికదా గొప్పవారింటి కోడళ్లన్నా పట్టణవాసులన్నా, ఎంతో గర్వంగానూ, నిర్లక్ష్యంగాను ప్రవర్తిస్తూండాలనుకునే మూర్ఖత్వం గలది. అందువల్ల జానకీ, సుధని ఏదో నిర్లక్ష్యంగా చూస్తుండేది.

ఇంటికొచ్చిన ఇరుగుపొరుగూ వారితో

సుధ సహజంగా మాట్లాడ్డం చూసి
'ఛా! అడ్డమైనవాళ్ళనీ సోఫాలమీద కూర్చోపెట్టి. ఏవిటా మాటలూ' అనేది. కాయకూరలూ, పువ్వులూ ఇలాంటివి అటూ ఇటూ వృధాకాకుండా జాగ్రత్తగా సుధ యెత్తిపెట్టిందంటే 'ఏవిటా లేకి పన్లూ ఇవన్నీ అవతల పారెయ్యి' అంటూ 'పాపం పనిమనిషి పట్టుకెళుతుం దక్కయ్యా' అని సుధ అంటూన్నా విని పించుకోకుండా విసిరిపారేసేది.

## అతని లక్ష్యం

ఎంతసేపూ మేడమీదే కూర్చోనూ, ముస్తాబులు చేసుకోనూ, ఇంతే తప్పితే అందరితోటీ కలిసీమెలిసీ పనిపాట్లు చెయ్యడంగానీ, మంచివ్యాపకాల్తో కాలం గడపడంగానీ ఇటువంటివేవీ పనికొచ్చేవి కాదు శాంతకి. ఏదో మేనమామకూతురు, పిల్లఅందంగా వుందనీ, తల్లిమాట తోసివేయలేక చేసుకున్నాడేగాని. ఈమనిషితో







విశాగా: ఆరేడులోనూ — తన్నివిద్యలుంచి ఇంత విధేయతతో మసులుకునే జానకీ. సుధా, వాళ్ళమధ్య, ఈ భార్యతో ఎలా నిర్వహించుకురావడమా! అన్న బెంగే పట్టుకుంది రామానికి.

ఇంతకీ శాంత చేస్తున్న చేష్టలేవీ ఎవ్వరూ రామానికి తెలియనివ్వడమే లేదు. అయినా తనంతట తాను చూసిన కొన్ని కొన్ని విషయాలకే, రామం మనసు ఎంతో నొచ్చుకుని, అలా కొన్ని నెలలయ్యేసరికి,

'దాన్ని దోవలోకి తెచ్చి కాస్త పుణ్యం కట్టుకోలేవా అత్తయ్యా' అని చివరకి జానకిని ప్రాధేయపడేవాడు రామం.

అయితే, వాళ్ళని చూస్తేనే ఏవగించుకుంటూన్నట్టు మొహం పెట్టే శాంతతో జానకి ఏవిధంగా పరిచయ పడగలదని? పాపం సుధ మాత్రం తనని విసుక్కున్నప్పుడు మాత్రం రెండురోజుల పాటు మౌనంగా ఊర్కున్నా, మళ్ళీ తనంతట తనే శాంతని పల్కరిస్తూ వుండేది. శాంతతో పరిచయంకోసరం ఆ లేత హృదయం ఎప్పుడూ తహతహ పడు తూండేది.

ఒకరోజు శాంత రామంతో సినిమాకు వెళుతున్నట్టు తెలిసి తన నేర్పంతా చూపిస్తూ చక్కని పూలమాల కట్టి శ్రమనికూడా లెఖ్ఖచెయ్యకుండా అన్ని మేడమెట్లూ ఎక్కి వెళ్ళి శాంత గది తలుపు కొట్టింది సుధ.

కసురుకుంటూ వచ్చి తలుపు తీసిన శాంత. 'ఇందా అక్కా', అంటూ సుధ అందియ్యబోయిన మాలని చూసి కను బొమలు ముడేస్తూ, 'ఛా, గొబ్బిళ్ళకు పెట్టినట్టు. ఇవేం పువ్వులూ, నాకొద్దు' అంటూ ఫెడీమని మళ్ళీ తలుపు వేసేసు కుంది. ఆనాట్నుంచీ, సుధ ఇక అటు వంటి ప్రయత్నాలే మానేసింది పాపం.

పాపం అనాలేక మానాలేక, బాధపడు తూండేవారు పార్వతమ్మగారు.

ఆ రోజు సాయంత్రం ఎవరో కొందరు ముఖ్య స్నేహితులు శర్మగారింటి రాను న్నందువల్ల, సర్నులూ, సవరింపుల్తోటి ఇల్లంతా ఏక హడావిడిగావుంది. ఇంట్లో వున్న ఈ పనుల నుద్దేశించి త్వరగా ఇంటికొచ్చిన రామం తిన్నగా లోపలికెళ్ళి

దానికి స్వయంగా తయారించిన కొత్త కొత్త రకపు స్వీట్సునీ, శంకరయ్య అతి నేర్పుగా తయారించిన మిక్చర్ వగైరాలనీ అడిగి రుచిచూసి మెచ్చుకున్నాక అక్కణ్ణుంచి లిన్నగా మేడమీదున్న తన గదికి వెళ్ళాడు.

ఈ సందడితో తనకేమీ నిమిత్తం లేనట్టుగా, హాయిగా పడుకుని నిద్రపోతూంది శాంత.

'ఛీ, ఎంత సోమరితనంగా ఉండేదీ ఓమనిషి' అని చాలా చిరాకనిపించింది రామానికి. అయినా ఆడవిమృగంలా ఆ పల్లెటూర్లో పెరిగిన దాన్ని వెళ్ళి గొంతుక్కి కట్టుకుని ఇప్పుడిక అనుకుని ఏం లాభం, అని తన్లో తనే సర్దుకుంటూ మెల్లిగా మంచం దగ్గరికెళ్ళి 'శాంతా' అని పిల్చాడు. పలక్లేదు శాంత.

'హు' ఇంత అందమైన రూపాన్నిచ్చిన ఆ దేవుడు, అందుకు తగ్గ మంచి హృదయాన్నెందుకివ్వలేదో' అనుకుంటూ, మళ్ళీ 'శాంతా' అని పిలుస్తూ, కప్పుకున్న దుప్పటిని తొలిగించాడు.

'అబ్బ. ఏమిటండీ' అట్నుంచి ఇటు తిరిగి మళ్ళీ పడుకుంది శాంత.

'ఇంట్లో ఒకమూల అంత హడావిడి పడుతూంటే, మనకి చెయ్యడం ఎలాగూ చేతకాదు. పోనీ కాస్త చేస్తూన్నవన్నా చూడనన్నా రావచ్చుగా. ఏమిటీ పడక' మందలించాడు రామం.

'అబ్బబ్బ, ఈ ఇంట్లో నిద్రపోవడానిక్కూడా వీలవదుబాబూ' విసుక్కుంటూ లేచి కళ్ళు నులుముకుంటూ కూర్చుంది శాంత.

'ఎవరికి, నీకేనా ?'

'మరి, మీ తమ్ముడన్నంతసేపూ, ఆ రేడియోని ఆ వగైరాని మోగిస్తూనే వున్నాడు. ఇక అతడు ఆపేసరికి, బేప్ బేప్, మనుకుంటూ ఆవిడగారు వీణ ప్రారంభం చేస్తుంది ఇక పడుక్కు చచ్చేదెప్పుడూ'

తన తల చితక్కొట్టుకుందామా అన్నంత చిరాకేసింది రామానికి. హు. పాములూ, పసిపిల్లలూ కూడా మైమరపుతో వినే పాటంటే ఇంత వెగటా' అని తన భార్య మూర్ఖత్వానికి ఎంతో బాధపడ్డాడతను.

'నీకెందుకింకా లోకజ్ఞానం రాలేదు ఆయన అది నీ తప్పు కాదులే, నువ్వు శాంతా. అందుకే ఇలా జడంగా ఎందు పెరిగిన వాతావరణం అటువంటిది—' లోనూ రసికత్వం లేకుండా వున్నావు 'చాల్లెండి మహా ఎరిగున్నట్లు—'

# రచయితలకు మనవి

## కథలు, వ్యాసాలు

ప్రచురణకి స్వీకరించబడని తమ వ్రాతప్రతులని తిప్పిపంపకోరే రచయితలు వ్రాతప్రతులతోబాటే తగుమాత్రం తపాలాబిళ్ళలు అతికించిన స్వంత చిరునామాకల కవరు కూడా పంపాలి. స్టాంపులు మాత్రం పంపరాదు. స్టాంపులు మాత్రం పంపించినట్లయితే వ్రాతప్రతులు తిప్పిపంపబడవు. వ్రాతప్రతులతో గాక విడిగా స్వంత చిరునామా, తగుమాత్రం పోస్టేజికల కవర్లు పంపినా వ్రాతప్రతులు తిప్పిపంపబడవు.

ప్రచురణకి స్వీకరించబడని వ్రాతప్రతుల విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.

## నవలలు

ప్రచురణకి స్వీకరించబడని నవలల వ్రాతప్రతులు మేమే తిప్పి పంపిస్తాము. వ్రాతప్రతులతో స్వంత చిరునామాకల, తగినమాత్రం పోస్టేజి అతికించిన కవర్లు పంపనవసరం లేదు. 100 అరఠావు పేజీల పైబడి ఉన్న వ్రాతప్రతులే నవలలకింద పరిగణింప బడుతాయి.

## కార్టూన్‌లు

ప్రచురణకి స్వీకరించబడని కార్టూన్‌లు తిప్పి పంపకోరేవారు కార్టూన్లతో స్వంత చిరునామాకల, తగుమాత్రం పోస్టేజి అతికించిన కవర్లు జతపరచి పంపాలి. స్టాంపులు మాత్రం పంపరాదు

షరా: వ్రాతప్రతులని, కార్టూన్లని వీలయినంత భద్రంగా తిప్పిపంపే ప్రయత్నాలు చేస్తాము కాని, వాటి విషయమై ఎటువంటి బాధ్యతని స్వీకరించలేము. ఈ షరతుని గమనించి రచయితలు తమ రచనలు, కార్టూన్‌లు పంపగలరు.

*సంపాదకుడు*

*ఆంధ్రసచిత్రవారపత్రిక*

# అతని లక్ష్యం

'హు తల్లి పుట్టిల్లును మేనమామ వద్ద పొగడాలా అన్నట్టు పొద్దున్న కావలసినవన్నీ చేయించుకు తిని పడుక్కున్నాడంటే, ఇక ప్రపంచానికీ తనకీ సంబంధమే లేనట్టు 'ఈ పూట ఏం వండారూ' అనుకుంటూ రాత్రి తిండి వేళకి లేచే మీ నాన్న సోమరితనాన్ని నేనెరగందా. అయినా ఇప్పుడిక వాళ్ళనని లాభం ఏమీ లేదుగాని నువ్వు తప్పని సరిగా మారే తీరాలి, తెలిసిందా?' ఏమీ మాట్లాడలేదు శాంత.

'రోజల్లా ఇలా వృథా కాలక్షేపం చెయ్యకపోతే సుధ వద్దో, అత్తయ్య వద్దో ఏవన్నా నేర్చుకోరాదూ.'

'నాకేం వస్తుందనీ ఇప్పుడూ' సిగ్గుగా అంది శాంత చిన్నబుచ్చుకుంటూ.

'శ్రద్ధపెట్టి నేర్చుకుంటే మహారాజులా వస్తుంది. అంతేకాదు నాలుగు రకాల్లోనూ ప్రవేశం వున్నప్పుడే విద్యలోనూ రసికత్వం కల్గడం. ఇందాకన్నావ్ చూడూ పాట మొరిగిస్తారని...' ఇంకా ఆ తాపం అణగలేదతనికి నయాన్ని నచ్చజెప్పి భార్యకి ఆసక్తి కల్గిస్తేనే కాని లాభం లేదనుకున్నాడు రామం.

'నిజంగా వస్తుందంటారా?' భర్త చెప్పిందీ నిజమేననుకుంది శాంత.

'ప్రారంభించి చూడు శాంతా, తరవాత నీకే తెలుస్తుంది' అంటూ భార్యని త్వరగా రమ్మని హెచ్చరించి తను కింది కెళ్ళి పోయాడు రామం.

రామం కిందికెళ్ళే సరికే తయారింపుల్నీ జానకి చేయించేస్తే వాట్లని వింత వింత అందాలతో తెల్లగా గుడ్డలు పరిచిన బల్లమీద గజప్లేట్లలో అమర్చింది సుధ. హాయిగా నిద్రపోయి లేచిన తన భార్య సావకాశంగా ముస్తాబై అతిథులంతా వచ్చేసరికి అక్కడకొస్తే, అప్పటి వరకూ అంత చాకిరీ చేసిన జానకీ, సుధా, తీరా ఆ సమయానికి చాటుకి వెళ్ళపోవడం చూచిన పార్వతమ్మగారికే కాక రామానిక్కూడా కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. 'ఇన్ని విద్యలీ ప్రసాదించిన దేవుడు సుధకీ ఒక్క వంకరా పెట్టి ఎందుకిలా బాధించాలి' అనుకుని చాలా బాధపడింది వారి మనసు.

విందుకొచ్చిన వారిలో చాలామంది ఉత్తర హిందూస్థానానికి చెందినవారవడం వల్ల ఈ కొత్త కొత్త పద్ధతుల్లో తయారించిన విందుని ఎంతో మెచ్చుకున్నారు. పార్వతమ్మగారికి హిందీగాని ఇంగ్లీషుగాని రాదు. అయితే అంత ఆడంబరంగా అలంకరించుకుందుకు తెలిసిన శాంతకి ఒక్క తెలుగు తప్ప మరే భాషా రాకపోవడం చూసి శర్మగారూ, రఘూ మొదలైన వారందరితో పాటూ ఆ వచ్చినవారూ కూడా ఎంతో ఆశ్చర్యపోయారు.

ఎవ్వరేమడిగినా అర్థం కాకుండా అందరిముందూ అలా తిరగడం శాంతకి చెప్పరాని అవమానాన్ని కల్గించింది. అయినా ఆ రెండేళ్ళబట్టీ జానకినీ, సుధనీ అంత లోకువతనంగా చూసి ఇప్పుడేమొహం పెట్టుకుని వాళ్ళ విద్య నేర్పవలసిందిగా అర్థిస్తుందని తను? మరి వేరే మార్గం! పాతికేళ్ళు పైబడ్డ తనిప్పుడు బయటవారి వద్ద మొదట్నుంచీ నేర్చుకోవడమంటే, అంతకన్నా అవమానం మరొకటుంటుందా?'.

అయినా, అసలు జానకినీ, సుధనీ గురించి తన భర్తవద్ద కొన్ని విషయాలు తెల్సుకోవాలని అన్నాళ్ళ తరవాత అప్పటి కనిపించింది శాంతకి.

సుధ పెద్దదైనాక తనకే సిగ్గనిపించడం వల్ల ఇల్లు కదలడం మానేసింది గానీ, అదివరకు ఏదన్నా మంచి సినిమా అదీ చూడాలనంటే రఘు అమిత జాగ్రత్తగా తీసుకెళ్ళి తీసుకొచ్చేవాడు. పెరిగి పెద్దదయ్యాక ఎక్కడికీ ఇల్లు

కదలడం మానేసిన సుధని చూస్తే అందరికీ చాలా కష్టంగా వుంటూండేది.

ఒకసారి ఏదో మంచి సినిమా వచ్చి, అందరూ ఆ సినిమాని రెండేసి మూడేసి మార్లు చూస్తూండడం విని సుధ ఆ వెళ్ళిన వాళ్ళనడిగి కథ వింటూండేది. రఘు తీసుకెళ్తానంటే సుధ ఎందువల్లో వెళ్ళలేదు. అయితే అతనితో సుధ ఎందుకు వెళ్ళలేదో అర్థం చేసుకున్న రామం ఎవ్వరికీ కనిపించకుండా నీకు సినిమా చూపించి తీసుకొచ్చే పూచీ నాదంటూ. పంతంగా సుధని ప్రయాణం చేయించాడు. రామం మాటిచ్చిన ప్రకారం లైట్లు ఆర్పి, ఆట ఆరంభం అవుతున్నప్పుడు సుధని ఎవ్వరూ పరిశీలనగా చూడకుండేటట్లుగా తీసుకెళ్ళి కూర్చోపెట్టి మళ్ళీ ఆఖర్న అలాగే లైట్లు వేసేలోగా తీసుకొచ్చి కార్లో కూర్చోపెట్టేశాడు రామం. ఇక ఆరోజు సుధ ఆనందానికి మేరే లేదు. ఆ మర్నాడు ఇంట్లోవాళ్ళందరూ ఏదో ముఖ్య స్నేహితులింటికి పెళ్ళికి వెళ్ళవలసొచ్చి కొంచెం అనారోగ్యం కారణంగా ఇంట్లో వుండిపోయిన రఘుని సుధకి సాయంగా వుంచి మిగతా అంతా వెళ్ళారు.

'మొన్న ఏదో సినిమా చూసొచ్చినట్లున్నావ్. ఏవిటి కథా' అని అడిగాడు. చాలా సేపు సుధకి పాఠాలు చెప్పడం అయ్యాక అన్నాడు రఘు

'అదా?' అంటూ ఉత్సాహంగా ఆ కథంతా చెప్పింది సుధ. అదొక ప్రేమ జీవులగాధ.

'ఆ పిక్చర్ చూశాక నీకే మనిపిస్తూంది?' అన్నాడు తాపీగా రఘు.

'నాకా! దేవకన్యవల్లె నీ భవిష్యత్తు అలాగే ఆనందంగా గడిచిపోవాలని అనిపించింది బావా' తృప్తి నిండిన కళ్ళతో అతన్ని చూస్తూ అంది సుధ.

'అంటే ఏ విషయంలో'

'ఒకటేమిటి అన్ని విషయాల్లోనూ. అలాగే చదువుకున్నదై అలాగే కుడి భుజంలా నీతోపాటు తనూ ఉద్యోగం చేస్తూ, అలాగే నాట్యం, సంగీతం కారు డ్రైవింగూ...అబ్బ అంత అందమైన పిల్ల నీకూ వాస్తే ఎంత బాగుంటుంది బావా?' చిన్న పిల్లలాగ సంతోషం పట్టలేక కేరింత కొట్టేసింది సుధ.

'నిజంగా నువ్వలాగా అనుకుంటున్నావ్?' ఆశ్చర్యపోతూ అడిగాడు రఘు.

'నీకు తగిన అటువంటి చలాకీ అయిన భార్యతో నువ్వు—'

'సుధా. నువ్వు' రఘు హృదయంలో




సరీసృపాలనించే పక్షులు ఏర్పడ్డాయని పరిణామవాదులు చెప్తారు. అంటే తొండలు, బల్లులవంటి జీవులనుంచి పక్షులు ఉద్భవించాయంటారు. ఇంకా చెప్పాలంటే అలాటి సరీసృపాల ముందుకాళ్ళు రెక్కలయ్యాయని, అసహ్యంగా మనకి కనపడే ఆ పొలుసులే, అందమైన ఈకలుగా అయ్యాయని ఒండగా ఉండే 'ముట్టె' సన్నని నాజూకుపక్షి ముక్కు అయిందని— ఇలాగే అన్ని అవయవాలు గురించి చెప్తారు. నిర్మాణయుతంగా పరిశీలిస్తే దీనికి సందేహం లేదని మనకెన్నో ఆధారాలున్నాయి. వాటి జోలికి మనం పోవద్దు. కాని పైన చెప్పినదే నిజమయితే సరీసృప లక్షణాలను వదిలేస్తూ, ఇంకా పూర్తిగా పక్షిగా ఏర్పడని జీవులుండద్దు. అని సందేహం కల్గుతుంది. అలాటి జీవులు దురదృష్టం కొద్దీ లేవు. అవి నివసించేవి అని చెప్పడానికి ఆధారాలు కూడా లేవు. కాని పైన ఆర్కియాప్టెరిక్సు అను నామకరణము చేసిన శిలాజజీవి— ఈ కొరత కొంత తీరుస్తుంది. జర్మనీలో రెండు శిలాజాలు దొరికాయి. ఆర్కియాప్టెరిక్సు అంటే అర్థం పురాతన మనిషి. ఇది సుమారు 15 కోట్ల సంవత్సరాల క్రింద జీవించిన పక్షి. రెక్కలున్నాయి. కాని ఆరెక్కలలో ఎముకలు చాలావరకు కాళ్ళ లాగే ఉన్నాయి. గోళ్ళున్నాయి పైగా. పక్షి రెక్కలకు ప్రస్తుతం గోళ్ళు లేవుకదా! [హోట్జిన్ పక్షి తప్ప] నోటిలోపల దంతాలు బల్లికి లాగే ఉన్నాయి. దంతాలు ఇప్పుడు ఏ పక్షిలోను కనపడవు. ముట్టెకూడా పక్షిలాగే కాక బల్లిలాగే ఉంది. అంతేకాదు. తోక చాలా పొడవుగా వెన్నుపూసలతో బాటుగా ఉంటుంది. ప్రస్తుతం పక్షులకి 'తోక' లేదని అందరికీ తెలిసిందే. తోక అని మనం చెప్పేది ఈకలు మాత్రమే కదా. కాని ఆర్కియాప్టెరిక్సు వెన్నుపూస తోకకు రెండు ప్రక్కలా [వేసాకులాగా] ఈకలు అతికి ఉంటాయి. ఈనాటి పక్షుల తోకలకు ఈకలు విచ్చుకున్న విసన కర్ర మాదిరిగా ఉంటాయి.

కాకి సైజులో వుండే దీని శిలాజం 1870 ప్రాంతాల దొరికింది. ప్రస్తుతం బెర్లిన్ మ్యూజియంలోనూ, లండన్ మ్యూజియంలోనూ ఉన్నాయి.

'ఆంధ్రసచిత్ర వారపత్రిక'లో ప్రచురణకు ఇండియన్ ఇంక్ తో వేసిన కార్టూనులు మాత్రమే పంపాలి. సాధారణంగా $4'' \times 2''$, $4'' \times 4''$ చిత్రాలు పత్రికలో పడుతూ ఉంటాయి. సం॥



# అతని లక్ష్యం

ఏదో అర్థంకాని ఆందోళన బయల్దేరింది. 'అబ్బ నిజంగానే గనక అలా ఒక సుందరాంగిని గనక తను వలచి వరిస్తే! అప్పుడీ అమాయకపు సుధని, మనసంతా తనమీదుంచుకుని ఉన్నపాటి, శక్తేదో ఎప్పుడూ తన సదుపాయాలకే వినియోగిస్తూ, ఇలా నిష్కపటంగా మసులుకుంటూండే సుధని ఇలా చనువుగా ప్రవర్తించనిస్తుందా? ఆ వలఫలరాణి అసలు సుధతో కలిసి వుండడానికీ, సుధని చూడ్డానికీ కూడా అపార్థాలు బయల్దేరితే అప్పుడూ? భగవంతుడా నా బుద్ధి అలా చలింపజేసి ఈ అమాయకురాలికి ద్రోహం తలపెట్టకు. నాకు స్థిరభావం మనోనిబ్బరం ప్రసాదించు' అని మనసారా తన ఇష్టదైవాన్ని ప్రార్థించుకున్నాడు రఘు.

'ఏవిటి బావా! అంతాలోచనా! అప్పుడే ఆ అందాలరాణిగార్ని తలచి ఊహా ప్రపంచంలో తేలిపోతున్నావా?' కిలకిలా నవ్వింది సుధ.

'లేదు సుధా' చాలా శాంతంగా అన్నాడు రఘు. సుధకింత సరసమైన భావాలు తెలుసునని ఇంతవరకూ ఎప్పుడూ అనుకోలేదు రఘు. 'మాటలూ, ఆటలూ పెరిగి పెద్దదవుతూన్నకొద్దీ వాటంతటవే వచ్చినట్టు యుక్తవయసొచ్చేసరికే ఈ భావాలూ వాటంతటవే వస్తాయి గావల్ను' అనుకున్నాడు రఘు.

'పాపం మధ్య మధ్య మాట్లాడించి నీ తలంపుల కంతరాయం కల్గిస్తున్నాను గావల్నేం' జాలి అభినయిస్తూ అంది చేతులోని అల్లికను ఆపేసి.

'సుధా'

'ఏం బావా?'

'నే నొకటడుగుతాను నిజం చెప్తావా?'

'అడుగు బావా!' రఘు మొహంలోకి చూస్తూ అంది.

'నీకు ఆ మోస్తరుగా వుండాలన్లేదా'

'అంతే?'

'అదే ఇందాక వర్ణించావే. నాకు తడి పటువంటి—'

'నువ్వుకూడా నన్ను పరిహసిస్తున్నావా బావా!' ఒక్కసారిగా సుధ మొహం ముకుళించుకుపోయింది.

'అబ్బెబ్బే' యధార్థంగానే అడిగాను సుధా' సుధ ముఖభావం చూసి కలవరపడుతూ అన్నాడు రఘు.

'తాహతుకి మించిన వస్తువులకోసం తత్తరపడే స్వభావం కాదు బావా నాదీ' సుధ కళ్లల్లో నీరు తిరిగింది.

'సుధా!' గాబరాపడుతూ సుధవేపుకి వంగాడు కూర్చున్న పళాన్నే కుర్చీతో సహా రఘు.

'ఎంతవరకూ దేనికి ఆశపడవచ్చో, ఎంతవరకు నే చనువు తీసుకోవచ్చో, అంతవరకు వుండేందుకే నే నలవాటు చేసుకున్నాను బావా!'

'అబ్బ నువ్వు నామాటని సరిగ్గా అర్థం చేసుకోవడంలేదు సుధా! భగవంతుడు అందర్నీ ఒక్కలాగే పుట్టించాడు అందరికీ ఒకలాంటి హృదయాన్నే ఇచ్చాడు కూడా. అలాంటప్పుడు అందరి వాంఛలూ ఒకలా వుండడంలో తప్పేం వుందీ' అన్న భావంతోటే నేనిలా అడిగాన్నిన్ను.

'కాదు బావా, కాదు దేవుడందర్నీ ఒకలాగే పుట్టించాడు, హృదయాన్నిచ్చాడు. అయితే అందరి హృదయాల్లోనూ అన్ని సుఖాల్నీ మనం కూడా అనుభవించాలి' అన్న వాంఛనిచ్చిన ఆ దేవుడు, అందరికీ ఒకేలాంటి అదృష్టాన్ని మాత్రం ఇవ్వడం లేదు. పెద్దలన్నట్టు ఇది విధి కృత్యాన్నీ పూర్వజన్మ సుకృతాన్నీ బట్టి ఏర్పడుతూందనుకున్నా, ఇప్పటి వారన్నట్టూ ఈ విషయంలో తగిన హెచ్చరింపు తీసుకోని కారణంగా స్వయంకృతం వల్ల సంభవిస్తుందన్నా దీని అనుభవంమాత్రం ఒకే విధం గనక వారివారి అదృష్టానికి తగినట్టూ వారి వాంఛల్ని పరిమితం చేసుకోవడం మాత్రం చాలా విధాయకం కదా బావా? అలా చేసుకోగల్గితేనే జీవితంలో కొంచెం శాంతి లభించడం' శూన్యంలోకి చూస్తూ అంది సుధ.

(ఇంకా ఉంది)

# వారఫలం

**12-2-1971 శుక్రవారం మొదలు**
**18-2-1971 గురువారం వరకు**

**మేషం:** వ్యాపారంలో సాటివారి పోటీ పెరుగుతుంది. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు. రావలసిన డబ్బు సమయానికి అందగలదు. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

**వృషభం:** వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు. సాటివారితో మాట పట్టింపులు తగవు. ఇతరుల నిమిత్తం మీరు శ్రమకు గురి కాగలరు.

స్త్రీలకు:— సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి. అధిక వ్యయం జరుగుతుంది.

**మిథునం:** అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది. సాటివారిలో గౌరవం లభిస్తుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. వారం ఆఖరులో వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. మీ ఆలోచనలు లాభదాయకంగా ఉంటాయి.

స్త్రీలకు:— బంధు మిత్రులను కల్సుకొంటారు. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

**కర్కాటకం:** వృత్తిలో అనుకూల వార్తలను వింటారు. రాజకీయ వ్యవహారాలు బాగా ఉంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. స్థిరాస్థి వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. సామాన్యమైన పనులకు కూడా మీరు ఎంతో కృషిచేయవలసి వస్తుంది.

స్త్రీలకు:— వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. శుభకార్యాలు చేస్తారు.

**సింహం:** మున్ముందు ఉపయోగించ గల పరిచయాలు యేర్పడతాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు లభిస్తాయి. వ్యాపారంలో సాటివారి పోటీ తగ్గుతుంది. కోర్టు వ్యవహారాలు బాగుంటాయి.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కన్య:** అన్ని వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగుంటాయి.

స్త్రీలకు:— కుటుంబవ్యవహారాలు బాగుంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**తుల:** కొన్ని వ్యవహారాల్లో అనవసరమైన శ్రమ కలుగుతుంది. మీ తాలూకు వస్తువులు పోవచ్చును. ప్రయాణాలు వాయిదా పడతాయి. వారం ఆఖరులో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండదు. సాటివారిలో గౌరవం లభిస్తుంది.

**వృశ్చికం:** వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. మిత్రులసహాయం లభిస్తుంది. వారం ఆఖరులో సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**ధనుస్సు.** వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగా ఉంటాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. బంధువులకు సహాయం చేయగలరు.

**మకరం:** వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. ఆర్థిక వ్యవహారాలు బాగా ఉంటాయి. ప్రయాణాలోచనలు చేస్తారు. అధికారుల వలన జరుగవలసిన వ్యవహారాలు బాగా ఉంటాయి. స్థిరాస్థి వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది.

స్త్రీలకు:— సంతోషకరమైన వార్తలను వింటారు. దైవ కార్యాలు నెరవేరతాయి.

**కుంభం:** లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. ఆందోళన కలుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం ఆఖరులో వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. మీ ఆలోచనలు ఫలిస్తాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండదు. శుభ కార్యాల విషయంలో అభివృద్ధిని సాధించగలరు.

**మీనం:** అన్ని వ్యవహారాలు అనుకొన్నట్లుగా నెరవేరతాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. వారం ఆఖరులో ప్రయోజనం లేని శ్రమ కలుగుతుంది, వ్యతిరేకమైన వార్తలను వింటారు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. ప్రయాణాలు వాయిదా పడతాయి.

—మహేష్

ఇప్పుడు మీరు శ్రోతలు
కోరిన పాటలు
వింటారు

Buchhi




అప్పుడే వచ్చిన వుత్తరంలో మొదటి నాలుగు వంక్తులూ చదువుకున్న గోపాలానికి, గొంతెత్తిపాడి నృత్యం చేయాలని పించింది. లాటరీలో లక్షలు వచ్చిపడినా కలుగని సంబరం గుండెనంతా ఆవరించి వుక్కిరిబిక్కిరి చేసింది — ఏనాడూ, ఎప్పుడూ, ఎక్కడా వూహించని అదృష్టం, చిరునవ్వులు చిందుతూ, వయ్యారంగా నడచివచ్చి ఘుమఘుమలాడే పూలదండ వేసి వరించింది. నూటూ—బూటూ వేసుకుని, గంభీరంగా, గర్వంగా, అలక్ష్యంగా, తనతో పోటీపడిన ఆ నలుగుర్ని పిక్కతాపు తన్ని తనచెంత చేరింది. ఆశ్చర్యం !... అయినా నమ్మక తప్పదు. తెల్లటి కాగితంమీద టైపుచేసిన ఆ నల్లటి అక్షరాల్ని నమ్మకుండా ఎలా వుండటం ?

'సుశీ !...' అనరచాడు.

ఇరుగుపొరుగున, అరుగుమీదో, వీధిలోనో ఎవరూ అతనికేక వినకపోవటం మంచిదైంది- లేకపోతే 'పాపం ! ప్రకాశం! ...పూర్ ఫెలో!... నిరుద్యోగిగా ఎంతకాలం సహనంతో జీవించగలడు ?... మెదడులో ఏదో నట్టు లూజైనట్టుంది ... వెళ్లి చూసొద్దాం—' అనతవి ఇంటిముందు గుమిగూడేవారు.

సుశీల పలక్కపోయేసరికి లోపలికి వెళ్లి చూశాడు.

సుశీల ఆ చిన్నికృష్ణుడి విగ్రహం ముందు కూర్చుని, కళ్లుమూసుకుని, యిహాన్నిమరిచి ఎక్కడో ఆకాశంలో, ఎవరికీ కనిపించని భక్తి మేఘంమీద తేలిపోతూంటుంది.

ఆ సమయంలో బాంబులు పడ్డా ఆమె వులకదు—పలకదు.

ప్రతిరోజూ తొమ్మిదింటికల్లా పూజ ముగించి 'దివినుండి భువికి' వచ్చేస్తుంది. ఆరోజు వంటో బాగుండక పోవటంవలన ఆలస్యంగా నిద్ర లేచింది. కొద్దిగా జ్వరం వున్నా లెక్కచేయక, తన సలహాను మన్నించక, చన్నీటిలో స్నానం చేసింది. అందుకే పదకొండైనా ధ్యానముద్ర చెక్కు చెదరకుండా సౌండ్ ప్రూఫ్‌గా వుంది. ఆమె ధ్యానాని కంతరాయం కలిగించటాని కిష్టంలేక అరుగుమీద కొచ్చి ఆ వుత్తరం పూర్తిగా చదివాడు. ఉన్నట్టుండి కరెంటుపోయి దీపాలారినట్టు అతనిముఖం నల్లబడింది. అతన్ని తాత్కాలికంగా వశపరుచుకున్న సంతోషాన్ని తన్నితరిమేసి 'ఇది నాస్థిరవాసస్థానం. అతను పుట్టినప్పట్నుంచి నేనిక్కడ పెరుగుతున్నా—నన్ను తోసిరాజనటం నీ తరంకాదు—' అని దురదృష్టంగట్టిగా నవ్వింది ఆమాటలు విన్న ప్రకాశం 'నిజం అక్షరాలా నిజం—నూటికి నూరుపాళ్లు నిజం—' అనుకున్నాడు.

పదోయేట అతనితండ్రి పోయాడు. దూరపు బంధువుదయతో అతనితల్లి ఎలాగో ఎస్.ఎస్.ఎల్.సి.దాకా చదివించింది. బొటాబోటీ మార్కులతో స్కూలు ఫైనలు ప్యాసయ్యాడు — తరువాత వుద్యోగాన్వేషణ—ఆరునెలలు సహనంతో పోరాటం—పరీక్షలో నెగ్గి మునిసిపాలిటీలో గుమాస్తాగా జీవితం ప్రారంభించాడు—తల్లి ఆరోగ్యం పూర్తిగా నశించింది. వారానికి రెండుమూడుసార్లు జ్వరంతో పడుకునేది. ప్రకాశం నిజంగా భయపడ్డాడు.

'ప్రకాశం!...పెళ్లిచేసుకో—చనిపోయే ముందు నిన్నొక ఇంటివాణ్ని చేయాలన్న ఒక్కకోర్కె మాత్రమే నాకు మిగిలింది...'

అని తల్లి కొత్తపాట ప్రారంభించింది. ప్రకాశం ఏవో కారణాలుచెబుతూ వాయిదా వేస్తూ వచ్చాడు. అసలు అతనికి పెళ్ళి చేసుకోవాలని లేదు. ఈ ఇరుకు జీతంతో మరో ఆత్మను పోషించడం అతని కెంత మాత్రం యిష్టంలేదు

తల్లి పంపించిన సుశీలను చూట్టానికి ఒప్పుకొన్నాడు.

కాని, ఆమెను చూశాక అతని మనసు పూర్తిగా మారిపోయింది

ఆమె అందచందాల కంటె, ఆ కళ్ళు అతన్నెంతగానో ఆకర్షించాయి. తనలో వున్న బలహీనతల్ని, లోటుపాట్లను సరిదిద్ది, ఆత్మవిశ్వాసం దిగజారిపోకుండా — అనురాగం అంతరించకుండా—ఆ కళ్ళల్లోవున్న గంభీరత తనకు సాయపడుతుందని ఆమెను చూసిన మరుక్షణం నిర్ణయించుకున్నాడు. తల్లికి కూడా సుశీల ఎంతో నచ్చింది. ఆమెకూడా పేదకుటుంబంలో పుట్టి పెరిగింది.

రెండు కుటుంబాల అంతస్తులు త్రాసులో సరిసమంగా తూగాయి.

కాని పెళ్ళైన తరువాత అతనూహించినట్టు ఏదీ జరగలేదు.

రిట్రెంచ్‌మెంట్ మూలంగా వుద్యోగం వూడింది తన చివరికోరిక నెరవేరటంతో తల్లి తృప్తిగా కన్నుమూసింది. కాలానికి విలువలేకుండా వుద్యోగంకోసం తిరిగాడు. తెలిసినవాళ్ళనీ—తెలియనివాళ్ళని సాయం చేయమని అర్థించాడు. కాని ఫలితం శూన్యం — అప్పుడప్పుడు ఎక్కడైనా 'లీవ్ వేకన్సీ'లో పనిచేసేవాడు— మూడు నాలుగు చోట్ల ప్రైవేట్లుకూడా ఏర్పాటు చేసుకున్నాడు—కాని ఎన్నాళ్ళలా గడపటం? సుశీల బాగా చిక్కిపోయింది. అతను తన్నుతాను అసహ్యించుకున్నాడు.

..............................

ప్రకాశం చీకటిలా నవ్వాడు. ఆ వుత్తరం మరోసారి చదువుకున్నాడు.

'పూర్ ప్రకాశం ! ... నీ నుదుటిగీత ఏదో ఇనుపసిరాతో రాసుంది—దాన్ని చెరపటమో—వగిషీలు దిద్దటమో—ఎవరికీ సాధ్యంకాదు—' అని తన్నుతాను వోదార్చుకున్నాడు.

'ఏవిటలా దిగలుపడి కూర్చున్నారు?... వంటో బాగాలేదా ?...గంటక్రితం కూడా బాగానే వున్నారే ?...'

ప్రకాశం తలెత్తి చూశాడు—సుశీల పళ్ళెంలో పువ్వులూ, కుంకం పట్టుకుని నిలబడుంది—ప్రకాశం ప్రీపీర్సు కోల్పోయిన రాజులా మళ్ళీ నవ్వాడు.

'ఆశంటూ కలగకుండావుంటే ఫరవా లేదు — ఆశా భంగమంటూ ఒకటుండదుగా !...'

'ఏవిటో !...మీ మాటలూ, మీరూనూ —స్థిరమైన వుద్యోగం దొరకనంత మాత్రాన జీవితం ముగిసిపోయిందా ఏవిటి?...కలకాలంఒకలాగుండదు మనకూ మంచిరోజులు వస్తాయి ... ముందీ పువ్వులు కళ్ళ కద్దుకోండి.

కనీసం దైవవిశ్వాసమైనా నశించకుండా వుండేట్టు చూడండి— అదుంటే సముద్రాలకూడా యీదవచ్చు—'

'నీదంతా వట్టి ఛాదస్తం...అయినా నీమనసు నొప్పించట మెందుకు?... అసలు సంగతి విను— నెలరోజులకితం వో ఇంటర్వ్యూకి మద్రాసు వెళ్ళాను, జ్ఞాపకం వుందా ?...'

'లేకేం?... గంగారాం అండ్ కంపెనీకి...'

'కరెక్ట్ !...అక్కణ్ణించి కాషియర్‌గా అప్పాయింట్‌మెంట్ వచ్చింది.'

ఆ వుత్తరం రెపరెపలాడించాడు.

'నిజంగా?...'

'పచ్చి నిజం. ఈ ఆర్డరు నువ్వే చదివి చూడు. జీతం ఆరువందలు. అంతా బాగానే వుంది కాని వో చిన్న చిక్కు—నా మొహం...పెద్ద చిక్కే!...విడదీయలేని చిక్కు. వెయ్యి రూపాయలు డిపాజిట్టు కట్టాలిట పుండుమీద కారంలా, రెండు రోజుల్లో జాయినవాలిట! డబ్బు పుట్టించటానికేదైనా మార్గం వెదుకుదామంటే అందుకు టైంలేదు. చిన్నపిల్లాడిచేతిలో అరటిపండుంచి, తినేసమయానికి పుటుక్కున లాక్కుపోయినట్టుంది నా పరిస్థితి. ఇంతకూ నీభాషలో ఇదంతా విధిలిఖితం—ఇప్పుడిప్పుడు నేనుకూడా ఆ రాతను నమ్ముతున్నాననుకో...ఆలోచించి చేసేదేమిలేదు—వో పాడుకలగా భావించి అన్నీ మరచిపోవలసిందే!...'

సుశీల వో నిమిషం దీర్ఘాలోచనలో పడింది—

'ఏవిటలా ఆలోచిస్తున్నావ్ సుశీ !... డబ్బు ఏ బ్యాంకులోంచి డ్రా చేదామనా? ...బ్యాంక్ ఆఫ్ ఇండియా ... ఆంధ్రా బ్యాంక్...ఏది మంచిదని నీ అభిప్రాయం? నా అభిప్రాయంలో బ్యాంక్ ఆఫ్ బరోడా మంచిది-ఎందుకంటే, తతిమ్మాబ్యాంకుల్లో వున్నవన్నీ ఫిక్సెడ్ డిపాడిట్లు మరి...' అని విరగబడి నవ్వాడు ప్రకాశం. సుశీల ముఖం చిట్లించింది...

'చాల్లెండి !...ఎప్పుడూ వేళాకోళాలే మీకు...వస్తే అతివృష్టి లేకపోతే అనావృష్టి—అన్నట్టు ఒక్కసారి పాతాళానికి క్రుంగిపోతారు — మరోసారి మబ్బులమీద షికారు వెడతారు. ప్రశాంతంగా వుండటం నేర్చుకోండి...'

ప్రకాశం మౌనంగా వుండిపోయాడు.

'పోనీ—మీస్నేహితు లెవర్నైనా అడిగి చూస్తే ?...'

'నీమాట వింటుంటే నాకో నిజం జ్ఞాపకాని కొస్తోంది. మనం ఎవరింటికైనా వెళ్ళామనుకో—ఆ వ్యక్తి భోంచేస్తూంటాడు. 'ఒహో !... భోజనం చేస్తున్నారా?' అంటాం. అది అర్థంలేని ప్రశ్న — తెలిసుండీ ఎందుకడగటం?... నీ సలహా కూడా అలాగే వుంది—నాకున్నది ఇద్దరే మిత్రులు—వెంకట్రావు—శేషగిరి ...వాళ్ళిద్దరిదగ్గర ఇప్పటికే చెరో మూడువందలు తీసుకున్నాను—ఒక్క పైసా కూడా తిరిగివ్వలేదు. మళ్ళీ ఏ మొహంతో అడుగను ?...ఇవ్వాలనుకున్నా వాళ్ళదగ్గర డబ్బుండొద్దూ ?—వాళ్ళూ మధ్యతరగతి కుటుంబీకులేగా !'

'మరి రత్నంగారు ?...'

'ఆయన్నర్థించటం నాకేంతమాత్రం యిష్టంలేదు. ఇప్పటికే యాభై రూపాయలు రుణపడి వున్నాను అయినా అడిగి చూస్తాను — ఈపాటికాయన సుష్టుగా భోంచేసి నిద్రకుపక్రమించి వుంటాడు. డిస్టర్బ్ చేయకూడదు — సాయంత్రం వెడతాను ... నాక్కూడా ఆకలేస్తోంది— ఉన్నదేదో వడ్డించు'

కాళ్ళూ చేతులూ కడుక్కునేందుకు నూతివైపుకు వెడుతుంటే ఆ చిన్ని కృష్ణుడి విగ్రహం కిటికీలోంచి కంటపడింది రోజూ చూస్తున్న విగ్రహమైనా, ఆ రోజెందుకో కొత్తగా కనిపించింది.

## చిన్నికృష్ణుని...

ఠకుక్కున ఆగి తదేకదీక్షతో చూశాడు. అతని మనసులో వో ఆలోచన మొలకెత్తింది — వెంటనే ఏదో తప్పుచేసినవాడిలా బాధపడ్డాడు. వెనకాలే వచ్చిన సుశీలను క్షమించమన్నట్టు చూశాడు. సుశీలకేమీ అర్థంకాలేదు.

'సుశీ! ... అవసరమంటూ వస్తే మనిషికి మంచిచెడ్డలు తెలియవు. పంచభక్ష్య పరమాన్నాలతో భోజనం చేసే మనిషి, తిండికిలేక దొంగతనం చేస్తున్న వ్యక్తిని విమర్శిస్తాడు—నిందిస్తాడు—కాని అతన్నాపని చేయించిన పరిస్థితుల ప్రభావాన్ని తెలుసుకోలేడు... అలాగే దేవుడిసొమ్ము మీదే నా కన్ను పడింది. అపచారం!'

'అంటే?'—అర్థంకాక ప్రశ్నించింది సుశీల.

'అదే!...మరి ... నువ్వేమీ అనుకోకపోతే—అసలు సంగతేవిటంటే ... మరేం లేదనుకో...ఆపదలకు ఆదుకునేవాడు—కనక—మనకిప్పుడతనేదిక్కు...అందుకని...ఎందుకలే... నువ్వు ఒప్పుకోవు... సహించలేవుకూడా—'

ప్రకాశం తడబడ్డాడు—విషయం విప్పి చెప్పకుండా నూతివైపు దారితీశాడు. సుశీల కర్థమైంది.

ఆ చిన్నికృష్ణుడు బంగారు నగలమీద అతనికన్ను పడింది—ఆమె గుండెలు దడదడ కొట్టుకున్నాయి ... ఇంతకుముందు ఎన్నో అవసరాలు—ఆటంకాలు—కష్టాలు—వచ్చాయి కాని ఏపరిస్థితుల్లోనూ ఆ నగల ప్రసక్తి లేదు. అలాంటి ఆలోచనలు పుట్టుకురావటమే అశుభ సూచకంగా కనిపించింది. సుశీల ఆ విగ్రహంకేసి సజల నేత్రాలతో చూసింది.

ముచ్చటైన చిన్నారి ముద్దువిగ్రహం.

మరింత అందమైన బంగారు కిరీటం. గొలుసులు—చెవులకు కుండలాలు—బంగారు మొలత్రాడు—గజ్జెలు — ఒకదానికంటె ఒకటి సౌందర్యాశిని పూసుకుని తళతళ మంటున్నాయి—

సుశీలకు పాత జ్ఞాపకాలు వచ్చాయి.

పుట్టిల్లువదలి భర్తవెంట వెడుతున్న సుశీలను ఆశీర్వదిస్తూ—

'ఇదుగో సుశీ! ...ఈ చిన్ని కృష్ణుడు ఇకముందు నీదగ్గరుంటాడు. పెళ్లైన కొత్తలో మాఅమ్మ నాకు కానుకగా యిచ్చింది. మంత్రయుక్తంగా పూజ పునస్కారాలు జరుపలేకపోయినా ప్రతిరోజూ దీపంవెలిగించి దండంపెట్టు—అన్నవస్త్రాలకు లోటుండదు — ఒక్కమాట మాత్రం మరచిపోకు. అటు సూర్యుడిటు పొడిచినా ఈ విగ్రహానికున్న నగలుమాత్రం అమ్మకు—మనకుటుంబంలో తరతరాలవారు కంటికి రెప్పలాకాపాడారు—' అంది అమ్మ—

సుశీల ఆలోచనలో పడింది.

*   *   *

ప్రకాశం రత్నంగారింటికి బయలుదేరాడు.

'ఒక్కనిమిషం ఆగండి. నాలో నేను తర్జనభర్జనలు చేసుకుని వో నిర్ణయానికి వచ్చాను. ఆ నగలు అమ్మేయండి...' అంది సుశీల.

'సుశీ!...తప్పు—అది నావల్లకాదు.'

'మరేం ఫరవాలేదు ... ఉన్నవీ లేనివీ వూహించుకుని బాధపడి లాభంలేదు. ఇదికూడా ఆ కృష్ణుడి వరప్రసాదమనుకుందాం. లేకపోతే ఇంత చక్కటి ఉద్యోగానికి తిలోదకాలివ్వవలసి వస్తుంది. నా మాట వినండి.'

'సరే!...రత్నంగార్ని అడిగి చూస్తాను. ఆయనేమంటాడో చూద్దాం—' అంటూ వీధిలోకొచ్చాడు.

రత్నంగారిల్లు వూరిచివరుంది. మైలున్నర నడవాలి. ఆయనకూ ప్రకాశానికి పరిచయం చిత్రంగా జరిగింది.

'ఎక్కడో 'వేకన్సీ'వుందని పొరుగూరు వెళ్లి బస్సులో తిరిగివస్తున్న అతని కాళ్లదగ్గర వో పర్సు పడుంది ఎవరూ చూడని సమయంలో దాన్ని పాంటుజేబులో భద్రపరిచాడు. బస్సు దిగి కొంతదూరం నడిచాక వో సిమ్మెంటు దిమ్మమీద కూర్చుని తెరచి చూశాడు. అయిదువందరూపాయలనోట్లు కనిపించాయి. మంచికీ—చెడుకూ మధ్య వాగ్వివాదం జరిగింది. ఐడియలిజం వెర్సస్ రియలిజం. అలా తర్జనభర్జనలు జరిగాక చివరికి ఆ పర్సులోవున్న అడ్రసు ప్రకారం రత్నంగారిల్లు చేరుకున్నాడు.

ఆయన వో రిటైర్డ్ ఐ. పి. యస్. ఆఫీసరు. ఒక్కగానొక్కకొడుకు అమెరికాలో వున్నాడు. భార్య చనిపోయి చాలాకాలమైంది. ఇంట్లో వొంటాయన మాత్రం వున్నాడు.

ప్రకాశం పర్సు అందించాడు.

అతని మంచితనాన్ని నిజాయతీని వేనోళ్ల పొగిడి, గట్టిగా కావలించుకున్నారు.

ఫలహారం; కాఫీఅయ్యాక, అతని వూరు, పేరు, వుద్యోగాల్ని గురించి వాకబు



చేశారు. అతను నిరుద్యోగని, పైపెచ్చు రెండు సంవత్సరాలుగా అలా వున్నాడని విని కొండంత బాధపడ్డారు ఇరవైసార్లు పెదవి చప్పరించారు నిరుద్యోగ సమస్యను రూపుమాపలేక పోయినందుకు ప్రభుత్వాన్ని, తీవ్రంగా, ఘాటుగా విమర్శించారు. విలాంటిచర్యలు తీసుకుంటే యువలోకం హర్షించి సుఖిస్తుందో వివరించారు.

చివరకు—

'అబ్బాయ్! నే రాజకీయవేత్తలా నేనూ లెక్చరిచ్చాను — అదంతా మర్చిపో!... నిష్ప్రయోజనం ... నీకేదైనా సాయం చేద్దామనుంది—మూడు—మద్రాసులో గంగారాం అండ్ కంపెనీ అని ఒకటుంది—మంచి లాభాలు గడిస్తున్న సంస్థలలో అదొకటి—అక్కడి చీఫ్ అకౌంటెంట్ అప్పారావు నా ప్రాణమిత్రుడు—శిష్యుడు అన్నీ—నీకో ఉత్తరం రాసిస్తాను—కోమారు వెళ్ళిరా—ఏదైనా తోవ చూపిస్తాడు. నామాట కాదనడు—అతనికి నేనంటే అమితమైన అభిమానం' అంటూ తన లెటర్ హెడ్‌మీద చకచకా ఉత్తరంరాసి కవర్లో బంధించి అతని కందించారు. ప్రకాశం కృతజ్ఞత వెలిబుచ్చి వస్తేస్తుంటే 'ఈ యాభై రూపాయలు నీ దగ్గరుంచు' అన్నారు.

'ఇది నీమంచితనానికి పారితోషికం కాదు నాయనా! మద్రాసు వెళ్ళేందుకు దారి ఖర్చులకని అప్పుగా యిస్తున్నా—'

ప్రకాశం వగాంగా ఆడబ్బు తీసుకుని మరోసారి కృతజ్ఞత తెలియజేసి బయటపడ్డాడు—

ఆ తరువాత ఆయన్ని కలుసుకోటం వీలు పడలేదు — మళ్ళీ అప్పుడగటానికి వెడుతున్నాడు—

అసలు తనకీ వుద్యోగం వస్తుందని అతను కల్లో కూడా అనుకోలేదు.

గంగారాంఅండ్ కంపెనీ చేరకుని అప్పారావుకు రత్నంగారి పరిచయపత్రం అందించాడు

ఆయిన ఆదరంగా ఆహ్వానించి కొన్ని కుశలప్రశ్నలు వేశారు ముఖ్యంగా రత్నంగారి ఆరోగ్యం ఎలావుందని, ఆయన ... ఎలా పోతోందని అడిగి తెలుసుకున్నాక కాఫీ ఇప్పించారు

'మా ఆఫీసులో కాషియర్ పోస్టు ఖాళీ వుందోయ్ — నలుగుర్ని ఇంటర్వ్యూ

# చిన్నికృష్ణుని...

పిలిచాం—నువ్వుకూడా అపియర్ కావచ్చు. ఏమంటావ్?...'

'మీరు చెప్పినట్టు చేయటానికి సిద్ధంగా వున్నానండి...'

'సరే!... బయట రిసెప్షన్‌రూంలో వో అరగంట కూర్చో — ఇంటర్వ్యూ పదకొండుకు—దానికో బోర్డుంటూవుందిలే, అందుచేత ఈ విషయంలో నీకెంతవరకూ సాయపడగలనో తెలియదు...అంటే సెలక్షన్ పూర్తిగా నా నిర్ణయంమీద ఆధారపడి వుండదు రత్నంగారు నా ఆప్తమిత్రులు. ఆయనకోసం ఏమైనా చేయాలి — కాని కొన్ని అడ్డంకులున్నాయి—అయినా, నా శక్తి వంచన లేకుండా ప్రయత్నిస్తాను'

ప్రకాశం అప్పటికే ఆశవదులుకున్నాడు. వెంటనే తిరిగి వెళ్ళిపోదామని కూడా అనుకున్నాడు—కాని, ఇంతదూరం వచ్చాక ఆ ఇంటర్వ్యూ తమాషాకూడా చూసిపోవా మనుకున్నాడు—

రిసెప్షన్‌రూంలో ఆ మిగిలిన నలుగురు కాండిడేట్లు ఠీవిగా కూర్చున్నారు.

ముగ్గురు కోట్లు వేసుకుంటే, ఒకతను నెత్తిమీమాత్రం కట్టుకున్నాడు. అవునుమరి: అంత పెద్ద కంపెనీలో కాషియరు వుద్యోగమంటే మాటలా?

ఆడంబరం అన్నింటికంటె ముఖ్యమైనది.

సరిగ్గా పదకొండుగంటలకు, అతన్నే ముందుగా పిలిచారు

అకౌంటింగ్ గురించి, సేల్స్‌టాక్స్ గురించి ఏవేవో ప్రశ్నలు వేశారు—ప్రకాశాం ఏవో జవాబులు చెప్పాడు అవన్నీ తప్పని అతనికి తెలుసు — ఆ బోర్డులో ఒకాయనకు చరిత్రంటే యిష్టంగామోలు! ఔరంగజేబు పరిపాలన ఎందుకు రక్తికట్టలేదు?...సంత్‌తుకారాం ఎందుకు సన్యసించాడు?...అలా కొన్ని ప్రశ్నలు వేశారు; పదినిమిషాల తరువాత ఎలాగో బయటపడి స్వేచ్ఛగా వూపిరి పీల్చుకున్నాడు—

ఏదరికెలాగైతేనేం, అప్పారావుగారి అనుగ్రహంవలన ఆ వుద్యోగం తనను వెదుక్కుంటూ వచ్చింది.

రత్నంగారి బంగాళా వచ్చేసింది.

కాంపౌండులో అడుగుపెట్టేసరికి రత్నంగారు వాహ్యాళికి సిద్ధమవుతున్నారు—

సాదరంగా ఆహ్వానించి, కూర్చోబెట్టి కాఫీ తాగించారు. ప్రకాశం సంగతులు వివరించాడు.

'భేష్ ... అదృష్టవంతుడివి—కంగ్రాచ్యులేషన్స్—ఏదో గుమాస్తా వుద్యోగం యిస్తాడనుకున్నానుకాని, కాషియర్‌గా అర్డరిస్తాడనుకోలేదు నేను ముందే చెప్పానుగా! అతనికి నేనంటే వల్లమాలిన అభిమానం. ఇది బాధ్యతవున్న పోస్టు చాలా జాగ్రత్తగా వుండాలి. నీకు తెలియనివన్నీ అప్పారావు నడిగి తెలుసుకో. పైకి రాగలవు ఇక నీ భవిష్యత్తు నీ చేతిలో వుంది...విష్‌యూ ఆల్‌దిబెస్ట్!'

'మెనీథాంక్స్ సార్!... ఒక్క చిన్న మనవి—'

'ఏమిటది? ... సంకోచం లేకుండా చెప్పు—'

'వెయ్యిరూపాయలు డిపాజిట్టు కట్టాలన్నారు—'

రత్నంగారిముఖ కళవళికలు హఠాత్తుగా మారాయి—గోడమీద వూగిసలాడుతున్న దీపం వెలుతురులా—

'వెయ్యిరూపాయలా?...'అని నసిగారు—

ప్రకాశం ఏదో అనబోయి వో నిమిషం మౌనంగా వుండిపోయాడు...

'మరేనండి!'...అందుకూడా మీసాయం అవుసరముందండి!'

ఆయన మాట్లాడలేదు—ఎటో చూస్తూ కూర్చున్నాడు.

'నాదగ్గర కొన్ని నగలున్నాయి—అమ్మితే కనీసం ఎనిమిదివందలైనా దొరుకుతాయి. తతిమా రెండువందలు జమ చేసేందుకు టైం లేదు—మొదటి నెల జీతం వచ్చేవరకూ ఆగమని అప్పారావు గారికి మీరు సిఫారసు చేయాలి...'

రత్నంగారి ముఖం విప్పారింది.

'హోస్...ఇంతేనటోయ్!' ఏమిటో అనుకున్నా—ఈమాత్రం చిన్న సాయానికింతగా తటపటాయించాలటోయ్! వెర్రిప్రకాశం!' అంటూ బరబరా నాలుగు వంకులు గీకిపారేసి — కవరు అందించారు

ప్రకాశం ఆయనకు నమస్కరించి కాంపౌండులోకి వచ్చాడు.

'ప్రకాశం!... నో సంగతి అడగడం మరచాను...ఆ నగలు ఎక్కడ అమ్మదలచు కున్నావ్?'

'ఇంకెక్కడండి?...అన్నపూర్ణకే!'

'వద్దోయ్!...వాడు పెద్ద దొంగ. కోరు... మద్రాసులో అమ్మితే నాలుగు రూపాయ లెక్కువే వస్తాయి ... రమన్‌లాల్ శేట్‌కి అమ్ము. వాడు మనవాడేలే! వాడికో పుత్తరం ఇస్తాను.'

ప్రకాశం ఆ పుత్తరంకూడా అందు కుని మరో నమస్కారం పారేసి ఇంటి ముఖం పట్టాడు.

* * *

'రత్నంగారు కులాసాయేనా? ... చూచి చాలాకాలమైంది—' అని నగల నాణ్యం పరీక్షిస్తూ అన్నాడు రమన్‌లాల్—

'మంచి పాతబంగారం—' అని తనలో తాను గొణుక్కుంటూ నగలు తూచటం ముగించాడు - మరో సారి నాణ్యపరీక్ష చేశాడు.

'ఏడువందల రివ్వగలను' అన్నాడు.

'మరోవందకూడా యిస్తే బాగుం టుంది—తప్పనిసరిగా అమ్ముకుంటున్నాను... కాని...'

బంగారంమంచిదైనా పాతదిచూశారూ! అందువేత కరిగించినప్పుడు తగ్గుతుంది... మీ రత్నంగారి స్నేహితులు కనక ఏడు వందలన్నాను—మరొకరైతే అయిదువందల కొక్క పైసైనా ఎక్కువివ్వను -

రమన్‌లాల్ డబ్బు లెక్కపెడుతున్నాడు.

'ఏదీ!...ఆనగలు ఒక్కసారి చూడ నివ్వండి—'

ప్రకాశం తలెత్తి చూశాడు. అంత వరకూ ఆ దుకాణంలో ఉన్న వ్యక్తిని గమ నించనేలేదు వయస్సు నలభై సంవత్సరా లుంటాయి. ఫుల్‌సూటు వేసుకున్నారు. నుదుటిమీద చిన్న కుంకుం బొట్టు. ఆధునిక నాగరికతకో పి ... చిహ్నం—కళ్ళజోడు ముఖానికి నిండు తనాన్నిచ్చింది—జీవిత రహస్యం గమ నిస్తున్నట్లు పెదిమలమీద చిరు నవ్వు— ప్రకాశం ఆయన్నలాగే చూస్తూండి పోయాడు.

రమన్‌లాల్ ఆనగలన్నీ వినయంగా ఆయన ముందున్న టీపాయ్‌మీదుంచాడు.

'చాలా ముచ్చటగా వున్నాయిసుమండి!... పనితనం పసందుగా వుంది. ఉదాహరణకు ఈ చిన్నకిరీటం తీసుకోండి. ఈ పువ్వులు, లతలు, ఇంత చిన్నప్రమాణంలో బంగా రంలో సృష్టించాలంటే ఎంతటి శిల్ప చాతుర్యం, నైపుణ్యం అవసరమో వూహిం చండి. ఈ కాలంలో ఇలాంటి పనితనం వున్నవారెవరూ లేరు. ఈ ట్రెజర్‌ను మీరు అమ్ముకోవలసి వచ్చినందుకు నేను చాలా బాధపడుతున్నాను.'

'నేనూ అలాగే ఫీలవుతున్నానండి...కాని తప్పనిసరి.' అన్నాడు బాధగా.

తరువాత తను ఎందుకమ్ముకోవలసి వచ్చిందో వివరించాడు.

గంగారాం కంపెనీలోనా?...' అనడిగా డాయన—

'అవునండి...మీ కెవరైనా తెలుసా?.'

'అబ్బే?...అసలు మా దీవూరు కాదు. మా అబ్బాయి అక్కడ రొమారు వుద్యోగ ప్రయత్నంచేసి ఓడిపోయాడు ... మీరు అదృష్టవంతులు.'

రమన్‌లాల్ మరోసారి లెక్కపెట్టి ప్రకాశానికి డబ్బు అందిచ్చాడు.

'నాదో చిన్నమనవి...మీరు మరోలా భావించకుండా వుంటే చెబుతాను.' అన్నా డాయన.

'తప్పకుండా— సెలవివ్వండి.'

'ఈ నగలకు విలువంటూ లేదు —కాని రమన్‌లాల్ వ్యాపారస్తుడు. శిల్పసౌందర్యాన్ని ఆస్వాదించటం—ఆనందించటం అతని పని కాదు. లాభాలు గడించటమే అతని లక్ష్యం ...నా అభిప్రాయంలో కనీసం వెయ్యి రూపాయలైనా ఖరీదు చేస్తాయి. అందు చేత మీకు మరో మూడువందలిస్తున్నాను. కాదనక తీసుకోవాలి.' అని పర్సు తెరిచారు.

ప్రకాశం వద్దని వారించేలోగా 'ఊరికే యివ్వటంలేదు. ఈ నగలు రమన్‌లాల్ దగ్గర్నుంచి నేను కొంటున్నాను. వీటి విలువ అతనికేం తెలుసు?' అన్నారు.

'భగవాన్!...నువ్వెంత దయామయు డివి! నిజంగా నువ్వు ఆపద్బాంధవుడివే! ...సుశీల భక్తి నిర్మలమైనది' అను కున్నాడు ప్రకాశం.

'ఇంతకూ తమ వూరూ పేరూ సెల వివ్వారుకారు—'

ఆయననవ్వి 'ఎవరో దారినపోయే దనయ్యనుకోండి-' అన్నారు—

నగలన్నీ తీసుకుని 'ఇంపాలా'లో కదలి పోయారు—ప్రకాశానికి తనగుండె నెవరో పీక్కు పోతున్నట్టనిపించింది. కళ్ళల్లో నీళ్ళు నిండాయి— ఈ వెయ్యి రూపాయ లతో ఆనగలు కొనగలడా తను?...తనకే యింత బాధగా వున్నప్పుడు సుశీల మాటేవిటి?...

'ఆయనెవరండి?' అనడిగాడు రమన్



# చిన్ని కృష్ణుని..

'నాకు మాత్రం ఏం తెలుసండి! ఎవరికో ప్రెజెంటు ఇవ్వటానికని బంగారు గాజులు కొన్నారు...అయనన్నట్టు దొరిన పోయేననయ్యే మరి!...'

ప్రకాశం ఆతని మాటల్ని పూర్తిగా విశ్వసించలేదు—

అప్పటికే పదకొండు దాటింది—ఆరోజు డ్యూటీలో చేరటం ఎలాగూ వీలుపడదు—కనీసం అప్పారావుగార్ని కలుసుకుని, తను మర్నాడు వచ్చి జాయినవుతానని తెలియజేయాలి—ఇంటర్వ్యూలో తన అవకతవక జవాబులకో [illegible] తనకి ఉద్యోగం వేయించినందుకు ఆయనకు ప్రత్యేకంగా కృతజ్ఞత చెప్పుకోవాలి. ఏదైనా మంచి ఇల్లు దొరుకుతుందేమోనని కూడా ఆయన్నే అడిగి తెలుసుకోవచ్చు. వీలైనంత త్వరలో సుశీలను తీసుకురావాలి.



టీవీ ఎమ్కీ తథునరి సీరస్ (టెలివిజన్ ప్రదర్శనలు)లో కూడా నటిస్తున్న గ్లామర్ తార వికీ మైకేల్. (—నాఫెన్)

* * *

'హాయ్ ప్రకాశం!...భార్యా-రత్నంగారు కులాసా?...'

అప్పారావు ఎదురుగావున్న కుర్చీ చూపించారు.

అతను సుఖాసీనుడు కాగానే కాఫీకి ఆర్డరిచ్చారు.

'కులాసాయేనండి—మిమ్మల్ని ఖరీ మరీ అడిగానని చెప్పమన్నారు'

'నో మాటు మద్రాసు రమ్మనవోయ్—నాకీ ఆఫీసులో వూపిరి పీల్చుకునేందుకు క్కూడా తీరికలేదు. ఆయన రిటైర్డై ఏపనీ లేకుండా వున్నారు కదా!...వోసారి రాకూడదూ?...'

ప్రకాశం వినయంగానవ్వి 'అమాటా నిజమేనండి!' అన్నాడు.

అంటే తనక్కూడా ఇక్కడ తలకు మించిన పని వుంటుందన్న మాట!...పాపం!

సుశీల ప్రతిరోజూ తనకోసం ఎదురుచూసి విసిగి వేసారి పోతుందన్నమాట!...

కాఫీ చ్చింది—వద్దంటూనే తాగాడు.

అప్పారావు ప్రకాశంవునికినే మరచి ఏదో రిజిష్టరు పరీక్షచేస్తూ పదిహేను నిమిషాలు గడిపేశారు.

ప్రకాశానికి ముళ్ల మీదున్నట్టుంది—జాయినవటంగురించి ఆయనేమీ అడగటం లేదే!...ఆశ్చర్యంగా వుంది—కొద్దిగా భయంకూడా వేసింది.

'నీకెవరు ఉద్యోగమిస్తానన్నది?...' అని గదమాయిస్తే?... ఛ...ఛ...అలా ఎన్నడూ జరగదు—కంపెనీ లెటర్ హెడ్మీద సెక్రటరీ సంతకం పెట్టిన అప్పాయింట్మెంట్ ఆర్డరు తన దగ్గరుందిగా!

రిజిష్టరు చూడటం పూర్తయ్యాక 'ఇంకా ప్రైవేట్ విశేషాలు?...మద్రాసు ఏం పనిమీద వచ్చినట్టు?...' అడిగారు.

ప్రకాశానికి గుండె ఆగినట్లైంది. చుట్టూ బాంబులు పేలినట్టు భయంకర ధ్వని—మరుక్షణం తమాయించుకుని ఆర్డరు కాగితం ఆయన ముందుంచాడు.

అప్పారావుగారు ఆ వుత్తరంకేసి అలక్ష్యంగా వోమారు చూశారు—

'దీని వెనకాలే మరో వుత్తరం కూడా పంపించాం— నీకు అందలేదా?' అనడిగారు. ప్రకాశం లేదన్నట్టు తలూపాడు—

'అయామ్ వెరీసారీ ప్రకాశం!...' అంటూ నుదుటిమీద అరచెయ్యి పెట్టుకుని, పదిసార్లు తలకాయ అటూ యిటూ ఆడించి, ఇరవైసార్లు పెదవి చప్పరించారు. పొంగివస్తున్న ఏడుపును దిగమింగుతూ 'అసలు సంగతేమిటండి?' అనడిగాడు— నిజానికి ఆమాటలు అతనికి కూడా సరిగ్గా వినిపించలేదు.

'మరేంలేదు ప్రకాశం!...వోచిన్న పొరపాటు జరిగింది. వెరీ సిల్లీ మిస్టేక్... పాపం!...నీకు చాలా శ్రమ కలిగించాం— ఆశాభంగం కలిగించాం—సారీ—వెరీసారీ—'

ప్రకాశం గుడ్లప్పగించి చూస్తున్నాడు.

'మరేం లేదు...చిన్న పొరపాటు— ఆరోజు మరో ప్రకాశంకూడా ఇంటర్వ్యూకి వచ్చాడు. ఎటొచ్చీ అతని ఇనీషియల్ 'ఎమ్'—మవ్వే నీవా 'వి. ప్రకాశ్' నివి టైపిస్టు ఆర్డరు యు. ప్రకాశానికి పంపటానికి బదులు నీకు పంపించాడు. ఆ సాయంత్రమే జరిగిన పొరపాటు కనుక్కున్నాం. వెంటనే రిగ్రెట్ చేస్తూ నీకు వుత్తరం రాశాం అసలది నీకు అందనే లేదో లేక అందకముందే నువ్వు బయల్దేరావో తెలియదు అయామ్ సారీ!... కంపెనీ తరపున క్షమాపణ వేడుకుంటున్నాను—నువ్వు ధైర్యపడకు—నీ అప్లికేషన్ ఫైల్లో వుంచాం — కాషియర్‌గా కాకపోయినా, క్లార్కుగనైనా అపాయింట్ చేయటానికి ప్రయత్నిస్తాం—'

ప్రకాశం అక్కడ ఒక్కక్షణం కూడా ఆగలేకపోయాడు—

చరచర బయట కొచ్చేశాడు—కనీసం వో గంటైనా గట్టిగా ఏడవాలనిపించింది. మూడో అంతస్తునుండి లిఫ్ట్‌లో కిందకు వస్తుంటే తన జీవితం చీకటిలోకి జారబడుతున్నట్టనిపించింది. అంతా విని సుశీల ఏమనుకుంటుందో?... పాపం!... ఏకాగ్రో హోటలుగది చేరుకున్నాక—మంచంమీద బోర్లా పడుకుని తనివితీర ఏడ్చాడు— ఆ వుద్యోగం దొరకనందుకూడా అతనంతగా బాధపడలేదు — ఇదివరకలా ఎన్నోసార్లు జరిగింది—కాని ఈసారి చేతికందినది నోటికందకుండా పోయింది ... అయినా ఫరవాలేదు. తన అదృష్టంమీద తాత్కాలికంగా నమ్మకం కుదిరినా, అది మంచు తెరని అతనికి లోలోన తెలుసు—కాని ఆ నగలు? తరతరాలుగా కాపాడుతూ వచ్చిన ఆనగలు?...ఎలాంటి కష్టాలు ఎదురు వచ్చినా సర్దుకుపోయారు కాని వాటిని అమ్మలేదు—అపచారం జరిగిపోయింది— అందుకే ఈశిక్ష! ... ఏమిటో తన బాధ స్వంతం—గుడ్డి నమ్మకాలు అన్నీ—అర్థంలేనివి—తాత్పర్యం లేనివి... ఇప్పుడు సుశీలనెలా వూరడించటం? బోడిగా వున్న ఆ విగ్రహాన్ని ఎలా చూడగలడు?...అతనింక ఆలోచించలేక పోయాడు. అలా ఏడ్చి ఏడ్చి నిద్రపోయాడు.

* * *

అంతా విని సుశీల నవ్వేసింది.

'జరిగిందేదో జరిగిపోయింది. అనవసరంగా బాధపడి ఏంలాభం?... మనకూ మంచిరోజులు వస్తాయి. ఆ వెయ్యిరూపా

యులు ఏదైనా బ్యాంకులో వేసిఉంచండి...
లేకపోతే హారతి కర్పూరంలా హరించుకు పోతాయి—' అని హెచ్చరించింది.

నాలుగు నెలలు గడిచాయి

ప్రకాశానికి లీవ్ వేకన్సీలో టైపిస్టుగా ఉద్యోగం కుదిరింది - మూడునెలల దాకా చీకూ—చింతా లేదు—

ఓనాడు సాయంత్రం ఆఫీసునుండి రాగానే సుశీల ఓ ఉత్తరం అందించింది.

'గంగారాం కంపెనీ మనల్ని వదిలేట్టు లేదు. మళ్లీ రమ్మని రాశారు—'

ప్రకాశం ఇనీషియల్స్, స్పెల్లింగ్ అన్నీ ఒకటికి పదిసార్లు సరిచూసి, ఆ ఉత్తరం తనకు వచ్చిందేనని నిర్ధారణ చేసుకున్న పిదప చదివాడు—కంపెనీ మేనేజింగ్ డైరక్టరు గోపాలరావు అతనికో డి. ఓ. రాశాడు. అనవసరంగా అతనికి శ్రమ కలిగించినందుకు కంపెనీ తరపున క్షమాపణ చెప్పుకుంటూ, వీలైనంత త్వరలో తనను ఇంటిదగ్గర, సాయంత్రం అయిదుగంటల తరువాత వచ్చి కలుసుకోమని రాశారు—ప్రకాశానికేం పాలుపోలేదు.
—ఆయన తనకేదో సాయం చేయదల్చుకున్నాడన్న మాట ఖాయం.

'అయినా ఇంటికి రమ్మనట మెందుకు? ...ఏదైనా ఉద్యోగానికైతే తిన్నగా ఆఫీసుకే రమ్మనొచ్చుగా!—'అన్నాడు.

'ఏమోమరి! ... ఏదైనా పిల్లనిచ్చి పెళ్లి చేసుకోమంటారేమో!' అని గలగల నవ్వింది సుశీల—

'ఆ!...అదొక్కటే తక్కువ నాబతుక్కి. ఉత్తరంలో క్షమాపణ చెప్పుకోటంలో తృప్తిపడక ఏరుగా వెలిబుచ్చాలని పిలిపిస్తున్నాడు గామోలు! ... ఇంతకూ వెళ్లమంటావా? ... ఓసారి వెళ్లి నెత్తిన గుడ్డేసుకొచ్చింది చాలదూ?—'

'వెళ్ళిరండి ... నష్టపోయినా ఒక్క రోజులు ఖర్చేగా—డిపాజిట్టు కట్ట నక్కర్లేదు. ఓ అందమైన అమ్మాయి రూపంలో మీకోసం అదృష్టం కాసుక్కూచుకుందేమో మరి!'

'ఏంటా మాటలు? మరీ వెంకిపిల్లవై పోతున్నావు...ఒక్క టంటిస్తాను' అని జడ పట్టుకున్నాడు.

* * *

ప్రకాశం గోపాలరావుగారి బంగాళా

# చిన్నికృష్ణుని...

చేరుకునేసరికి సాయంత్రం అయిదున్నరైంది. కాంపౌండునిండా వున్న రకరకాల పూలమొక్కలు వయ్యారంగా తలలూగిస్తూ స్వాగతం పలికాయి...లోపలెవరో అష్టపదులు శ్రావ్యంగా పాడుతున్నారు. కాంపౌండులో రెండుకార్లు పార్కు చేయబడి వున్నాయి.

కాలింగ్‌బెల్ నొక్కగానే అల్సేషియన్ అతనిమీద కురకబోయి, కిటికీ అడ్డంరాగా, ఆగిపోయింది.

'ఎవరది?...' అంటూ ఓ అమ్మాయి తలుపు తీసింది.

ప్రకాశం ఆమెను చూస్తూ నిలబడిపోయాడు—అలాంటి అందాలరాసిని అతనింతవరకూ చూడలేదు — ఇరవైఏళ్లుంటాయేమో!...

'ఓ అందమైన అమ్మాయి రూపంలో!...' అన్న సుశీల మాటలు జ్ఞప్తికొచ్చి నవ్వుకున్నాడు

'ఎవరు మీరు?...ఏం కావాలి?...అలా బొమ్మలా నిలబడకపోతే మాట్లాడరాదూ?—' అని గద్దించింది.

'నాపేరు ప్రకాశం — గోపాలరావుగార్ని కలుసుకోవాలి...'

'ఆయనింకా ఇంటికి రాలేదు ... ఏదో మీటింగులో వున్నారు—ముందు టెలిఫోన్ చేసి ఆయన ఇంట్లో వున్నదీ లేనిదీ తెలుసుకున్నాక రేపు రండి...'

ప్రకాశం గతుక్కుమన్నాడు. అంటే రేపు సాయంత్రందాకా ఆగాలన్న మాట! ఆ అమ్మాయి ఆయన కూతురైవుంటుంది. ఎంత అలక్ష్యంగా, కొంచెమైనా మర్యాద లేకుండా జవాబిస్తోంది!... ఇంక ఆ తండ్రెలాంటి వాడో!...

'వెంటనే వచ్చి కలుసుకోమని నా కుత్తరం రాశారండి...నేను చాలదూరం నుంచి వస్తున్నా—మళ్లీ రేపటిదాకా ఆగాలంటే...' అని నసిగాడు.

'సరే!...వచ్చి కూర్చోండి...టెలిఫోను చేసి కనుక్కుంటాను—'అంటూ నంబరు డయల్ చేసింది...

ప్రకాశం డ్రాయింగ్ రూంలోవున్న క్యూరియోస్ చూస్తూ కూర్చున్నాడు.

'పదినిమిషాల్లో వచ్చేస్తున్నారు ... మీకాయన్ను ముందే తెలుసా?...'

'తెలియదండి! ...నాలుగు నెలల క్రితం ఆయన కంపెనీలో ఇంటర్వ్యూకొచ్చాను—అదృష్టం లేకపోయింది ... ఏదైనా వుద్యోగం యిప్పిస్తారనుకుంటా.'

ఆ అమ్మాయి చిన్నగా నవ్వి లోపలికి వెళ్లిపోయింది.

మళ్లీ అష్టపదులు వినిపించాయి — వంటాయన గామోలు—అతని ముందు ప్లేటులో కాఫీ వుంచాడు.

'ఆ పాట లెవరండీ పాడుతున్నది?... కమ్మగా వున్నాయి' అన్నాడు ప్రకాశం—అన్న తరువాత తను అధికప్రసంగం చేశాడేమోనని నాలిక్కరచుకున్నాడు. ఒకవేళ గోపాలరావుగారి అమ్మాయే పాడుతోందేమో ...ముక్కూ మొహం తెలియని తను ఆమె గానమాధుర్యాన్ని మెచ్చుకున్నాడంటే ఆమె ఏమనుకుంటుంది?

'అకాయ్ టేప్ రికార్డరు' అని సమాధానమిచ్చాడు వంటాయన.

ప్రకాశం ముఖం చిన్నబుచ్చుకుని కాఫీ కప్పు అందుకున్నాడు.

'హలో!...ప్రకాశం!··· వచ్చావన్న మాట!...వెరీ గుడ్! ...'

ఆ కంఠధ్వని ఎక్కడో విన్నట్టుంది—గోపాలరావుని చూశాక ప్రకాశం శిలాప్రతిమైపోయాడు.

ఆనాడు రమన్‌లాల్ దగ్గరుండి, తన నగలు కొన్నది గోపాలరావై యుంటుందని అతనెన్నడూ వూహించలేదు.

ప్రకాశం లేచి నిలబడి 'నమస్కారమండి!' అన్నాడు.

'కూర్చోవోయ్!...నువ్వు మా ఫామిలీ మెంబరువి... అరె! ... ఉత్తికాఫీ యానికిచ్చింది!...రాధా!...ఏమిటిది? బిస్కట్లు, పళ్లూ, కేక్—అన్నీ యివ్వకుండా ఏమిటీ ట్రీట్‌మెంట్?... వెరిబాడ్!... చదువులో దిట్ట[illegible] మాత్రం [illegible]లేదు. ఇంగితజ్ఞానంవుండాలి...కమాన్! క్విక్!... అన్నీ తెమ్మను' అని ఆర్డరిచ్చారు. ప్రకాశానికి మతిపోయినట్లైంది... ఏమిటి ఈయన ప్రవర్తన?...అల్లుడికైనా ఈ మర్యాద జరగదు.

రాధ స్వయంగా తినుబండారాలు తీసుకొచ్చింది.

'ఐయామ్ సారీ! మిస్టర్ ప్రకాశం!'

అంచి.

వాళ్ల ఆదరాభిమానాలకు ప్రకాశం తబ్బిబ్బులయ్యాడు

'అయ్యా! నేను చాలా చిన్నవాణ్ణి!... మీ సహాయం అర్థించి వచ్చాను ... నాకీ రాచమర్యాద లెందుకండి?' అని విన్న వించుకున్నాడు.

'మరేం ఫరవాలేదు. నువ్వు ఎంత పెద్దవాడివో త్వరలో తెలుసుకుంటావు—మేం నీకు కంపెనీ యిస్తాం... రాధా!... కమాన్!...కూర్చో!' అంటూ సిగార్ ముట్టించాడు.

ప్రకాశం మొహమాట పడుతూ నే ప్లేట్లు ఖాళీ చేయ నారంభించాడు.

'ప్రకాశం! నీ కంతా అయోమయం గానే వుంటుంది...అంతావివరించి చెప్తాను—విను. రమన్‌లాల్ దుకాణంలో కలుసుకున్నప్పుడు నువ్వు మద్రాసు ఎందుకు వచ్చిందీ తెలుసుకోగలిగాను... నువ్వు కాషియర్‌గా జాయినైందీ లేనిదీ నేను కనుక్కో లేదు. నిజానికి నేనప్పుడే అంతా మర్చిపోయాను...ఎందుకంటే ఇవన్నీ మాకు చిన్నవిషయాలు కంపెనీ ఔన్నత్యాన్ని పెంపొందించేందుకు మార్గాలు వెదకటానికి మాకు తీరిక లేదు. ఆ నగలు చూసి మా ఆవిడ చాలా ముచ్చటపడింది. అన్నట్లు అడగటం మర్చిపోయాను ... రాధా!...పార్వతెక్కడ?'

'లేడీస్‌క్లబ్‌లో ఏదో మీటింగుకు వెళ్లింది.'

'ఐసీ...ప్రకాశానికి మరోనాడు పరిచయంచేయవచ్చులే!...ఆ!...ఏవన్నాను?... అవును...పార్వతి అంటే మా ఆవిడ నగలు చూసి సంబరపడింది. ఆ మర్నాడే కృష్ణుడి విగ్రహం చిన్నదొకటి కొన్నాం. నగలు పాలిష్‌చేయించి తొడిగాం... ఆ మహానుభావుడి చల్లని చూపులు వెన్నెలలా ఆశాజ్యోతిలా మా యింటినిండా ప్రసరించాయి. మాకున్న ఒక్క కొరత తీరిపోయింది...ఇదంతా ఆ నగలు మా యింటికి వచ్చిన వేళావిశేషం ... వెంటనే నీ గురించి ఆఫీసులో వాకబు చేశాను. జరిగిన సంగతి తెలిసింది — ఉత్తరం రాశాను. నువ్వు మా యింటికొచ్చావు. మనం మాట్లాడుకుంటున్నాం' అని విరగబడి నవ్వారు సిగరుపొగతో వుక్కిరిబిక్కిరై దగ్గులో దిగింది.

టెలిఫోను గంట మోగింది.

గోపాలరావు మాట్లాడారు.

'లేడీస్‌క్లబ్ మీటింగు కాస్సేపైంది—పార్వతి పదినిమిషాల్లో వచ్చేస్తుంది—ప్రకాశాన్ని ఇవేళే పరిచయం చేయవచ్చు' అన్నారు.

ప్రకాశానికిదంతా మరింత గందరగోళంగా కనిపించింది. తను గోపాలరావుకి చేసిన ఆ మహోపకారమేమిటో అతని కర్థం కాలేదు.

# మనస్సు ప్రధానమా? శరీరం ప్రధానమా?



బుఱ్ఱు వెంకటరమణయ్య — ధర్మపథం

పిపీలికాది బ్రహ్మపర్యంతం ఉన్న యీ సృష్టిలో స్థావరాలూ, జంగమాలూ — సమస్తమూ ఉన్నవి. స్థావరాల్లో పర్వతాలూ, తరు గుల్మలతాదులూ — ఇత్యాదులు చేరి ఉన్నవి. జంగమాల్లో పశుపక్షి మృగాదులూ, కీటకాలూ, సరీసృపాదులూ, సురాసురులూ, మానవులూ మున్నగు సృష్టి చేరతుంది. వీటిలో స్వరూపాన్ని బట్టి కొన్ని చిన్నవీ, కొన్ని అతి సూక్ష్మాలూ, కొన్ని మిక్కిలి పెద్దవి. కాని, అన్నింటిలోనూ ఉన్న జీవం మాత్రం సమానమైనదే!

మానవుల మాదిరిగానే కీటకాదులకున్నూ ముక్తి లభిస్తుంది. ఏదో విధంగా — భగవంతుని సేవించడం వల్ల సాలెపురుగూ, పామూ, ఏనుగూ కైవల్యం పొందినట్లు కాళహస్తి క్షేత్ర కథం ల్లో తెలుస్తున్నది. కాకి, హంస, చిలుక, లేడి, లేగ, ఆవు, పాము తమ పుణ్యాల కర్మల వల్ల ఉత్తమమైన మానవజన్మను పొంది, సుఖాలు అనుభవించి, ఆఖరికి మోక్షాన్ని పొందినట్లు పండరిపుర క్షేత్ర మాహాత్మ్యం వల్ల తెలుస్తున్నది.

పాపాలకు ఫలితంగా నీచమైన పుట్టుకలు పుణ్యాలవల్ల ఉత్తమ జన్మములూ కలుగుతూ ఉంటాయి. ఉత్తమ జన్మల కంటె క్రిమికీటకాదులు తక్కువకాలం బ్రతుకుతాయి. వాటి జీవితం నిత్యమూ అపాయంతో కూడియే ఉంటుంది. ఆ స్వల్ప జీవితకాలంలోనూ అవి బుద్ధిపూర్వకంగా కాకపోయినా మంచి పనులు చేసినట్లయితే ఉత్తమ జన్మను పొందవు.

మోక్షప్రాప్తికి క్రిందిమెట్టు నీచ జన్మమనీ, ఉత్తమ జన్మ పై మెట్టనీ మనవారు చెపుతూ ఉంటారు.

ఎటువంటి జన్మలో అయినాసరే — మనసు భగవదాయత్తమై ఉంటే — చాలును. భగవదాయత్తమైన మనస్సు కలవానికి తన జన్మ నీచమైనదా? ఉత్తమమైనదా? అనే ఆలోచన ఉండదు. మనస్సు ప్రధానంగా తోస్తుంది. శరీరం ముఖ్యమని తోచదు.

అలాంటి ఉత్తమాభిప్రాయం కలవారు అనుకొనేమాట ఇది —

'నరత్వం దేవత్వం<br>
నగవన మృగత్వం మశకతా<br>
పశుత్వం కీటత్వం<br>
భవతు విహగత్వాది జననం<br>
సదా త్వత్పాదాబ్జ<br>
స్మరణ పరమానందలహరి<br>
విహారాసక్తం చేత్<br>
హృదయ మిహ కింతేన వపుషా.'

దీని అభిప్రాయం ఏమిటంటే —

'ఓ భగవంతుడా! నా హృదయం ఎల్లప్పుడూ నీ పాదపద్మ స్మరణవల్ల కలిగే పరమానంద రసప్రవాహంలో విహరించే ఆసక్తి కలిగి ఉన్నట్లయితే చాలును. శరీరం ఏదయితేనేమి? మానవ శరీరం అయితేనేమి? దేవత్వం ఉంటేనేమి? కొండగా ఉండినా ఏమి? అడవిగా ఉంటేనేమి? మృగంగా ఉంటేనేమి? దోమగా ఉంటేనేమి? పశువుగా ఉన్నా, పురుగుగా ఉన్నా బాధ లేదు. ఏ జన్మ యెత్తినా సరే, జన్మ ప్రధానం కాదు; మనస్సే ప్రధానమైనది! ●

## చిన్నికృష్ణుని...

'అసలు సంగతి చెప్పటం మరిచాను. మా ఆఫీసులో నీకు అడిషనల్ కాషియర్‌గా అప్పాయింట్‌మెంట్ ఇస్తున్నాను. కాదనక స్వీకరించమని కోరుతున్నా — నీ భవిష్యత్తు సంగతి నాకు వదిలేయ్. నేను చూసుకుంటాను... ఇదుగో ఆర్డరు' అంటూ బ్రీఫ్‌కేస్‌లోంచి కవరు తీసి అందించారు. 'అలా భయంభయంగా చూడకు. డిపాజిటు కట్టనవసరం లేదు... ప్రకాశం! నీకు నేను చాలా ఋణపడిఉన్నాను. ఈ చిన్నసాయంతో అది తీరిపోతుందనుకోను. నీకు ఎప్పుడు, ఎలాంటి యిబ్బందున్నా, నన్ను నేరుగావచ్చి కలుసుకో — ఎంత మాత్రం ఆలోచించవద్దు...'

'చిత్తం...అంతకరకె నాక్కావలసినదేముంది?...' అని పళ్ళికిలించాడు ప్రకాశం.

'మనక్కూడా మంచిరోజులు వస్తాయి' అన్న సుశీల మాటలు అతనికి పదేపదే వినిపించాయి. ఆమెకున్న ఆత్మవిశ్వాసం భవిష్యత్తును ఆమె చిత్రించుకున్నతీరు. అన్నీ భూమికి ఎంతో యెత్తున ఎవరికీ అందకుండా ఉన్నతంగా కనిపించాయి.

'రావోయ్! ... మా చిన్నికృష్ణుణ్ణి చూద్దువు కాని—?' అని పూజామందిరం వైపు దారితీశాడు.

ప్రకాశం కళ్ళు నీళ్లతో నిండాయి, సాష్టాంగపడి నమస్కరించాడు.

'ప్రభూ!...అంతా నీదయ!...నీచల్లని చూపు మాకు జీవనాధారం' అనుకున్నాడు.

'అయ్యా!... మీరునన్నింతగా ఆదరించారు — చాలాకృతజ్ఞుణ్ణి కాని నేను తమ కేవిధంగా సాయపడ్డానో అర్థంకావటంలేదు'

రాధ ఫక్కున నవ్వింది.

'బావగారూ!...మీరు పెద్ద మేనేజింగు డైరక్టరు కావచ్చు కాని, స్పష్టంగా ఏ సంగతీ వివరించ లేరు — ప్రకాశం గారూ!..అక్క పెళ్ళై పదిహేనేళ్ళైంది. కాని కడుపు పండలేదు. మీ రిచ్చిన నగలు ధరించి చిన్నికృష్ణుడు మమ్మల్ని చల్లగా చూశాడు — అక్కయ్య త్వరలో తల్లి కాబోతోంది...' అంది రాధ —

బయట హారన్ మోగింది —

'పార్వతి వచ్చేసింది' అంటూ బయటకు వచ్చారు గోపాలరావు. ●




'ఒకవిధంగా వ్యాపారమే అనుకోండి. మీ వసంతకు పరీక్షలైన తర్వాత పెళ్ళి చేసెయ్యండి. ఇవిగో మీ అమ్మాయికి వచ్చిన మూడు ప్రేమలేఖలు! అయితే ఇటువంటి వ్యవహారాల్లో తలదూర్చకుండానే, మీ చేతులమీదుగా సలక్షణంగా పెళ్ళిచేసుకోవాలని ఉందని మీ అమ్మాయి చెప్తుందండి. కొంచెం భయంగా ఉన్నా, వసంతమాట కాదనలేక మీతో చొరవ తీసుకొని చెప్పినందుకు మన్నించండి.' అప్పజెప్పినట్లుగా శారద అన్న మాటలకి విస్తుపోయింది వసంత తల్లి.

'ఏం చోద్యమే—నాకు పెళ్ళిచెయ్యండి అని నోరువిప్పి అడగడం! మాకాలంలో ఎరుగుదుమా యిటువంటి వింత?' తేలికగా అన్నా, ఆమాటల వెనకాల ఏదో రకమైన నిస్పృహాయుత, కడుపు తరుక్కుపోసే వో తల్లివేదనా—శారద గ్రహించక పోలేదు. గడుసుగా అంది సమాధానంగా—

'మీకయితే ముచ్చటగా మూడుముళ్ళూ పదమూడో ఏటనే పడినందుకు అడగవలసిన అవసరం లేకపోయింది కాని మీవసంతకిప్పుడు ఇరవైఏళ్ళు.' వసంతతల్లి తిరిగి ఏమంటుందో కూడా వినకుండా శారద వీధిగదిలో కూర్చున్న వసంత దగ్గరకు పరుగెత్తింది.

'...ఇదండీ సంగతి!' మొగుడిచేతిలో మూడు ఉత్తరాలూ పెట్టి, తన బాధ్యత తీరిపోయినట్లు వంటయింట్లోకి దారి తీసింది, వసంత తల్లి.

నూటికి నెలకి ఆరు రూపాయల చొప్పున వెయ్యికి ఏడాదికి ఎంత వడ్డీ అవుతుంది?...అని ఉత్సాహంగా కుర్రాళ్ళకి లెక్కలు చెప్పే రామనాధం మాస్టారు ఒక్కసారిగా డీలా పడిపోయాడు. 'పెద్దకూతురికి మూడు ప్రేమలేఖలు! దానికి పెళ్ళిచెయ్యాలి—ఎంత కట్నం—ఎంత అప్పు—ఎంత వడ్డీ? ఉన్నది ఒక ఎకరం పొలం, పాతకొంప. కన్నది నలుగురు సంతానం!'

మాష్టారికి వసంత [illegible]ంటుంది—మూడు ప్రేమ లేఖలు ఊరికినే రాలేదు మరి చక్కదనానికేమీ తక్కువ లేదు—బి. ఏ. ఆఖరి సంవత్సరం చదువుతోంది కళ్ళా కపటం లేని మనిషి—అందుకనే బలహీనతలకి లొంగి కాలు జారుతుందేమోనన్న భయంకొద్దీ పెళ్ళి చేసెయ్యమని అడిగింది. అన్నీ బాగున్నాయి కాని, వరుళ్ళు మట్టుకు రామనాధాని కందుబాటులో లేరు.

ప్రేమ వివాహాల్లో కట్నాల సమస్య ఉండరాదే?—రామనాధం మస్తిష్కంలో వో చిన్నమెరుపు మెరిసింది.

—'మాడబ్బాయీ, రాజశేఖరం! నువ్వు మా వసంతకి వ్రాసిన ఉత్తరం చూశాను...' రామనాధం ఆగాడు. 'అబ్బెబ్బె అది...' రాజశేఖరం కంగారుపడి పోయాడు. అతని భుజంమీద చెయ్యివేస్తూ

# మూడుముళ్ళు

రామనాథం అన్నాడు. 'నువ్వు కంగారు పడ నవసరంలేదు. నీ ప్రేమను అడ్డ దలచుకోలేదు. నా వసంత నిచ్చి పెళ్ళి చేస్తాను—ఏమంటావు?'

రాజశేఖరం తెల్లమొహం వేశాడు. 'వర్ణాంతర వివాహమంటే మా వాళ్ళు డొక్క చీలుస్తారు!' అతి కష్టంమీద అన గలిగాడు.

రామనాథానికి కోపమొచ్చింది. తీవ్రంగా అడిగాడు. 'మరి మా వసంతకు ఉత్తరం వ్రాసిన దెందుకని?'

'ప్రేమ...కాదు కాదు సరదా...కాదు...' రాజశేఖరానికి మరి మాటలు రాలేదు. సైకిలు మీదకు ఒక్క గెంతు గెంతి ఉడా యించాడు.—

—'ఏమోయ్, చక్రవర్తీ! మా వసంతకు నిన్ను పెళ్ళిచేసుకోడానికి ఏమీ అభ్యంత రంలేదు. మీవంశం, పుట్టు పూర్వోత్త రాలూ నాకు నచ్చాయి కాబట్టి నాకూ అభ్యంతరం లేదు. నీ తల్లిదండ్రులతో మాట్లాడమంటావా మరి?' డొంక తిరుగుడులేకుండా సూటిగా రామనాథం అడిగిన ప్రశ్నకి, చక్రవర్తి తడబడి పోయాడు.

'ఇప్పుడు పెళ్ళి మాట ఎత్తితే నా మక్కెలు విరుగుతాయి!' చక్రవర్తి మూలుగు తున్నట్లుగా అన్నాడు.

'అంత ధైర్యం లేనివాడివి ఉత్తరాలు వ్రాయడ మెందుకనో?' రామనాథం హేళ నగా అన్నాడు.

'మీదగ్గర దాపరిక మెందుకు? స్నేహితులతో పందెం వచ్చి ఉత్తరం వ్రాశాను. దయచేసి మావాళ్ళతో చెప్ప కండి!' చక్రవర్తి చేతులెత్తి నమ స్కారం పడేసి రామనాథం తేరుకొనే లోగా అక్కణ్ణించి జారుకొన్నాడు—

'—మా వసంతకు వ్రాసిన ఉత్తరం చదివి నీవేదన అర్థం చేసుకొన్నానోయ్, కృష్ణమూర్తీ! ఏదో పాతకాలపు వాడి నైనా, ఆధునిక సాహిత్యపు ప్రభావం అనుకో—ఇప్పుడొస్తున్న సినిమాల ప్రభావం అనుకో—మీయువతరం ప్రేమలమీద నాకు చాలా అభిమాన మేర్పడింది. నిన్ను మా అల్లుడిగా చేసుకోడం మాకేమీ అభ్యం తరం లేదు. ఏమంటావు?' క్లాసులో కుర్రాడికి సూత్రంచెప్పి, లెక్క అడిగినట్లు గానే అడిగాడు రామనాథం.

'నాకు మేనమామకూతురు సిద్ధంగా కూర్చుంది. ఈపెళ్ళికి మావాళ్ళు ఒప్పు కోరు. క్షమించండి!' కృష్ణమూర్తి దిక్కులు చూస్తూ సమాధానం చెప్పాడు.

'మరి ప్రేమలేఖ ఎవర్ని ఉద్దేశించి వ్రాసినట్లు?' రామనాథం అడిగాడు, రాబోయే ఏడుపును ఆపుకొంటూ.

'ఏదో ఉద్రేకంలో వ్రాశాను క్షమిం చండి!' వెనక్కి తిరిగి చూడకుండా పరుగుచ్చుకొన్నాడు కృష్ణమూర్తి.—

బొమ్మలాంటి తన వసంతను నిజంగా ఆటబొమ్మనుచేసి ఆడుకొన్నారు! రామ నాథానికి కోపం ముంచెత్తుకొచ్చింది.

'...జరిగిన సంగతి యిదండీ! ఆడ పిల్లల జీవితాలతో ఇలా చెలగాటాలాడడం ఏమంత సబబైన పని?' రామనాథం చెప్పిన సంగతులన్నీ శ్రద్ధగా ఆలకించాడు ప్రిన్సిపాల్ శేషగిరి.

'నానాటికి విద్యార్థి లోకంలో క్రమ శిక్షణ దిగజారి పోతోంది. ఏ రోజు ఏం గొడవ వస్తుందేమోనని భయపడని క్షణం లేదు. అయినా ఆ మూడు ఉత్తరాలూ నా దగ్గర వదిలివెళ్ళండి. నే చెయ్యగలి గింది చేస్తాను' శేషగిరి సానుభూతి చూపిస్తూ, రామనాథాన్ని సాగనంపాడు.

ముగ్గురు కొడుకులూ, ముగ్గురు తండ్రులూ ప్రిన్సిపాల్ బల్ల చుట్టూ కూర్చున్నారు. శేషగిరి కళ్ళు నిప్పులు వెదజల్లుతున్నాయి. '...ఎవరూ మాట్లాడ రేమండీ? ఆ అమ్మాయి నిలా ఆటవస్తు వులా ఆడించడం ఎంత నీచమైన పనో ఆలోచించండి. మీ ప్రబుద్ధులు వ్రాసిన ఉత్తరాల్ని నమ్మి, నిజంగా వివాహం చేసు

ఈ బొమ్మలోని మొత్తం త్రిభుజాలు ఎన్ని?



(జవాబు 64వ పేజీచూడండి)

కొనే ఉద్దేశ్యం ఉందేమోనని పాపం ఆ మాస్టారు ఆభిజాత్యాన్ని చంపుకొని, మనసువిప్పి తన అంగీకారం తెలియచేసినందుకు—ఆయనకు మంచి సమాధానాలే లభించాయి! యిప్పటికయినా మించింది లేదు మీలో ఎవరు వసంతని స్వీకరించినా చాలా సంతోషించదగ్గ విషయం.' శేషగిరి ఆగి, అందరివైపూ ప్రశ్నార్థకంగా చూశాడు.

'మా వాళ్ళమీద మాకూ ఎన్నో ఆశలుంటాయి. కట్నాలనీ—కలిసిన సంబంధాలనీ. అయినా కుర్రాళ్ళు తెలియక చేసిన పనికి మమ్మల్నిలా బలవంత పెట్టడం మీకు భావ్యంకాదు!' వో హీరో తండ్రి కాస్త గట్టిగానే సమాధానమిచ్చాడు.

'అయితే మీ వాళ్ళు తెలియక చేసిన పనికి తగిన చర్యే తీసుకొంటాను. మీరందరూ వెళ్ళవచ్చు.'

'ప్రిన్సిపాల్‌గారూ, అది మీరు అనుకొన్నంత సులభం కాదేమో?' చక్రవర్తి కొంచెం తలబిరుసుగానే అన్నాడు.

'ఈ విషయంలో నేను జంకేది లేదు. మీరు ముగ్గురూ వ్రాసిన ప్రేమలేఖలు—దస్తూరీ సంతకాలతో సహా రుజావు కాబడ్డాయి. వాటికి ఫోటోకాపీలు తీయించి అన్ని నోటీసు బోర్డుల్లోనూ ప్రదర్శిస్తాను. ప్రేమలేఖలు వ్రాయడమే కాని, వివాహ సమస్య తల ఎత్తేసరికి జారుకొనే చవటలనీ, అప్రయోజకులనీ అందరకూ తెలియచేస్తాను. తోటి విద్యార్థినిని ఆడించి అవమానించినందుకు సస్పెండ్ చేస్తాను. రేపు ఉదయం కాలేజీలో ఉన్న పన్నెండువందల మందికీ మీ హీరోలపస తెలియచేస్తే, సాయంత్రమయ్యేసరికి ఈ ఊరి అరవైవేల జనాభా మీ గురించే మాట్లాడుకొంటుంది. విద్యార్థిలోకం సానుభూతి వసంతవైపో, లేక మీవైపో—చూడాలని నాకు చాలా సరదాగా ఉంది! మీరింక వెళ్ళవచ్చు' శేషగిరి ఉగ్రస్వరూపం చూసి ఆ ఆరుగురూ బిక్కమొహాలతో అక్కణ్ణించి చల్లగా జారుకొన్నారు. బయటకు వెళ్ళినతర్వాత నోరుజారిన చక్రవర్తిమీద విరుచుకు పడ్డారందరూ.

ఆ రాత్రి ఏడూ—పదిగంటల మధ్య ముగ్గురు తండ్రులూ ఒకరితర్వాత ఒకరూ, ఒకరికి తెలియకుండా మరొకరూ శేషగిరి యింటిమెట్లు ఎక్కిదిగారు.

మర్నాడుదయం రామనాథానికి నాలుగు ఉత్తరాలందాయి. 'అజ్ఞానంకొద్దీ వాళ్ళు చేసిన పనికి తీవ్రమైన దండన విధించి, వాళ్ళ భవిష్యత్తుని పాడుచెయ్యడానికి నేను జంకినమాట వాస్తవం. ముగ్గురు తండ్రులూ యిచ్చిన లిఖితపూర్వకమైన క్షమార్పణలు యిందుమూలముగా అందచేస్తున్నాను...' రామనాథం చిన్నగా నవ్వుకొన్నాడు ప్రిన్సిపాల్ ఉత్తరానికి.

'చూడమ్మా వసంతా! ఇంకొక రెండు నెలల్లో నీ చదువు పూర్తవుతుంది. ఏదో ఉద్యోగంలో ప్రవేశించు. మనదేశం పూర్తిగా గొడ్డుపోలేదు. నీకు వచ్చిన వాడూ, అభ్యుదయభావాలు కలవాడూ నీ అన్వేషణలో లభించకపోడు. ఆ శుభఘడియలకోసం దైవాన్ని ప్రార్థించడం తప్ప నేను చెయ్యగలిగింది మరేమి లేదు.' రామనాథం వసంత కివ్వగలిగింది ఈ సలహా మాత్రమే.

మరోనెలకల్లా శేషగిరి కూతురిపెళ్ళి శుభలేఖ రామనాథానికి అందింది. ఏదో ఫిర్యాదురూపేణా వో సారి ప్రిన్సిపాల్‌ని కలుసుకొన్నంత మాత్రాన — జ్ఞాపకం ఉంచుకొని శుభలేఖ పంపినందుకు రామనాథం ఆశ్చర్యపోయాడు.

అయితే — వసంత కొచ్చిన మూడు ఉత్తరాలూ, తనకూతురుమెళ్ళో పడే మూడుముళ్ళకీ ఒప్పుకొన్నకట్నం పదివేలలో, వో ఆరువేల రూపాయలు సంపాదించి పెట్టాయన్న కృతజ్ఞతని తెల్పుకోడంకోసం, ప్రిన్సిపాల్ శుభలేఖ పంపాడని లెక్కల మేష్టారికి ఏం తెలుసు?! ●

---

కూరలూ గుణాలూ!

# కోడిగుడ్లు

పెద్దవి క్రొద్ది దినాలక్రిందట పెట్టినవి మంచివి ఇవి పైత్యాన్ని అణుస్తాయి. వీర్యపుష్టిని, దేహపుష్టిని చేకూరుస్తాయి. రక్తాన్ని వృద్ధి పొందిస్తాయి ఈ గ్రుడ్లలోని తెల్లసొన దలవేసి నీరుపెట్టును పచ్చసొన సమ శీతోష్ణన్ని కలుగ జేస్తుంది హృదయానికి, మెదడుకు బలాన్ని యిస్తాయి. పుంస్త్వమును కలుగజేస్తాయి. అల్లపురసంతోను, నీరుల్లిపాయలతోను వండి తినడం శ్రేష్ఠం!... నిరియపుపొడి జల్లుకొని తినడం కూడా శ్రేష్ఠమయినదే!

శరీరం నుండి రక్తం తీయడం, గాయాలు వలన రక్తం నష్టమవడం, రక్తస్రావం మొదలగు వాని వలన కలిగిన రక్తహీనత గలవారికి, కాయలాపడి లేచిన వారికి, నీరసంగా వున్న వాళ్ళకి యిచ్చిన రక్తపుష్టిని, బలాన్ని చేకూరుస్తాయి

ప్రేగులను, రొమ్మును, మూత్రపు సంచిని శుభ్ర పరుస్తాయి. కిడ్నీస్‌లోను, మూత్రపు సంచిలోను పుళ్ళే వ్రణాలను తగ్గించడానికి దోహద మిస్తాయి. మూత్రపు సంచిలోని కంతులను, సుద్దను తొలగించడానికి తోడ్పడతాయి.

విష పురుగులు ఏవైనా కుట్టినచో—కుట్టిన చోట కోడిగ్రుడ్డులోని చందమామ బాగాన్ని పెట్టి— మరో కోడిగ్రుడ్డులోని చందమామ బాగాన్ని ఆ వ్యక్తిచే తినిపించినచో విషం చాలావరకూ విరిగిపోతుంది. నందమామను శిరంసాంబ్రాణితో యిచ్చిన పురాణపు ఒగర్పుగల దగ్గు తగ్గుతుంది.

ప్రతిదినం అమితంగా కోడిగ్రుడ్లు తిన్నట్లయితే కిడ్నీస్‌లో రాళ్ళు పుడతాయి. శరీర కాంతి చెడిపోయి తెల్లని సోభి మచ్చలు పుడతాయి సామాన్యంగా కోడిగ్రుడ్డు వాతాన్ని, శ్లేష్మన్ని చేస్తుంది. ప్రేవులలో వాతాన్ని పుట్టిస్తుంది. కఫాన్ని పెంచుతుంది. కడుపులో నీరు ఎక్కువగా వుండేవారికి జబ్బు చేస్తుంది

దీని దుర్గుణాలకు విరుగుళ్ళు:—1. మిరియాలు. 2. దాల్చిన చెక్క, 3. ఉష్ణ శరీరులకు పుల్లని పదార్థాలు 4 వాతశరీరులకు కలకండ 5 సిరిగా, 6. వేడి గాజు ధనులు.

— సేకరణ ఆకుండి నారాయణమూర్తి

# మల్లెలు ఎర్రగులాబీలు

యర్రం చంద్రశేఖరం

## జరిగిన కథ

లక్ష్మయ్యగారొక మోతుబరి రైతు. శాంత ఆయనకి ఏకైక కుమార్తె. తల్లిదండ్రులు లేని మేనల్లుడు రామాన్ని చిన్నప్పటినుండి తనే పెంచి పెద్ద చేస్తాడు. లక్ష్మయ్య గారికి గుండె జబ్బు వస్తుంది. ఆయనకు శ్రమ యివ్వకుండా వుండటానికి రామం చదువు హెచ్. ఎస్. సి. తో ఆపేసి వ్యవసాయపు పనులు చూసుకుంటాడు. అతను పంచాయతీబోర్డు ప్రెసిడెంటుగా వుంటాడు. శాంతను కాలేజి చదువుకు పంపిస్తారు. కాలేజిలో ఆమెకి శారద అనే బీదవిద్యార్థిని స్నేహితురాలవుతుంది. శారద విషాదగాథ శాంతను కదిలించి వేస్తుంది. శాంత బలవంతం మీద శారద కూడా ఎక్స్‌కర్షన్‌కు బయలుదేరుతుంది. ప్రభాకరానికి నీరజకు పెళ్ళి చెయ్యాలని అందరి సంకల్పం.

## 5

శాంత, శారదలు యిద్దరూ లక్ష్మయ్యగారి తోటలో షికార్లు చేస్తున్నారు. మామిళ్ళు కాయలతో నిండుగా ఉన్నాయి. ఇద్దరూ తోటకు వచ్చి తిన గలిగినన్ని తీపి మామిడికాయలు తిని హాయిగా చల్లగాలికి తిరుగుతున్నారు.

శాంత శారదలిద్దరూ ఊరు చేరేసరికి పదకొండైంది. రాగానే భోజనాలు చేసి విశ్రాంతిగా పడుకున్నారు. నిద్ర లేచేసరికి సాయంత్రం నాలుగైంది. పార్వతమ్మ వీరిద్దరినీ ఫలహారానికి పిలిచింది. ముఖాలు కడుక్కొని ఫలహారాలు చేసేసరికి ఐదైంది. రామం ఏదో అర్జంటుపని ఉండి పొరుగూరు వెళ్ళాడు. శాంతకు రాగానే రామం కనపడక పోవడంలో ఆశాభంగం కలిగింది. అయినా తను వస్తున్నట్లు ముందుగా తెలియజేయక పోవడం తన తప్పే కాబట్టి ఊరుకుంది. ఇంట్లో పొద్దుపోవడం లేదని తోటకు బయలుదేరారు. ఎండాకాలం కావడంవల్ల సాయంత్రం ఐదైనా ఎండ చురుకు తగ్గలేదు.

తోటంతా శారదకు చూపిన తర్వాత యిద్దరూ పంప్‌సెట్ వద్దకు వచ్చారు. లక్ష్మయ్యగారి పెద్దపాలేరు పుల్లయ్య ఆ తోటలోనే కాపురం ఉంటాడు. అతను ఉండడానికి అక్కడ ఒకపాక ఉంది. వీరిద్దరూ అటురావడం గమనించి పాకలోనుండి మంచం తీసుకువచ్చి వేశాడు. రామం పాలేరు పుల్లయ్యను 'మామా' అంటాడు కాబట్టి శాంత అతనిని బాబాయి అని పిలుస్తుంది. ఫైవ్‌హార్సు పవరు మోటారునుండి మూడంగుళాల పైపు ద్వారా నీరు వేగంగా చిమ్ముతూ ఎదురుగా ఉన్న నీటితొట్టెలో పడి అక్కడినుండి కాలవద్వారా ప్రవహిస్తూ ఉంది. ఆ నీటికి తన చేతిని అడ్డంపెడుతూ ఆ నీటి వేగాన్ని పరీక్షచేస్తూ ఉంది శారద. శాంత పాలేరువేసిన మంచంమీద కూర్చొని ఏదో ఆలోచనలో పడింది. మెల్లిగా శారద నీరు పారుతూన్న ఆ కాలవ వెంబడే నడుస్తూ ఆ నీరు ఏ, ఏ, మొక్కలను తడుపుతూ ఉందో చూడాలని ఆ కాలవ చివరివరకూ దూరంగా వెళ్ళిపోయింది. తోటకు ఆనుకొనిఉన్న రెండెకరాల స్థలంలో అన్నిరకాల కూరగాయమొక్కలు ఉన్నాయి. కొన్ని పూతమీద, మరికొన్ని కాయలతో, వేరే కొన్ని చిన్నచిన్న మొక్కలుగా ఉన్నాయి. ఆ విధంగా సాగు చేయిస్తున్న రామం తెలివితేటలకు ఆశ్చర్య పోయింది శారద. తయారుగాఉన్న కాయలు కోసి అమ్మేసరికి పూతమీద ఉన్న చెట్లు కాపునిస్తాయి. పూతమీదఉన్న చెట్లు కాపు ఉడిగిపోయే సరికి చిన్న చిన్న మొక్కలు కాపు నందుకుంటాయి. ఆ విధంగా పంట క్రమం తప్పకుండా చేతికి వస్తుంది. ఈ తోటను చూసిన శారదకు ప్రభాకరం గుర్తుకు వచ్చాడు. ఇక్కడ ఒక వ్యక్తి ఉత్పత్తి చేయడంలో తన శక్తిని యుక్తిని ప్రదర్శిస్తూ ఉంటే అక్కడ అతనుచేసే అరాచకపు పనులు స్ఫురణకు వచ్చాయి. విద్యార్థులు స్ట్రైక్ చేసినప్పుడు ప్రభాకరం ముఠా నాయకుడై గుర్తించకుండా వరుసగా ఎన్ని వీధిదీపాలను పగులగొట్టేవాడో, తనను గురించి తను చాలా విర్రవీగుతూ చెప్పుకోవడం గుర్తుకువచ్చి చిరునవ్వు నవ్వుకుంది శారద. సృష్టిలో ఒకప్రక్క చెడును ప్రోత్సహించేవారు, మరొకప్రక్క మంచికి దోహదం చేసేవాళ్లు. ఆ రెండు తెగల వారు ఉండడంవల్లనే మంచి—చెడు అనే పదాలకు అర్థం తెలుస్తుంది. ఈవిధంగా ఆలోచిస్తూ శారద మళ్లీ శాంత కూర్చున్న వైపు నడక ప్రారంభించింది. మునిమాపువేళ ఎండ మామిడికొమ్మల సందులలోనుండి చీలికలై తోటలోపలికి చొచ్చుకొని వస్తూ ఉంది. చల్లనిగాలి ప్రారంభమైంది. ఆ తోటలో ఆ సాయం సమయంలో శారద ఊహలు ఏవేవో లోకాలలో విహరించ సాగాయి. ఆ విధంగా పరధ్యానంతో నడుస్తూన్న శారదకు ఎవరిదో క్రొత్త కంఠం వినిపించసాగింది. అక్కడే నిలుచుండి పోయింది శారద. ఆమెనిల్చున్న చోటికి మాటలు స్పష్టంగా వినిపిస్తున్నాయి. అలాగే అక్కడఉన్న మామిడి చెట్టు మొదట్లో కూర్చొని ఆ మాటలు వినసాగింది...

'పుల్లయ్య మామా ...! పుల్లయ్య మామా ...!' ఎవరూ పలకలేదు. 'ఎక్కడికి వెళ్ళాడబ్బా! మోటరు ఆన్‌చేసి ఉంది.' అని అంటూ శాంత కూర్చున్న మంచం ముందుకు వచ్చాడు. ఆ వచ్చినది ఎవరో ఊహించుకుంది శారద. అక్కడికి వెళ్ళడం బాగుండదని గ్రహించి తను కూర్చున్న చోటునుండే గమనించసాగింది. మాటలు వినిపిస్తాయి. జరిగేది కనుపిస్తుంది. కాని వారికిమాత్రం తను కనుపించదు.

శాంతను మంచంమీద చూసిన రామం ఆశ్చర్యపోయాడు. అతని ముఖంలో క్రొత్త వెలుగు వచ్చింది.

'హాఁ! నీవా శాంతా ...? ఎప్పుడొచ్చావ్ ... సిగ్నల్‌లేని ప్యాసింజరులాగా! ఇంటికి వెళ్ళానా? రావడం రావడం ఈ తోటలోకే వచ్చావా? నీవు వచ్చినట్లు నా కెవ్వరూ చెప్పనేలేదే ...? ఇంతకూ ఉత్తరం వ్రాయకుండానే వచ్చావేం? ఉత్తర హిందూస్థాన్ ప్రాంతాలకు ఎక్స్‌కర్షన్‌కు వెడుతున్నట్లు వ్రాశావు. అన్నీ సక్రమంగా చూశావా? జీవితంలో మళ్ళీ యిటువంటి అవకాశం లభించదు. ఆ ప్రాంతాలన్నీ తిరిగి వచ్చావు కద! నా కోసం ఏం తెచ్చావ్? శాంతా ...! అయామ్ సారీ...! నాకేమీ అక్కరలేదు; నీవు తిరిగొచ్చావ్...! అంతే చాలు అదినరే...! ఒక్కదానివీ ఈ తోటలో యిలా ఒంటరిగా కూర్చున్నావేం...?' గబగబ ప్రశ్నల వర్షం కురిపించాడు రామం.

'నీవు వస్తావని నిరీక్షిస్తూ...!' అని రామాన్ని ప్రేమగా చూస్తూ 'బావా...! అన్నిప్రశ్నలూ అయినట్లేనా? ఇంకేమైనా ఉన్నాయా? ఒక్కసారే అడుగు. వాటన్నింటికి సమాధానాలు ఆలోచించి నే వెళ్ళేలోగా చెబుతాను. ఏం...?' అని కొంటెగా రామాన్ని చూస్తూ అంది శాంత.

'బస్సునుండి దిగిన చిలుక పలుకులు బాగా పలుకుతూ ఉందే...!' అని చిరునవ్వుతో శాంత ముఖంలోకి చూస్తూ 'అది సరేగాని పరీక్షలు బాగా వ్రాశావా?' ముఖంలో గంభీరతను వింపుకుంటూ అన్నాడు.

'బాగావే వ్రాశానుబావా...తప్పకుండా ప్యాసౌతాను. ఎంతైనా నీ సలహాలు ఊరికే



పోతాయా...?'

'ఏమిటబ్బా! నా సలహాలు...?'

'నన్ను పై చదువులకు పంపేటప్పుడు నీవిచ్చిన......వాటిని నేనేమాత్రం మరచి పోలేదు జాగ్రత్తగా చదువుకుంటున్నాను కాని బావా...ఒక్కటే సందేహం! నాన్న అదో తరహా మనిషి. ఏ నిముషంలోనైనా చదువు ఆపు చేయమంటాడేమోనని నాకు భయంగా ఉంది.'

'ఏం...? రాగానే చురకతగిలించాడా..?'

'తగిలించలేదు కాని వాలకం చూస్తే అలాగే ఉంది. మధ్యలో ఆపుచేయిస్తే ఎలాగేం?' బుంగమూతి పెట్టి గారాబం చేసింది శాంత.

'పిచ్చిదే...! మామయ్య చదువు మానెయ్యమంటే మానెయ్యి.' చిలిపిగా శాంత కళ్లలోకి చూస్తూ అన్నాడు రామం.

'పో బావా...! ఇలా అంటే నీతో నేసలు మాట్లాడను.' మూతి బిగించి అలుక ప్రారంభించింది.

రామం చిరునవ్వు నవ్వుతూ 'దేవిగారు అలుక ప్రారంభించి నట్టున్నారే...!' అని తనవైపుకు త్రిప్పుకో బోయాడు. ఏమాత్రం లొంగిరాలేదు శాంత

'శాంతా నీ ఈ అలుక చూస్తూ ఉంటే చిన్నప్పుడు నీ పిప్పరమెంటు బిళ్లలను తిని నా దగ్గర ఉన్న బిళ్లలకోసం అలగడం గుర్తుకు వస్తూ ఉంది. అప్పుడు నేనేం చేసేవాడివో గుర్తుందా? సగం కొరికి మిగతా సగం నీకిచ్చేవాణ్ణి 'ఛీ...ఎంగిలి' అని అసహ్యించుకునే దానవు. అప్పుడు పుల్లయ్య మామ మా ఇద్దరి తగువూ తీర్చే వాడు. 'అమ్మాయిగారూ! మీరు అబ్బాయి గారి ఎంగిలి తినాల్సిందే! ఆరు మీకు కాబోయే భర్తగారు కదుండీ!' అని సంతోషపడుతూ చెప్పేవాడు. నీవేమో నసేమిరా అని బిగతీసుకుపోయేదానివి అప్పుడు నేను కాకి ఎంగిలి అంటూ చొక్కా అడ్డుపెట్టుకొని కొరికి యిచ్చే వాణ్ణి. అవన్నీ గుర్తున్నాయా...?' శాంతను బలవంతంగా తన ముందుకు త్రిప్పుకుంటూ అన్నాడు రామం.

'నవ్వించాలని ఈ కబుర్లన్నీ చెబుతున్నావ్! నాకు తెలుసులే! నేనేం నవ్వను.' అని అంటూనే నవ్వాపుకోలేక ఫక్కున నవ్వింది శాంత.

'శాంతా...నేను కోరేదల్లా నీవెప్పుడూ అలా నవ్వుతూ సంతోషంగా ఉండాలనే...! నీ సంతోషంకోసం నీ సుఖంకోసం నేనేమై పోయినా ఫర్వాలేదు.' అతనిమాటలలో గాంభీర్యం ప్రస్ఫుటమైంది శాంతకు.

'బావా...! నీవు నా సంతోషాన్ని కోరే వాడవని నాకు తెలుసు. కాని నాన్న మొండి పట్టుపడితే ఏం చేస్తావ్...?'

'ఆ విషయం అప్పుడు తెలుస్తుంది. యిప్పుడెందుకు? అదిసరే ఎన్నడూ లేనిది ఈరోజు ఒంటరిగా తోటకు వచ్చావేం?'

'ఒంటరిగా రాలేదు. స్నేహితురాలితో వచ్చాను.' అని నలువైపులా చూస్తూ 'శారదా...! శారూ...! ఎక్కడికెళ్లావే?' అని పిలిచింది.

'ఇక్కడే ఉన్నాను.' అని లేచి వాళ్లున్న వైపు వచ్చింది శారద. అప్పుడే చీకటి నలువైపులనుండి ఆవరిస్తూ ఉంది. అది తోట కాబట్టి బయలు ప్రదేశం కన్న అక్కడ త్వరగా చీకటి పడుతుంది. రామం లేచి లైటువేశాడు. దగ్గరగా వచ్చిన శారదను రామానికి పరిచయం చేసింది శాంత. ఇద్దరూ పరస్పరం నమస్కారాలు చేసుకున్నారు.

'మీరేం చదువుతున్నారండీ?' ప్రశ్నించాడు రామం శారదను చూస్తూ.

'నేను, శాంత క్లాసుమేట్సు' సిగ్గుపడుతూ అంది శారద.

'అలాగా...మీది హైద్రాబాదేనా? మీ నాన్నగారేం చేస్తుంటారు?'

ఆ ప్రశ్నలో కళకళ లాడుతూన్న ఆమె ముఖం అమవసనిశిలా మారిపోయింది. కారణం తెలియక తికమకపడ్డాడు రామం.

'నేనేమైనా పొరపాటుగా మాట్లాడానా శాంతా...?' ఆయోమయంగా శాంతను చూస్తూ ప్రశ్నించాడు రామం.

'ఏదుంది బావా...అటువంటి దేమీలేదు.' అని క్లుప్తంగా శారద విషయాలన్నీ చెప్పింది. తామిద్దరూ ఒకరిని విడిచి మరొకరు ఉండలేని స్నేహబంధంలో బంధింపబడినట్లు కూడా చెప్పింది. చివరకు శారద వివాహం జరిగిన తర్వాతే తను వివాహం చేసుకుంటానని ప్రమాణం చేసిన విషయంకూడా చెప్పింది.

అన్నీ విన్న రామం ఆలోచనలో పడ్డాడు. అలా వదినిముషాలు గడిచిపోయాయి—

శాంత మౌనభంగంచేస్తూ తమ కాలేజీ కబుర్లు, శాంత మంచి మార్కులతో గత పరీక్షలలో ప్యాసైన విషయం అన్నీ వివరించింది. ఆ విధంగా కబుర్లతో చాలా రాత్రివరకూ ముగ్గురూ గడిపారు. ఆ తర్వాత యింటికి వెళ్లారు రామం అలా గంభీరం ఉండి ఏదో ఆలోచిస్తూ న్నట్లుగా ఉండడంతో శారద భయపడింది. తనకు సహాయం చేసిన శాంతను మందలిస్తాడేమోనని బాధపడింది. ఏవేవో ఊహించుకుంటూ భయపడుతూ ఉండడంవల్ల, చోద్యం చేయడం వల్ల చాలా రాత్రివరకు ఆమెకు నిద్ర పట్టలేదు

*       *       *

శాంత శారదలు వచ్చి వారం రోజులైంది. రామం శారదలో ఉన్న సుగుణాలకు ముగ్ధుడయ్యాడు. తనకు అటువంటి చెల్లెలు ఉంటే ఎంతో బాగుండేదని అనుకున్నాడు. ఈ వారం రోజులలో శారదను రామం, రామాన్ని శారద చక్కగా అర్థం చేసుకున్నారు.

ఒకరోజు సాయంత్రం శాంత, శారద ఇద్దరూ తోటకు బయలుదేరారు బయలుదేరే ముందు లక్ష్మయ్యగారు ప్రొద్దుపోక ముందే తిరిగి రావలసిందని వారిద్దరినీ ఒకటికి నాలుగుసార్లు హెచ్చరించారు. అలాగే అంటూ వారు తోటవైపు నడక సాగించారు. వారు తోట చేరుకున్న అరగంటకు రామంకూడా అక్కడికి వచ్చాడు. ముగ్గురూ ఒకదగ్గర విశ్రాంతిగా కూర్చున్నారు.

రామం శారదవైపు చూస్తూ 'మీకు అభ్యంతరం లేకపోతే మీ చదువుభారం నేను వహిస్తాను. ఇంత తెలివిగల మీలాంటి వాళ్లకు సహాయం చేయడం మహద్భాగ్యంగా తలుస్తాను...మీరేమంటారు...?'

'ముందు మీరు నన్ను అలా బహువచనంతో సంబోధించడం మానండి. ఆ తర్వాత అన్ని విషయాలూ మాట్లాడుకుందాం. చూడండి! ఆవేశంతో త్వరపడవద్దు. నా పుట్టు పూర్వోత్తరాలు నాకే తెలియవు. అటువంటి నన్ను చేర

దీని నట్లయితే మీరు నలుగురిలో అవ హాస్యంపాలు కావలసి వస్తుందో ఏమో? పైగా నా వివాహం జరిగిన తర్వాతే తను వివాహం చేసుకుంటానని శాంత మొండి పట్టు పట్టింది. అది అంత తేలికగా జరిగే పనా...? అప్పనకముంగా అమరిన ఆడపిల్లల వివాహాలు జరగడమే బ్రహ్మ ప్రళయంగా ఉన్న రోజులలో నాలాంటి దాని సంగతి వేరే చెప్పనక్కర......' మాట పూర్తి చేయలేక కంట తడి పెట్టింది శారద.

'బాధపడకమ్మా! నీవు మాత్రం కష్టపడి చదువుకో... మిగత విషయాలేవీ ఆలోచించకు ఆ తర్వాత నేమన్నాను. ఆ పైన భగవంతుడు. ఆ దయామయుడు మంచి మనసుగలవారి నెప్పుడూ బాధ పెట్టడు.' తన మాటలతో తనకు భగవంతుడిపై గల ప్రగాఢ విశ్వాసాన్ని రుజావు చేసుకున్నాడు.

'శాంత నా భారం వహిస్తానని అన్నప్పుడే సగం దిగమింగాను. అయినా శాంత అస్వతంత్రురాలు. పైగా క్షణికోద్రేకంతో, ఆవేశంలో అలా అని ఉంటుందని ఊహించుకున్నాను. కాని ఆనాడు మీ నిర్ణయం నాకు ఎంతో ప్రోత్సాహాన్ని కలిగించింది. జీవితంపై ఒక విధమైన ఆశను రేకెత్తిస్తూ ఉంది. కాని మా మామగారేమంటారో...?' సందేహపడుతూ అంది శారద.

'అవన్నీ నే చూసుకుంటాను. నీవు మాత్రం సార్థక నామధేయురాలవై వృద్ధిలోకి రావాలి. కష్టపడి చదువుకుంటే ఎంతవరకైనా చదివిస్తాము. మరి నీవు గెలుస్తావో...? నేనో...?' అన్నాడు రామం చిరునవ్వు పెదిమలపై నాట్యం చేస్తూండగా—

'అన్నయ్యా ... నేనందుకు అర్హురాలినా? దీనికి ప్రతిఫలంగా నేను మీకేమివ్వగలను?' అప్రయత్నంగా శారద నోటినుండి వెలువడిన మాటలకు రామం హృదయం సంతోషంతో పొంగిపోయింది.

'చెల్లీ! చాలమ్మా! ఇంతవరకూ ఆ మధురమైన పిలుపు నోచుకోలేదు నేను. ఈరోజు నేను ఎంతో అదృష్టవంతుడను.'

రామం మాటలు శారదపై అమృత వర్షం కురిపించాయి. ఆమె ఒళ్లంతా సంతోషంతో గగుర్పొడిచింది. 'అన్నయ్యా...! అన్నయ్యా!' అంటూ ఆనంద బాష్పాలు రాలుస్తూ రామం పాదాలనంటి నమస్కారం చేసింది. ఆమెను లేవనెత్తి శాంత ప్రక్కన కూర్చుండబెడుతూ 'చెల్లీ! ఆ భగవంతుడు నీ నోట ఆమాట పలికించాడు. చాలమ్మా...! నేను ధన్యుణ్ణయ్యాను' సంతోషంతో ఊగిపోయాడు రామం.

'నేనందుకు అర్హురాలినా? నా విషయాలన్నీ తెలిసుండీ నన్ను సోదరిగా స్వీకరించావు నా బరువు బాధ్యతలు స్వీకరిస్తున్నావు. దీనికి ప్రతిగా నీకు నేనేం చేయగలనన్నయ్యా?' అశ్రుపూరిత నయనాలతో అంది శారద.

'ఒక చెల్లి తన అన్నకు యివ్వగల ప్రేమ తప్ప నాకింకేమీ వద్దమ్మా! అంతే! నీనుండి నేను అంతకుమించి ఆశించను' తన్మయత్వంతో అన్నాడు రామం.

'బాగుంది! అన్నాచెల్లెళ్ళిద్దరూ నన్ను మరచిపోయారేమిటి? చెట్టంత మనిషి నొకర్తిని నేనిక్కడ ఉన్నాననే ధ్యాసైనా లేదే మీ యిద్దరికీ!' విసుక్కుంటూ అంది శాంత.

'అప్పుడే ఏమైంది? శారద యిప్పుడు నా చెల్లి. మేమిద్దరం ఒకటి! ఇక నీ భరతం పట్టిస్తాం చూడు!'

'బావా! నీ పప్పులేం ఉడకవు. శారద ముందు నా స్నేహితురాలు. ఆ తర్వాతే నీ చెల్లెలు. నామాట వింటుందో? నీమాట వింటుందో? చూద్దాంగా!' అరిచింది శాంత

'అమ్మ బాబోయ్...! మీరిద్దరూ కలిసి నన్ను యిరకాటంలో పెడుతున్నారు. శాంతమ్మగారూ...! మీకో దండం పెడతాను ఆ పనిమాత్రం చేయకండి!' అభినయిస్తూ అంటూన్న శారద మాటలకు శాంతా, రామంలు నిండుగా నవ్వుకున్నారు. వారిద్దరి నవ్వులతో తన నవ్వును జోడించింది శారద. తోటంతా నవ్వుల పువ్వులయ్యాయి. ఆ నవ్వులు వెన్నెలతో పోటీ పడుతున్నాయి. చంద్రుడు మేఘాలలో దోబూచులాడుతూ మధ్యమధ్య వీరి నవ్వుల పువ్వులను ఏరుకుంటున్నాడు.

తన చేతిగడియారాన్ని చూసుకున్నాడు రామం. 'అరే! మాటల సందడిలో టైమే తెలియలేదు. తొమ్మిదిదాటింది. పద శాంతా! అత్తయ్య, మామయ్య యిద్దరూ మన కోసం ఎదురుచూస్తూ ఉంటారు' అని రామం అంటూ ఉండగానే యింటిముంత పాలేరు రానేవచ్చాడు వీరిని వెతుక్కుంటూ. వాడిని చూసిన రామం 'ఏమిట్రా...! ఇలా వచ్చావేం?' అని ప్రశ్నించాడు.

'మీరా చినబాబూ...! మీరున్నారుగా! శాంతమ్మగోరు, ఆరి ఎంటవచ్చిన ఉంకొక అమ్మాయిగోరు యిద్దరూ తోటకు ఎల్లారు. ఆరిని తీసుకొని రమ్మని పెద్దయ్యగోరు నన్ను తోలిండ్రు! ఇక్కడికి మీరెప్పుడొచ్చిండ్రు దొరా...?' నసుగుతూ అన్నాడు వాడు.

'నే వచ్చి ఇచాలాపేపైందిలే! ముందు నీవెళ్లి మేమందరమూ వస్తున్నామని వారితో చెప్పు.' అని ముందు వాడిని



ఆరోజంతా ఆ తర్వాత కబుర్లు చెప్పు
కుంటూ మెల్లిగా నడిచి వెళ్లారు ఆ
ముగ్గురూ.

* * *

రాత్రి భోజనాలు చేసి పడుకున్నారు.
శాంత త్వరగానే నిద్ర పోయింది. శారద
మాత్రం ఆలోచిస్తూ ఉంది. 'రామం
అన్నయ్య ఎంత మంచివాడు. ఆ నిండు
తనం, హుందాతనం దానికి తగిన చక్కని
రూపం, సొబగైన మాటతీరు. కనుకనే
ఊరినంతా తనమాటపై నడిపిస్తున్నాడు.
అంత గంభీరంగా ఉంటూనే యింత చలా
కీగా మాట్లాడుతాడని అనుకోలేదు. అతని
వ్యక్తిత్వం ముందు ఈనాటి ఈ పెద్ద
చదువులు ఎందుకు పనికి వస్తాయి?
ఎటువంటి వాడినైనా అట్టే తన మాట
లతో వశపరచుకొనే మహత్తు ఉంది
అతనిలో. త్యాగబుద్ధి, వినయ విధేయ
తలు, ఆస్తికత్వము అతనికి పుట్టుకతో
వచ్చిన గుణాలలా భాసిస్తున్నాయి. శాంత
నిజంగా ధన్యురాలు. శాంత ఆవేశానికి,
ఉద్రేకానికి అన్నయ్య నెమ్మదికీ కలిసి
పోతుంది, పాలల్లో తేనె కలిసినట్లు.

'ఇప్పటికి నా జీవితం ఒక గాడిన
పడింది. ఆ శ్రీపతిగారు, అన్నపూర్ణమ్మ
గారు ప్రభాకరంతో ఎన్నిబాధలు పడు
తున్నారో? వారి విషయం తలపుకు వచ్చి
నప్పుడల్లా వారిపై నాకెక్కడ లేని జాలి
కలుగుతూ ఉంది. ప్రభాకరం యిప్పుడు
ఏం చేస్తున్నాడో ఏమో?' పైవిధంగా
ఏవేవో ఆలోచిస్తూ నిద్రాదేవి ఒడిలో
తలవాల్చుకుంది శారద.

శాంత శారదలిద్దరూ భిన్న ప్రకృతి
గల యువతులు. గులకరాళ్లపై గలగల
శబ్దం చేస్తూ ప్రవహించే సెలయేరు
వంటి మనస్తత్వం శాంతది లోతైనా
ప్రదేశంలో. వెడల్పుగా ఉన్నచోట, నెమ్మ
దిగా, నిండుగా ప్రవహించే నదిలాంటి
మనస్తత్వం శారదది. ఆవేశము రావడా
నికీ, అది తగ్గడానికి ఎక్కువ వ్యవధి
అక్కరలేదు శాంతకు. అసలు ఆవేశమే
రాదు శారదకు. ఒకవేళ వస్తే త్వరగా
తగ్గదు. ఇద్దరూ అందంలో ఒకరినిమించి
మరొకరు పోటీపడుతుంటారు. కోలముఖం,
సోగకళ్లు, నవ్వితే సొట్టలుపడుతూ ఎర్ర
గులాబీలను గుర్తుకు తెచ్చే ఆ బుగ్గలు,

# మల్లెలు...

అరవిచ్చిన మందారాలతో పోటీపడే ఆ పెది
మలు, ముఖంలో చురుకుదనం, కళ్లల్లో
చిలిపితనం ఎవరినైనా యిట్టే ఆకర్షించ
గలదు శాంత.

కష్టాలలో పెరిగినా పోషణ సరిగా
లేకపోయినా శారదను ఒకసారి చూస్తే,
మరొకసారి చూడకుండా ఉండలేరు.
చంద్రబింబంలాంటి ముఖం, కొనదేలిన
ముక్కు, తెల్లని ఛాయగల ముఖానికి
తుమ్మెద రెక్కలలాంటి నల్లని కళ్ళు
ఆమె అందాన్ని యినుమడింప జేస్తాయి.
ఆభరణాలు లేకున్నా కళగల ముఖంతో,
పెదిమలపై లాస్యం చేసే చిరునవ్వుతో
ఎంతో అందంగా కనుపిస్తుంది శారద.

వారిద్దరి మనోభావాలకు తగినట్లుగనే
వారి ప్రవర్తన ఉంది. ఏపనినైనా బాగా
ఆలోచించి, తనలోతాను ఆ పనిని గురించి
తర్కించుకొని తను చేస్తున్నపని సక్ర
మమైనదే అని రూఢి అయిన తర్వాత
గాని ఆ పనిని ప్రారంభిస్తుంది శారద.
అందుకు పూర్తి విరుద్ధం శాంత.
శాంత శారదకయ్యే ఖర్చులు భరిస్తున్న
ప్పటికి, బాగా ఆలోచించి నిత్యావసర
మైన ఖర్చులకు తప్ప, విలాసాలకుగాని,
వృధాఖర్చులకుగాని చిల్లిగవ్వ ఖర్చుచేయ
నిచ్చేది కాదు. శారదతో స్నేహం కలిసిన
తర్వాత శాంతచేసే దుబారాఖర్చులు కూడా
చాలావరకు తగ్గాయి.

* * *

శాంత, శారదలకు అక్కడ రోజులు
ఉత్సాహంగా గడిచిపోతున్నాయి. వారిద్దరూ
ప్రతినిత్యమూ తోటకు వెడుతున్నారు.
సాయంకాల మవగానే రామంకూడా విధిగా
తీరిక చేసుకొని తోటకు వస్తున్నాడు.
ముగ్గురూ కాలం తెలియని కబుర్లతో
చీకటి పడేంతవరకు గడుపుతున్నారు.
ఆతర్వాతంటికివెళ్లి భోజనంచేసి, పుస్త
కాలు చదువుతూ ఆ తర్వాత నిద్రపోతు
న్నారు. ఇదీ వారి దినచర్య.

శారదకు లక్ష్మయ్యగారి యింట్లో
ఆ కొద్దికాలంలోనే చనువు పెరిగింది.
పార్వతమ్మగారిని అత్తయ్యా అనీ, లక్ష్మయ్య
గారిని మామయ్యా అని పిలుస్తూ వారికి
సంతోషాన్ని కలిగిస్తూ ఉంది. పార్వతమ్మ
గారికి పనిలో సహాయపడుతూ ఆమె
మెప్పును పొందుతూ ఉంది. ఆ వృద్ధ
దంపతులు రామంద్వారా శారద విష
యాలు విని ఆమెపై జాలితలచారు.
శారద చదువు బాధ్యత రామం వహిం
చాడని తెలుసుకొన్నప్పుడు ఆయన సంతో
షించారు. శారద తన సత్ప్రవర్తనతో
అందరి ప్రేమకూ పాత్రురాలైంది. తన
చదువు విషయంలో అందరి ఆమోదం
లభించడంతో శారద హాయిగా నిట్టూ
ర్చింది.

ఒకరోజు లక్ష్మయ్యగారు కట్టించిన
ఆలయానికి ముగ్గురూ వెళ్లారు.—

పూజారిని నియమించి, ఆ దేవా
లయానికి కావలసినంత స్థిరాస్తిని తను
పొలాలనుండి వ్రాసిచ్చారు లక్ష్మయ్యగారు.
ఆలయంలో రెండుపూటలూ నిత్య నైవే
ద్యాభిషేకాలు జరుపుతుంటాడు పూజారి.
పర్వదినాలలో ప్రత్యేకపూజలు, పేదలకు
అన్నదానాలు రామం దగ్గరఉండి స్వయంగా
జరిపిస్తాడు.

వీరు వెళ్లగానే పూజారి వారిని
సాదరంగా ఆహ్వానించి వారి చేతులలో
ఉన్న టెంకాయ, తదితర పూజాద్రవ్యా
లను అందుకొని వారిగోత్ర నామాలతో
పూజ ప్రారంభించాడు. శాంత గంట
అందుకోలేక ఒకచేతితో రామం భుజాన్ని
ఆసరా చేసుకొని కొద్దిగా ఎగిరి రెండో
చేతితో గంటను వాయించింది. వారిద్దరినీ
సంతోషంగా చూస్తూ నిలుచుంది శారద.
అప్పుడే పూజ ముగించి మంగళహారతి
తీసుకు వచ్చిన పూజారికంటకూడా ఈ
దృశ్యం పడింది. ముసిముసిగా తనలో
తాను నవ్వుకున్నాడు. ఆ గ్రామంలో
అందరికి తెలుసు శాంతా రామం యిద్దరూ
కాబోయే దంపతులని. వారిద్దరూ కలిసి
ఎక్కడైనా వెళ్లినా, ఒకరిని ఒకరు
చనువుగా పిలుచుకున్నా ఎవరూ విడ్డూర
పడరు, ఆక్షేపించరు.

ముగ్గురూ పూజారి తీసుకువచ్చిన
హారతిని భక్తితో కళ్ల కద్దుకున్నారు.
ప్రసాదం నోట్లో వేసుకొని అక్కడఉన్న
అరుగులమీద కూర్చున్నారు. ఆ ఆలయం
చుట్టూ ఉన్న తోటను చూసి వస్తానని
శాంతను, రామాన్ని ఒంటరిగా ఒదిలి
వెళ్ళింది శారద.

'శాంతా దేవుడిని ఏం వరం కోరుకున్నావ్?'

'నా బావ ప్రేమ చిరకాలం నాపై యిలాగే ఉండా...' సిగ్గుతో తల వంచుకొని మిగతామాటలు పూర్తి చేయలేక పోయింది.

'ఊఁ...అలాగా? అదేమంత అసాధ్యమైన కోరికని...?'

'ఏమో...? రేపు ఏ కన్నెపిల్లైనా నా బావమనసు దోచేసి వలలో వేసుకుంటే...! అప్పుడు నేనేం కావాలి?'

క్షణంలో శాంతముఖం కవళికలు మారిపోయాయి. ఆమెకళ్లు విచిత్రంగా కదిలి చెమ్మగిల్లాయి. శాంత అందమంతా ఆమె కళ్లల్లోనే ఉంటుంది. రామం ఎప్పుడూ ఆమె కళ్లనే వర్ణిస్తూ ఉంటాడు.

'అదేమిటి? ఇంతేనా నీవు నన్ను అర్థం చేసుకున్నది?'

'క్షమించు బావా! కీడెంచి మేలెంచమన్నారు పెద్దలు. రేపేదైనా జరిగితే నేను భరించలేను ప్రతి చిన్న విషయానికి నేనెంతగ బాధపడతానో నీకుతెలుసు. నీవు నన్ను అర్థం చేసుకున్నట్లు అమ్మ...! నాన్న...! కూడా నన్ను అర్థం చేసుకోలేరేమో...?' చెమ్మగిలిన కళ్లను పమిటతో తుడుచుకుంటూ అంది శాంత.

'నీ కసలు అటువంటి ఊహ ఎందుకు వచ్చింది?' క్వశ్చన్‌మార్కు ముఖం పెట్టి ప్రశ్నించాడు.

'ఎందుకో బావా...? అప్పుడప్పుడు నాకు భయం కలుగుతూ ఉంటుంది. నీవు అందగాడివి. పైగా అందరితో చనువుగా ప్రేమగా మాట్లాడుతావు. ఊరిలో పెద్దరికం! నిన్ను వలలో వేసుకోవడానికి నీ మనసు మార్చడానికి ఎవరైనా స్వార్థపరులు ప్రయత్నించవచ్చు' అనుమానపడుతూ అంది శాంత.

'పిచ్చిదానా...? నీబావ అంత చపలచిత్తుడనుకున్నావా...? కంటపడిన వారందరి వెంటపడడానికి? ఒకవిధంగా ఆ ప్రశ్న నిన్ను నేనే వేయాలి. కాని నీపై నాకు ఆ విశ్వాసం, నమ్మకం రెండూ ఉన్నాయి. పిచ్చి పిచ్చి ఆలోచనలు మనసులో పెట్టుకుని బాధపడకు' లాలిస్తున్నట్లుగా అన్నాడు రామం.

అంతలో శారద తోటలోకి తిరిగి ఆ యిద్దరున్న చోటికి వచ్చింది. శాంత ముఖంలో వచ్చిన మార్పు ఆమెకు అర్థం కాలేదు.

ముగ్గురూ మౌనంగా యింటివైపు నడిచారు—

శెలవులు పూర్తయ్యాయి. శాంత, శారద లిద్దరూ ప్రయాణమయ్యారు. బి. ఏ. రెండవ సంవత్సరం చదవడంకోసం రామం వద్ద శెలవుతీసుకొని బయలుదేరారు. వాళ్ళనిద్దరినీ బస్సువరకు సాగనంపి జాగ్రత్తగా ఉండవలసిందని చెబుతూ యింటికి తిరిగి వచ్చాడు రామం.

(ఇంకా ఉంది)

# ఉబ్బసానికి కొత్త (?) చికిత్స

ఈమధ్య ఢిల్లీలోని పటేల్ ఇన్‌స్టిట్యూట్ [వైద్య సంస్థ] వారు తెలుగులో వెట్టిపాల అనబడే ఆకుమీద పరిశోధనలు కొన్ని జరుపుతున్నట్లు టయిమ్స్ వీక్లీలో శ్రీ కిర్లేకర్ అనే ఆయన రాశారు. దీనిలో విశేషం ఏమిటంటే ఈ ఆకు ఉబ్బసంతో బాధపడేవారికి మంచి గుణం ఇస్తుందిట. ఇంగ్లీషులో దీనిని టయిలోఫోరా అస్త్మాటికా అంటారు.

ఆస్త్మాటికా అన్న పేరునిబట్టే ఈ ఆకు ఉబ్బసానికి వాడేవారని గ్రహించవచ్చు. [ఇది ఎక్కువగా దక్షిణ, తూర్పు భారత దేశ ప్రాంతాలలో దొరుకుతుంది.] ఈ ఆకులో ఉండే రసాయన పదార్థాలమీద ఇంతకిముందే భారతదేశంలో కొన్ని పరిశోధనలు జరిగాయి. ఢిల్లీ వైద్యసంస్థవారు చూపిస్తున్న ఆసక్తివల్ల ఇతర కేంద్రాలలోనూ శాస్త్రజ్ఞులు తమ పరిశోధనలు మొదలు పెట్టారు.

ఈ వెట్టిపాలకు చికిత్స ఎలాగ చెయ్యాలి? ఆరు రోజులు వరుసగా వెట్టిపాల ఆకుని తెల్లవారిజామున 4, 5 గంటలమధ్య నమిలి తినాలి. తిన్న తర్వాత విశ్రాంతి అవసరం, కాఫీ, టీవంటి పానీయాలు సేవించరాదు! ఆకు తిన్న మూడు గంటల తర్వాత పుచ్చుకోవచ్చు. . . . .

ఈ ఆరు రోజులూ ఆకు తిన్న వారికి నోరు పొయ్యటం, తలనొప్పి, నోటినిండా చేదు, కలవరంగా ఉండటం, తుమ్ములు— ఇవన్నీ అధికంగా ఉంటాయి.

ఆ తర్వాత ఉబ్బసం తగ్గిపోతుంది— అందరికీ కాకపోయినా ఈ చికిత్స తీసుకున్న వారిలో అధిక సంఖ్యాకులకి! ఈ విలేఖరికి తెలిసిన వ్యక్తి ఒకరికి తీవ్రమయిన ఉబ్బసం ఉండేది. ఆరు రోజుల చికిత్స తర్వాత ఇంచుమించు నయమయి పోయింది!

సాధారణంగా ఉబ్బసం కొన్ని పదార్థాలు పడకపోవటంవల్ల వస్తుంది, అంటారు. ఈ పడకపోవటాన్ని ఎల్లర్జీ అంటారు. ఉదాహరణకి కొందరికి దూది పడదు. మరి కొందరికి పువ్వుల వాసనలు పడవు [ఒకాయనకి ఆయన అత్తగారి ఫోటో చూసినా ఉబ్బసం వచ్చేదిట! ఈ ఎల్లర్జీవల్ల ఉబ్బసం వస్తే వెట్టిపాల ఆకు తినటంవల్ల దేహం ఎల్లర్జీలకి బండబారిపోయి ఉబ్బసం రాదని పటేల్ ఇన్‌స్టిట్యూట్‌లోని నిపుణులు కొందరు భావిస్తున్నారుట.

వెట్టిపాల ఆకులో కొన్ని రసాయనిక పదార్థాలు వాంతులు కలిగిస్తాయి. కాఫీ, టీ నిషేధం డోకు రాకుండా ఉండటానికే తప్ప మరెందుకూ కాదని ఒక నిపుణుని అభిప్రాయం.

సాధారణంగా, వృక్ష పదార్థాలలోనుంచి రసాయన పదార్థాలని సారాయం, బెంజీన్ మొదలయిన ద్రావకాల ద్వారా తీస్తారు. ఆయుర్వేదం పద్ధతులలో అధికంగా వీటినే వాడుతారు. ఇకనయిన జరిగే పరిశోధనలు వీటి సహాయంతో తీసిన పదార్థాలమీదనే జరిగితే బాగుంటుందని ఇక్కడ పరిశోధన జరిపే నిపుణులు ఒకరు ఈ విలేఖరితో అన్నారు. భారతదేశంలో ఈ పరిశోధనకి తగిన ప్రోత్సాహం దొరకటం లేదని, ఇదే ధోరణి కొనసాగితే విదేశీ సంస్థలు మాత్రమే పరిశోధన జరిపి వాటి ఫలితాలని వ్యాపారానికి వినియోగించవచ్చుననీ కొందరు అంటున్నారు.

ఎల్లర్జీ అనేది గ్రీకు భాషలోని ఇతర క్రియ అన్న మాటలలోనుంచి వచ్చిందిట. —[illegible]




**బి. ఎల్, కొవ్వూరు**

ఈర్ష్యా ద్వేషాలు మగవారికి ఎక్కువన అంటారు మీరేమంటారు?

మగవారికే ఎక్కువే అంటాను.

**పి వి. ఎస్, నాగులుప్పలపాడు**

రామలక్ష్మిగారూ, విద్యావంతుడైన పురుషుడు విద్యలేని స్త్రీని వివాహం చేసుకుంటున్నాడు కదా? ఆ విధంగా స్త్రీ ఎందుకు చేయకూడదు?

నిక్షేపంలా చేయవచ్చు— కాని తెలిసిన వాళ్ళు ఏమనుకుంటారో అని వెనక తీస్తారంతే. భార్యని పోషించకల స్తోమతు ప్రధానంగాని డిగ్రీలు కాదు.

**పి. హెచ్. ఆర్, అగిత్యాల**

నా మనోభావాలను మీ పత్రిక ద్వారా ప్రభుత్వానికి తెలుపదలిచాను. ప్రచురించ గలరా?

పత్రికలో ఎందుకుసార్, పిటీషన్ను పంపండి.

**ఎస్. ఎస్. ఆర్, కాటూరు.**

మహాకవి శ్రీ శ్రీ గారి రచన 'ఓ మహాత్మా ఓ మహర్షీ' అనే గేయం దొరకటం లేదు...

ఎందుకు దొరకదు. శ్రీ శ్రీ సర్వస్వం మూడో సంపుటి ముప్పయి నాలుగో పేజీలో ఉంది!

**టి. ఎస్. ఎస్, తుమ్మిశి**

అమ్మాయిలకే ముందు ఉద్యోగాలు— అబ్బాయిల కన్న. మీరేమంటారు.

మీరలా చెప్పేస్తుంటే నేనేమంటాను—కనీసం కొంత కాకపోతే కొంతైనా లెక్కలు తీసి సాక్ష్యం చూపి, మరీ ఇలాంటి స్టేట్‌మెంట్లు పారేయ, మంటాను.

**ఏ. సి హెచ్, శివిని**

దేవుడున్నాడని నేను, లేడని మా మామయ్య రోజూ వాదించుకొంటున్నాం. మరింతకీ దేవుడున్నాడా? లేడా? మీ ఉద్దేశ్యం ఏమిటో చెప్తారా?

ఈ రోజుల్లో, మీ ప్రాంతంలో ప్రతికున్న భోజనం ఉన్న ప్రతివాడూ—ప్రత్యక్ష సాక్షి కదా— దేవుడనే వాడొక్కడు ఉన్నాడని!.... ఇంకా అంత అనుమానం ఎందుకు మీ మామయ్యకి?

**బి. ఎస్. పి. ఆర్, డోలుకూరు**

ఏమండీ రామలక్ష్మిగారూ స్త్రీకి ఏది ముఖ్యం? మనసా? మాంగల్యమా? మాతృత్వమా?

బొత్తిగా సినిమా టైటిల్సు ప్రశ్నలు వేస్తే ఎలా? మనసూ మాంగల్యం అంటే నాగేశ్వరరావు పిక్చర్ అంటారు. నోసీ మాతృత్వం అంటే రామారావు పిక్చర్ అంటారు. పెద్ద చిక్కే తెచ్చిపెట్టారే— పోనీ మూడూ అందామేమిటి—గోడమీద పిల్లి వాటంగా ఉంటుంది!

**డి. ఎల్. కె. కొండాలి.**

జీవితం డల్‌గా ఉంటోంది...వద్దాలుగు సంవత్సరాలైంది కాపురానికి వచ్చి. నా కిప్పుడు ఇరవైతొమ్మిదేళ్ళు...

బాగుంది. క్రీడమైన ఈ వయస్సులో జీవితం డల్‌గా ఉంది అనుకుంటే— అర్థం లేదు. కాస్త రొటీన్ మార్చి చూడు చిట్టితల్లీ. రొటీన్ మార్చడం అంటే కొండత్రవ్వి ఎలకని పట్ట నక్కరలేదు. రోజూ తినే అన్నానికి బదులు వో వారం రొట్టెలు తిన్నా మార్పే!

**ఎమ్. జె. బరంపురం.**

మీ మాటిగా పోయే మనస్తత్వం, తాటాకు చప్పుళ్ళకి బెదిరిపోకుండా ధైర్యంగా నిలబడడం, మీ సున్నితమైన హాస్యంతో కూడిన జవాబులు నాకెంతో నచ్చాయి...

దడుసుకునే వాళ్ళనే దెయ్యాలు భయపెడతాయి సోదరీ, అందుకే లోలోపల భయం భయంగా ఉన్నా, పైకి గంభీరంగా ఉండాలి!

**ఎమ్. ఎస్. విశాఖపట్నం.**

మీ పరిచయస్తులు మీ ఇంటికి వస్తే ఏమిటి చేస్తారు?

ఏముందీ, చుట్టాన్ని కట్టేసి గొయ్యాన్ని విప్పేస్ టీపీ, అని మా చిన్నదాన్ని కేక వేస్తాను!!

**జె. కె. ఎన్, తిరుపతి.**

హోప్ యు ఆర్ ఆల్ ఇన్ ది వెల్. ఐయామ్ సేఫ్ హియర్.

ఎస్, ఐయామ్ ఇన్ ది వెల్—మై బోయ్! [నీ కుశలప్రశ్న చదివాక యింకెక్కడుంటాను!]

**ఓ. ఆర్, మోపూరు**

నాకు బదులు ఇవ్వకపోతే మీకు గర్వం అనుకుంటాం జాగ్రత్త సుమా

అంతేగామరి—పెడితే పెళ్ళి లేకుంటే శ్రార్ధం!, ఇదేం కొత్తకాదు చిట్టి చెల్లెలా—మానవ సహజం!

**దాసరి ప్రభాకర, నూజివీడు**

మాకు మీమీద అసూయలేదు. కాని మీ బోర్ భరించలేక ఛస్తున్నాం ... మీబోటి ఆస్థానకవులు ఆంధ్రపత్రికలో ఉండబట్టే మా బోటివారు పంపిన వ్యాసాలు కనీసం వెనక్కన్నా తిరిగి రావడం లేదు...

అసలు బాధ అదా బాబూ!...ఆస్థానకవులు కాదు వీరు అనవలసింది—కోలమిస్టు. ఏ పత్రికకేనా, రెగ్యులర్‌గా వ్రాసే కోలమిస్టులు ఉంటూ వుంటారు. వారి వల్ల తమరి వ్యాసాలు అచ్చుకావడం లేదనుకోవడం అపోహే. కాక పోతే—మీ అనుమానం అంతే. మాలాంటి వారందరం వ్రాయడం మానేస్తే మీ రచనలు అచ్చయి తీరతాయన్న గ్యారంటీ ఏమిటి? లేక, ఉందా!?

**పి. బి. ఆర్, సంత్రగచ్చి**

జీవితాన్ని పుస్తకాల్లో చెప్పినట్టు, నడపడం సాధ్యమా? అసాధ్యమా?

ఏపుస్తకాల్లో చెప్పినట్లో చెప్పకపోతే ఎలాగ సార్?

**డి. ఏ. డి, మహాదేవపురం**

మీరంటే నాకోవిధమైన ఏవగింపు, అయిష్టత. అయినా పత్రికరాగానే మొదట చదివేది ప్రశ్నావళి మాత్రమే. కారణం ఏమిటంటారు?

అయిష్టమైన పని ముందు చేసి ముగిద్దామన్న ఆత్రుత అయివుంటుంది!

**ఆర్. వి. బెంగుళూరు**

సమాజంలో స్త్రీ వేశ్యావృత్తికి దిగడానికి కారణం?

భుక్తి గడవక. వేరు వృత్తి తెలియక.

నక్సలైట్ల ఉద్దేశ్యం ఏమిటి?

రాబిన్‌హుడ్ ఉద్దేశ్యాలే—ధనికుల్ని దోచి పేదలకి పంచాలని [మిగిలితే!

**కె. ఎస్. హైదరాబాదు**

అదేమిటి? సంవత్సరం ఆఖరున పుట్టారు?

పుట్టుక మన యిష్టాలతో పని లేకుండా జరుగుతుంది నిరూపించడానికేమో. నన్నే తేదీ ఎంచుకో మంటే ఏ రెండు మూడు తేదీలలోనో ఎంచుకునే, దాన్ని— జైబులు ఖాళీగా ఉండనప్పుడు.

**ఎస్. ఆర్. ఎమ్, గుంటూరు**

నాకు పదకొండేళ్ళప్పటినుంచీ... చదివాను

నేనా వయస్సులో ఏంచేశానో అఆ లు తలక్రిందులుగా వ్రాసి చివాట్లు తింటూ వుండేదాన్ని! మీరెవరో కారణజన్ములుగా ఉన్నారు? ●












* మహేష్ *




# కాదు సుమా! కథ కాదు సుమా!

[గతసంచిక తరువాయి]

ఒక ఊళ్లో కామయ్య, కామమ్మ అనే దంపతులు ఉన్నారు. వారికి వివాహం జరిగి యాభై సంవత్సరాలు అయింది. ఆ సందర్భంలో వారు తమ బంధువులకు మిత్రులకు పెద్ద విందు చేశారు. ఆ విందుకు వచ్చిన బంధువుల్లో ఒకాయన కామయ్యగారితో యిలాగ అన్నాడు.

'మీ వివాహం జరిగి యాభై సంవత్సరాలు అయింది కదా! ఈ యాభై సంవత్సరాల వైవాహిక జీవితంలో గల విశేషాన్ని తెలుసుకోవాలని మాకు చాలా కుతూహలంగా ఉంది'

'ఈ యాభై సంవత్సరాల్లో నేనూ నా భార్యా యెన్నో సుఖాలు అనుభవించాం. యెన్నో కష్టాలు పడ్డాం. పిల్లలకు పెళ్ళిళ్ళు చేశాం. యెన్నో గొడవలు జరిగాయి. కాని యే సందర్భంలోను కూడా మా యిద్దరి మధ్యా భేదాభిప్రాయం అనేది యెప్పుడూ రాలేదు. ఎప్పుడూ మేము యిద్దరం కూడా ఒక నిర్ణయాన్ని అనుసరించే వ్యవహరించేవాళ్లం.' అని సమాధానం యిచ్చాడు కామయ్య.

'యాభై సంవత్సరాల కాలంలో ఒక్కసారి కూడా భార్యాభర్తల మధ్య భేదాభిప్రాయం రాలేదు అంటే అది చాలా గొప్ప విషయం. అది మీకు యెలాగ సాధ్యం అయింది?'

'అది చాలా సులభం. పెళ్లి అయిన మొదట్లోనే నేనూ నా భార్యా కలిసి ఒక నిర్ణయానికి వచ్చేశాం. పెద్ద విషయాల్లో నేను చెప్పినట్లుగా ఆమె వ్యవహరించాలి. చిన్న విషయాల్లో ఆమె చెప్పినట్లు నేను వ్యవహరించాలి. ఇది ఆ నిర్ణయం. ఆ నిర్ణయాన్ని పూర్తిగా అమలు జరపడంవల్లనే మా మధ్య యెప్పుడూ భేదాభిప్రాయం కలగలేదు'

'అయితే యింతవరకు యెన్ని పెద్ద విషయాల్లో మీరు చెప్పినట్లుగా మీ భార్య వ్యవహరించింది?' అని తిరిగి ఆ బంధువు ప్రశ్నించాడు.

'అబ్బే! ఇంతవరకు పెద్ద విషయం అంటూ యేదీ రాలేదు' అని సమాధానం యిచ్చాడు కామయ్య.

ఇక్కడ కామయ్య చెప్పినదాంట్లో అబద్ధం యేమీ లేదు. యాభై సంవత్సరాల్లో కామయ్యగానీ, అతని భార్యగానీ భేదాభిప్రాయం రాని మాట నిజం. కాని అది యెలాగ సాధ్యపడింది? ఆ యాభై సంవత్సరాల కాలంలో జరిగిన ప్రతి విషయాన్ని చిన్న విషయంగానే భావించడం జరిగింది. అందుచేత ప్రతి విషయంలోను కామమ్మ చెప్పినట్లుగా కామయ్య ప్రవర్తించాడు. ఇక అప్పుడు భేదాభిప్రాయానికి అవకాశం యెక్కడ ఉన్నది?

కామయ్య తన భార్యా విధేయత్వానికి ఒక సిద్ధాంతపు ముసుగును కప్పాడు. ఈ విధంగా మన నాయకులు యెప్పుడు ప్రవర్తించారు? అని చంద్రరావు ప్రశ్నించగా మాడా మణి చెప్పడం ప్రారంభించాడు.

1970వ సంవత్సరం అక్టోబరు 25వ తేదీని మంత్రి జగజీవన్‌రామ్ పాట్నాలో ఒక బహిరంగ సభలో మాట్లాడుతూ యిలాగ అన్నాడు.

'తన అధ్యక్షతను ఉన్న కాంగ్రెసు పార్టీ—కమ్యూనిస్టుపార్టీతో కాని మరియే

రాజకీయపక్షంతో కాని జాతీయ స్థాయిలో కాని రాష్ట్రస్థాయిలో కాని యెన్నికల ఒప్పందం చేసికొనదు. అయితే అవసరమైన చోట్ల యితర పక్షాలతో 'స్థానికమైన సర్దుబాట్లు' చేసికొనే అవకాశం లేకపోలేదు.'

జగజీవన్‌రామ్ అధ్యక్షతను ఉన్న కాంగ్రెసుపార్టీ కేరళ రాష్ట్రంలో కమ్యూనిస్టుపార్టీతోను ముస్లింలీగుతోను యెన్నికల ఒప్పందం చేసికొన్నది,

తమిళనాడులో ద్రవిడమున్నేట్ర కజగం, కమ్యూనిస్టుపార్టీ, ముస్లింలీగు వగైరా పక్షాలు కలిసిన ఫ్రంటుతో యెన్నికల ఒప్పందం చేసికొనడానికి జగజీవన్‌రామ్ కాంగ్రెసు ప్రయత్నించింది. కాని ఒప్పందం కుదరలేదు. ఒప్పందం కుదరకపోవడానికి కారణం సీట్ల పంపకంలో వచ్చిన భేదాభిప్రాయాలే కాని సిద్ధాంతాలకు సంబంధించిన భేదాభిప్రాయాలు యెంతమాత్రం కాదు.

ఈ యెన్నికల ఒప్పందాన్ని గురించి జగజీవన్‌రామ్‌ను ప్రశ్నించినట్లయితే అది కేవలం 'స్థానికమైన సర్దుబాట్లు' అని అతను తప్పుకోవచ్చును.

'ఇతర పక్షాలతో కాంగ్రెసుపార్టీ యెన్నికల ఒప్పందం చేసికోదు' అని చెప్పిన జగజీవన్‌రామ్‌కు కేరళలో 'స్థానికమైన సర్దుబాట్లు' అనే పేరుతో కమ్యూనిస్టుపార్టీతోను ముస్లింలీగుతోను యెన్నికల ఒప్పందానికి అంగీకరించాడు.

ఇక్కడ కామయ్య చెప్పిన ఒడంబడిక యేమిటి అంటే పెద్ద విషయాలు అన్నీ కామయ్య నిర్ణయించాలి. చిన్నవిషయాలు మాత్రం కామమ్మ నిర్ణయించాలి. కాని యాభై సంవత్సరాలలో జరిగిన సంఘటనలను చిన్నవిషయాలుగా భావించి కామయ్య కామమ్మ నిర్ణయాలను శిరసావహించాడు.

ఈ పరిస్థితిలో—

కమ్యూనిస్టుపార్టీతోను, ముస్లింలీగుతోను చేసికొన్న ఒప్పందాన్ని కేవలం 'స్థానికమైన సర్దుబాట్లు' అని చెబుతున్న జగజీవన్‌రామ్‌కు—

ప్రతిసంఘటనను చిన్న విషయంగా భావించి, భార్యమాటను జవదాటని కామయ్యకు—తేడా యేమిటి?' అని మాడామణి ప్రశ్నించగా చంద్రరావు యింకో కథ

# ముగ్గురుమూర్ఖులు

చెప్పడం ప్రారంభించాడు.

'ఒక ఊళ్లో రత్తయ్య అనే ఆసామీ ఉండేవాడు. రోజూ కోటలోనికి వెళ్ళి రాజు కాళ్ళు పట్టడం అతని వృత్తి.

ఒకనాడు రత్తయ్యకు దూరపు బంధువైన ఒక ముసలమ్మ చనిపోయింది. ఆమెకు రత్తయ్య మినహా బంధువులు యెవరూ లేరు. అందుచేత ఆమె తాలూకు నగలన్నీ రత్తయ్యకు వచ్చాయి.

ఆరాత్రి రత్తయ్య మామూలుగా కోటలోనికి వెళ్లి రాజుకాళ్లు పడుతున్నాడు. అప్పుడు రాజు మాటవరుసకు 'రత్తయ్యా! ప్రజల పరిస్థితి యెలాగా ఉంది?' అని ప్రశ్నించాడు.

'బాబుగారూ! ప్రజల తాలూకు దూరపుబంధువులు చనిపోతున్నారు. అందుచేత వాళ్ళ నగలు ప్రజలకు వచ్చేస్తున్నాయి. కాబట్టి ప్రజలందరూ చాలా ఆనందంగా ఉన్నారు' అని రత్తయ్య సమాధానం యిచ్చాడు.

మర్నాడు రత్తయ్య ఆ నగలను కరిగించగా నిమ్మకాయంత బంగారం వచ్చింది.

'ప్రజల పరిస్థితి యెలాగ ఉంది?' అని రాజు ఆరాత్రికూడా రత్తయ్యను ప్రశ్నించాడు.

'ప్రజలకేం బాబూగారూ? అందరూ ఆనందంగా ఉన్నారు. అందరివద్దా నిమ్మకాయంత బంగారం ఉన్నది' అని రత్తయ్య జవాబు యిచ్చాడు.

మూడవనాడు ఒక దొంగ రత్తయ్య యింట్లో ప్రవేశించి ఆ బంగారాన్ని యెత్తుకుపోయాడు.

'ప్రజల పరిస్థితి యెలాగ ఉంది రత్తయ్యా?' అని రాజు మూడవరాత్రి కూడా ప్రశ్నించాడు.

'ఏం చెప్పను? బాబూగారూ! దేశంలో దొంగతనాలు యెక్కువైపోయాయి. ప్రజల దగ్గరఉన్న బంగారాన్ని దొంగలు యెత్తుకొనిపోతున్నారు. అందుచేత ప్రజలకు చాలా దుఃఖంగా ఉన్నది' అని రత్తయ్య జవాబు యిచ్చాడు.

ఇక్కడ రత్తయ్య తనదగ్గర బంగారం ఉంటే, ప్రజలందరి దగ్గరా కూడా బంగారం ఉందని అనుకొన్నాడు. అలాగే తన బంగారం పోతే, ప్రజల బంగారంకూడా పోయిందని రత్తయ్య అనుకొన్నాడు.

ఇది చాలా అవివేకం కదా! ఇటువంటి అవివేకంతో యేమంత్రి వ్యవహరించాడు?' అని చంద్రరావు ప్రశ్నించాడు.

'1969వ సంవత్సరం మేనెలలో, కైరోకు చెందిన 'అల్ అహ్రాం' అనే పత్రికకు ప్రధానమంత్రిణి ఇందిరాగాంధీ యింటర్వ్యూ యిచ్చింది. ఆ సందర్భంలో ఆమె యిలాగ అంది.

'ఉన్నతవర్గం' అనబడే వర్గం భారతదేశంలో పెరుగుతూ ఉంది. వ్యక్తులు పదవులకు యెన్నిక అవుతున్నారు. మరికొంతమంది ఉన్నతోద్యోగాల్లో ప్రవేశిస్తున్నారు...వీరు ఆ ఉన్నతస్థితికి రావడం అనేది కొన్ని సంవత్సరాల క్రిందట ఆలోచించడానికి కూడా వీలులేని విషయం.' అని మాడామణి ఇందిరాగాంధీ యిచ్చిన యింటర్వ్యూను గురించి చెప్పాడు.

'అవును. ఇందులో పొరబాటు యేమిటి ఉన్నది' అని ప్రశ్నించాడు చిదంబరం.

'ఒకవ్యక్తి తన అర్హతకు తగిన పదవిని పొందినప్పుడు—అది కొన్ని సంవత్సరాల క్రిందట ఆలోచించడానికి కూడా వీలులేని విషయం' అని అనడానికి అవకాశం లేదు. ఎందుచేతనంటే' అని మాడామణి చెప్పడం ప్రారంభించాడు.

'ఒక వ్యక్తి పదవులకు యెన్నిక కావాలన్నా, ఉన్నతోద్యోగాల్లో ప్రవేశించాలన్నా అతనికి కొన్ని అర్హతలు అవసరం. కొద్ది రోజుల్లోనో, కొద్ది నెలల్లోనో యెవరూ ఈ అర్హతలను సంపాదించలేరు. ఉన్నత పదవులను పొందడానికి తగిన అర్హతలను సంపాదించడానికి యెవరికైనా కొన్ని సంవత్సరాల కాలం పడుతుంది. ఆ సమయంలోనే అతని భవిష్యత్తును గురించి ఊహించవచ్చును. ఉదాహరణకు ఒక వ్యక్తి 'యం. బి. బి. యస్' చదువుతున్నప్పుడే అతను 'డాక్టరు' అవుతాడని ఊహించవచ్చును కదా!

అర్హుడైన వ్యక్తి ఉన్నత పదవులను పొందినప్పుడే — అది కొన్ని సంవత్సరాల క్రిందట ఊహించడానికి కూడా వీలులేని విషయం అని అనవలసివస్తుంది.

ఇది ఆమె విషయంలో పూర్తిగా నిజం.

వ్రహ్మా కుమార్తె కావడం తప్ప భారత దేశానికి ప్రధానమంత్రి కావడానికి ఆమెకు యే అర్హతా లేదు. అందుచేత ఆమె ప్రధాన మంత్రిణి అవ్వతుంది' అని కొన్ని సంవత్సరాల క్రిందట యెవరూ ఆలోచించడానికి కూడా వీలులేకపోయింది.

ఏ అర్హతా లేకుండానే తాను ప్రధాన మంత్రిణి అయింది. కాబట్టి మిగిలిన ఉన్నతోద్యోగాల్లో ఉన్నవారు కూడా తన వంటి అనర్హులేనని ఇందిరాగాంధి అనుకొంటూ ఉన్నది. అందుచేతనే వీరు యీ ఉన్నతోద్యోగాలను పొందడం అనేది కొన్ని సంవత్సరాల క్రిందట ఆలోచించడానికి కూడా వీలులేని విషయం అని ఆమె అన్నది.

ఈ పరిస్థితిలో ప్రధానమంత్రిణి ఇందిరాగాంధికి—

'తనవద్ద బంగారం ఉంటే, అందరి వద్దా బంగారం ఉంది' అని అనుకొన్న రత్తయ్యకు తేడా యేమిటి?

ఒక్కమాట మాత్రం నిజం. చాణక్యుడు, చంద్రగుప్తుడు, శ్రీ కృష్ణదేవ రాయలు, శివాజీవంటి మహానుభావులు పరిపాలించిన భారతదేశాన్ని ఇందిరాగాంధి వంటి వివేకహీనురాలు పరిపాలిస్తుంది' అని కొద్ది సంవత్సరాల క్రిందట యెవరూ కూడా ఆలోచించలేకపోయారు' అని అన్నాడు చూడామణి.

'ఇందిరాగాంధి వివేకహీనురాలు అని నువ్వు యెలాగ చెప్పగలవు?' అని చిదంబరం ప్రశ్నించగా, చూడామణి చెప్పడం ప్రారంభించాడు.

'1970వ సంవత్సరం జూలై నెలలో —బాన్‌కు చెందిన 'జర్మన్ యింటర్నేషనల్' అనే పత్రికకు ప్రధాన మంత్రిణి ఇందిరాగాంధి యింటర్వ్యూ యిచ్చింది.

'భారతదేశం అంతకంతకు మాస్కోకు చేరువ అవుతున్నది' అనే వాదాన్ని ఆమె ఆ సందర్భంలో తిరస్కరించింది. 'నిజానికి మాస్కోయే భారతదేశానికి చేరువ అవుతున్నది' అని ప్రధానమంత్రిణి ఇందిరాగాంధి అప్పుడు అన్నది.

'భారతదేశం మాస్కోకు చేరువకావడం లేదు కాని మాస్కోయే భారతదేశానికి చేరువ అవుతున్నది' అని ఆమె అనగానే నాకు ఒక సంఘటన జ్ఞాపకానికి వచ్చింది' అంటూ చూడామణి చెప్పడం ప్రారంభించాడు.

'ఒక యేటిగట్టున కొన్ని యిళ్ళు ఉన్నాయి. ఒకప్పుడు ఆ యేరు పొంగి యిళ్ళను ముంచి వేసింది. అప్పుడు ఆ యిళ్ళలో ఉన్న సామానులు యేటిలో కొట్టుకొని పోయింది.

అప్పుడు ఒక యిత్తడి బిందె, మట్టి కుండ యేటిలో తేలుతూ వెడుతున్నాయి. కుండ బిందెను చూసి దూరంగా వెళ్ళిపోసాగింది.

బిందె కుండతో యిలాగ అంది. 'మిత్రమా! దూరంగా వెళ్ళిపోవడం యెందుకు? దగ్గరకు రా. మనం కబుర్లు చెప్పుకో వచ్చును.

'మిత్రమా! మనం దగ్గరగా ఉండడం నాకు శ్రేయస్కరం కాదు. నువ్వు నాకు తగిలినా నేనే పగిలిపోతాను. నేను నీకు తగిలినా, నేనే పగిలిపోతాను. అందుచేత నీకు దూరంగా ఉండడమే నాకు మంచిది' అని కుండ బదులుయిచ్చింది.

ముల్లువచ్చి అరటాకుమీద పడినా, అరటాకే చిరిగిపోతుంది. అరటాకు వెళ్ళి ముల్లుమీద పడినా, అరటాకే చిరిగిపోతుంది.

భారతదేశం మాస్కోకు చేరువ అయినా, మాస్కో భారతదేశానికి చేరువ అయినా కలిగే ఫలితం ఒక్కటే. భారతదేశం మాస్కోకు మరొక ఉపగ్రహ రాజ్యంగా మారిపోతుంది.

ఇటువంటి చిన్న విషయం కూడా ప్రధానమంత్రిణి ఇందిరాగాంధికి తెలియదు. అందుచేత మంత్రుల విషయంలో నేను చెప్పిన సంఘటనలను గురించి సందేహించడానికి అవకాశం యేమిటి ఉన్నది? అని ప్రశ్నించాడు చూడామణి. ●

## టానిక్

ఒక గుండె కలకలోన
ఒక గీతం మొలక,
ఈ గాయాల పూవుల్ని
గీతాల మాలగా కూర్చటం
ఆశా మధువుల్ని వంచటం
నిరసులకు పంచటం
ఇది నానిత్యకృత్యం.
నీవు విన్నా వినకున్నా
నీకు నరపుటిన్జెక్షన్ ఇచ్చి
నరుడిగా తయారు చేయటం నావృత్తి.
కాస్త వెనకా ముందూ చూసుకుని
బ్రతుకు చొక్కాకు సరిపోయేటట్లు
ఆలోచనల్ని కత్తిరించు కొమ్మనటం
శత విధాల
జీవితాన్ని విసిగించైనా
జీవించ మనటం
తప్పైతే క్షమించు,
నిజానికి దేవికైనా
నమ్మకం ఆంతస్సూత్రం.
అయితే అరువు తెచ్చుకున్న
అపనమ్మకం అల్లుడై
జీవితం మెడ జీవిల్ని
దిగ దొక్కుతుంది.
నా పాయింట్ ఒకటే!
నారసొగైనా సరే
ధ్యేయాన్ని లంకించుకోమనే,
సమస్య ఎప్పుడూ
పది తలల నాగేంద్రుడే
అయితే నేం
వాడి నెత్తినే ఉంటుంది
అమూల్యమైన మణి.
సమస్య సుంచే కాదు
అసలు దేన్నుంచైనా
పారిపోవటం
పరమ అసహ్యం.
కలలు కనటం
కన్నీళ్ళు పెట్టుకోవటం
మానవ సహజం! అలాగే
జీవితాన్ని ప్రేమించటం
మానవ నైజం కావాలి!

—కె. శివారెడ్డి

## వర్ధమానతార

# పద్మాంజలితో ఇంటర్‌వ్యూ



బాపు దర్శకత్వంలో వచ్చిన 'బంగారు పిచుక' చిత్రం ద్వారా ఒక చక్కని హాస్య భూమికలో పరిచయం కాబడిన కుమారి పద్మాంజలి—ఇపుడు శ్రీకాంత్ అండ్ శ్రీకాంత్‌వారి రంగుల చిత్రం 'పతి అనసూయ'లోను, కామాక్షి ఏజన్సీస్ వారి 'మా ఇలవేల్పు' లోను మరో రెండు మంచి భూమికలను పోషిస్తున్నది.

బంగారు పిచుకకీ, ఇవాళ నటిస్తున్న చిత్రాలకీ మధ్య కాలంలో ఆమె కన్నడ చిత్రాల తారగా మారింది. దాదాపు 15 చిత్రాల్లో నటించింది. కన్నడ చిత్రాలే కాదు, విజయవంతంగా నడిచిన 'చక్రసప్పం' మళయాళ చిత్రంలోనూ నటించింది—కథా నాయికగా... ఆ చిత్రం చూసినవారికి పద్మాంజలిలోని ప్రతిభ ఏపాటిదో అర్థం అవుతుంది.

ప్రతిభావంతురాలయిన నటేకాదు పద్మాంజలి; నాట్యంలో మంచి ప్రవేశం వున్న మంచి నర్తకి కూడాను. శ్రీ వెంపటి చినసత్యం వద్ద కూచిపూడి నాట్యాన్ని, శ్రీ నటరాజ రామకృష్ణవద్ద భరత నాట్యాన్ని ఎంతో సుశిక్షణతో అభ్యసించింది. ఆధునిక పాశ్చాత్య నృత్యాలనూ చక్కగా అవగాహన చేసుకున్న ఈ అమ్మాయి మాటల్లో సంస్కారం, మర్యాద వినయమూ ఉంటాయి.

> ## మీకు తెలుసా?
>
> నటి సరోజాదేవి రాబోయే మధ్యంతర ఎన్నికల్లో పాల్గొనడానికి తీరిక లేదని చెప్పింది. మైసూరులో ఆమెను నిలబడమని సి. కాంగ్రెస్, ఇ. కాంగ్రెసు కోరారట.
>
> హీరో కృష్ణ ఫిబ్రవరి 8 నుండి 28 వరకు థార్ ఎడారిలో ఉంటారట, సినిమా షూటింగు నిమిత్తం.
>
> నటి 'షావుకారు' జానకి కట్టించిన కొత్త బంగళా ఆవరణలో నాలుగు గంధపు చెట్లతోటను వేశారట.

ఎస్. ఎస్. ఎల్. సి. చదువుతూ మానేసిన పద్మాంజలి కర్నూలు జిల్లాలోని నందికొట్కూరు గ్రామంలో జన్మించింది. చిన్నప్పట్నుంచీ సినిమాలన్నా, నృత్యాలన్నా ఎంతో ఆసక్తి కనపరుస్తూ ఉండేది. వచ్చిన సినిమా విడిచిపెట్టకుండా చూసేది. అలాగే ఏ నాట్య ప్రదర్శనం జరిగినా హాజరయ్యేది.

ఆ ఉత్సాహమే — పద్మాంజలి సినిమాల్లోకి రావటానికి కారణమయింది, నటిగా స్థిరపడటానికి దోహదం చేసింది. పద్మాంజలితో అయిదేళ్ళుగా నాకు పరిచయం వున్నది. ఆ నాటికీ ఈనాటికీ ఆమెలో ఎంతో మార్పు వచ్చింది. మనిషిలో కాదు, వయసులో, అందంలో, నాజూకులో.

ఆకర్షించే చక్కని శరీర సౌష్టవంతో, పచ్చని శరీరంతో, రెండు పదులు నిండిన వయసులోకి అడుగుపెట్టి, అయిదున్నర అడుగుల పొడవయింది ఇవాళ పద్మాంజలి. తీరికవేళల్లో సినిమాలు చూడటం, పుస్తకాలు చదువుకోవటం ఈమె సరదాలు.

'సాఫ్ట్ రోల్స్, సరదాగా, అల్లరిగా వుండే కారెక్టర్లు వెయ్యటం నాకెంతో యిష్టం. అలాంటి పాత్రలు లభించినపుడు వాటికి న్యాయం చెయ్యటంకోసం నిర్విరామంగా కృషి చేస్తాను,' అంటుంది పద్మాంజలి.

ప్రస్తుతం అనసూయ, మా ఇలవేల్పు తెలుగు చిత్రాలతో పాటు — బి. సరోజాదేవితో 'పూర్తిగు' అనే కన్నడ చిత్రంలో కూడా నటిస్తున్న ఈ అమ్మాయికి చక్కని వేషాలిచ్చి ప్రోత్సహించటంలో ఎంతో ఔచిత్యం ఉంటుంది.

ఫోటో: ప్రభాకర్

ఇంటర్వ్యూ: మోహన్‌కుమార్ ●



'మనసు మాంగల్యం'లో జమున, జగ్గయ్య, మణిమాల.

చిత్రసమీక్ష

# మనసు-మాంగల్యం

కాలంతోపాటు మనుషులు మారుతున్నారు. మనుషులతోపాటు మనసులు ఎదుగుతున్నాయి. వాటితోపాటే ఆచార వ్యవహారాలూ నాగరికతానూ.

స్త్రీకి మాంగల్యం అతిపవిత్రమైనది. మనసెంత ప్రధానమో మాంగల్యమూ అంతే ప్రధానం. ఇలాంటి అన్ని ధర్మాల తోను నిర్మించిన ఉత్తమ చిత్రవారి 'మనసు—మాంగల్యం' చిత్రం స్త్రీకి తాళిగట్టినవాడే భర్తకావవసరం లేదు— అనే థియరీని ఎంతో వివేకమైన రీతిలో ప్రబోధిస్తుంది!

వినడానికి యాంటీసెంటిమెంటుగా అనిపించినా చిత్రం చూస్తుంటే అలా కనిపించదు. అదే ఈ చిత్రంలో కథా వస్తువు గొప్పతనం!

జమునలో ఆంధ్రుల ఆడపడుచుతనం వుట్టిపడుతుంది. సెంటిమెంటును కాపాడుతూ స్త్రీలను విశేషంగా ఆకర్షించే జమునపాత్ర—ఆ పాత్రలో ఆమె నటనా వైదుష్యం చిత్రాన్ని సజీవం చేసిందని చెప్పాలి.

నాగేశ్వరరావు పాత్రలో సరికొత్త నాగేశ్వరరావును చూడగల్గడం ఈ చిత్రంలో మరో ప్రత్యేకత. అతని నటన ఎంతో హృద్యంగమంగా వుంది.

భావకవి పాత్ర ఎప్పుడొస్తుందా? అని ప్రేక్షకులు ఎదురు చూసేంత అహ్లాదంగా వుంది పద్మనాభం హాస్యం. ఎంతో క్లిష్టమైన పాత్రని జనరంజకంగా మెప్పించారు అంజలీదేవి. విలన్‌లా కనిపించే పాత్రలో జగ్గయ్య నటన ఉత్తమంగా వుంది. జగ్గయ్య భార్యగా మణిమాల పాత్ర ప్రేక్షకుల సానుభూతిని బాగా చూరగొంటుంది. మంచి తారాగణమున్న ఈ చిత్రంలో తదితర ముఖ్యపాత్రలని నాగయ్య, రఘునారెడ్డి, రామకృష్ణ, చంద్రమోహన్, అనిత, సూర్యకాంతం మొదలైనవారు ప్రతిభావంతంగా పోషించారు.

ఆచార్య ఆత్రేయ మాటలు చిత్రానికి ప్రాణం! పెండ్యాల నాగేశ్వరరావు సంగీతం చాల బాగున్నది. దాశరధిగారి 'ఏ శుభసమయంలో' 'ఆవేశం రావాలి' పాటలు అగ్రశ్రేణిలో వున్నాయి.

కె. శ్రీనివాసరావు కథని ఆదినుంచి చివరిదాకా రసభరితంగా పటుత్వంగా చిత్రీకరించిన కె. ప్రత్యగాత్మ విశేషకృషిని అభినందించి తీరాలి.

నిర్మాత కోగంటి కుటుంబరావు ఉత్తమాభిరుచి ఈ చిత్రంద్వారా వ్యక్తమవుతుంది. సకుటుంబంగా చూడతగ్గ ఒక మంచి కథాచిత్రాన్ని అందించినందుకు నిర్మాత బహుధా ప్రశంసార్హులు. శ్రీ ఫిలింప్ రిలీజ్.

—సితరాజు ●

# సినిమా

## సుభాషిణి ఆర్ట్ పిక్చర్స్‌లో ఎన్. టి. ఆర్. వాణిశ్రీ

'ఆడపడుచు' చిత్రనిర్మాత, 'కథానాయకుడు' నిర్దేశకుడు, 'సుభాషిణి' ప్రివ్యూ థియేటరు యజమాని అయిన కె. హేమాంబరధరరావు మంచి కథావస్తువు దొరికినప్పుడే చిత్ర నిర్మాణానికి ఉపక్రమించడం ఆదినుండి అలవాటు చేసుకోవడంవల్లనే, ఆయన తీసే చిత్రాలు చక్కగా వుంటాయనే అభిప్రాయం ప్రేక్షకుల్లో యేర్పడింది. ఫిబ్రవరి 10 న ఈ సంస్థ మరొక చక్కటి సాంఘిక చిత్రాన్ని ప్రసాద్ స్టుడియోలో ప్రారంభిస్తుంది.

## ప్రధాన పాత్రలో సుమ

బాలమురుగన్ వ్రాసిన కథకు, ముద్దపట్ల సూరి, ఆదుర్తి నరసింహమూర్తి జాయింటుగా సంభాషణలను సమ



'నమ్మిన ద్రోహులు'లో కృష్ణ, విజయశ్రీ.



'జబ్బకుతా దొంగలముఠా'లో రంగారావు.

...వార్యాదు, సంగీతాన్ని చలపతిరావు, ఛాయాను శేఖర్ అండ్ సింగ్, శిల్పాన్ని వి. ఎస్. కృష్ణ, కూర్పును గోపాలం నిర్వహించే యీ చిత్రానికి హేమాంబరధరరావు దర్శకుడు. ఈ చిత్రంలోని ప్రధానపాత్రలను ఎన్టి రామారావు, వాణిశ్రీ, నాగభూషణం, పద్మనాభం, ధూళిపాళ, రావికొండలరావు, రాధాకుమారి పోషిస్తున్నారు. రామారావుకు చెల్లెలిగా నటించే అవకాశం సుమకు రావడం ఆమె

# సినిమా

వెండితెర జీవితంలో కొత్త మలుపును తెచ్చిపెడుతుంది.

* * *

దర్శక నిర్మాత శ్రీ హేమాంబరధరరావు దగ్గర న్యూస్ తీసుకుని రాబోతున్న నాకు ఎస్. ఎ. ఏస్. జగన్నాధరావు, దర్శకుడు విశ్వనాద్, సుభాషిణి థియేటర్ ముఖద్వారంవద్ద కనిపించారు. 'గుడ్ ఈవినింగ్ సార్. మీ పిక్చర్ చూడొచ్చా' అని అడిగాను. 'ఓ. ఎస్.' అన్నారు నిర్మాత. ప్రివ్యూ థియేటర్లోకి వెళ్ళాను. 'నిండుదంపతులు' నెగటివ్ కట్ చేసిన ప్రింటు చూసాను. కథలో టెంపో, కధ నడకలో స్పీడు, మాటల్లో మాధుర్యం, సంగీతంలో సారస్యం, ఛాయాగ్రహణంలో నైపుణ్యం సమపాళ్ళల్లో రంగరించుకున్న యీ చిత్రాన్ని దర్శకుడు శ్రీ విశ్వనాద్ సర్వజనరంజకంగా వుండేట్టు సన్నివేశాలను చిత్రీకరించారు.

## విలాసమందిరంలో అక్కినేని, లక్ష్మీఛాయ

'నిండుదంపతులు' చిత్రం చూసిన తర్వాత, వాహిని స్టుడియోకి వెళ్ళాను. ఆరవ ఫ్లోర్‌లోకి అడుగుపెట్టాను. అది ఒక విలాసమందిరం. ఏ ప్రక్క చూచినా అందమైన అమ్మాయిల ఛాయాచిత్రాలు కనిపించాయి. వజ్ర వైడూర్యాలతో నిర్మించబడిన మందిరమా అనే భావాన్ని కలిగించింది. ఆ గదిలో యేమిటి విశేషం? యెవరున్నారు అక్కడ? అని నాకు, మీకు తెలియాలిగా.

హీరో నాగేశ్వరరావు చేతిలో ఒకే నిమిషంలో అన్నింటిని యిచ్చే 'దివ్య ఔషధం' వుండడాన్ని చూచాను. ఆ టానిక్‌ను హీరో గారు మంచినీళ్ళ ప్రాయంగా త్రాగుతున్నారు. ఆయన సరసన ఒక పదహారేళ్ళ నవమోహిని, తన చిలిపి చేష్టలతో, వలపు చూపులతో ఆడుతూ, పాడుతూ వుంది. ఆమె యెవ్వరో? బొంబాయినుండి వచ్చిందట. ఆమె అక్కడ పేరుమోసిన నర్తకి అట. పేరు లక్ష్మీఛాయ. ఆమె ఆటలో ఆకర్షణ కనిపించింది, పాటలో ప్రేమభావం పలికింది.

"వుంటే యీ వూళ్ళో వుండు
పోతే మీ దేశం పో
చుట్టుప్రక్కలున్నావంటే
చూడకుండా ప్రాణముండదురా"

అంటూ హీరో నాగేశ్వరరావులో నిద్ర ఆవేశాన్ని రేకెత్తించింది. అక్కినేని ఆమెను తన వాడిలోకి తీసుకున్నారు. 'కట్' అన్న ప్రకాశరావుగారి కంఠం వినిపించడంతో, ఓ. కే. అన్న పలుకు

# సినిమా డైరీ

● పి. ఎస్. ఆర్. పిక్చర్స్‌వారి క్రయిమ్ పిక్చర్ షూటింగు జనవరి 22 నుండి 26 వరకు శారదా స్టూడియోస్‌లో జరిగింది. కె. ఎస్. ఆర్. దాస్ దర్శకత్వంలో కె. ఎస్. రెడ్డి నృత్యశిక్షణలో కిస్ మిస్ పాల్గొన్నది.

● సురేష్ మూవీస్‌వారి కలర్ చిత్రం ప్రేమనగర్ జనవరి 22న వాహిని 8వ ఫ్లోర్‌లో ప్రారంభమైంది. బి.నాగిరెడ్డిగారు క్లాప్ కొట్టారు. డి.సురేష్ స్విచ్ ఆన్ చేసారు. కె.ఎస్.ప్రకాశరావు అధ్వర్యంలో హీరో అక్కినేని మరియు చిత్రంలోని పాత్రధారులందరూ పాల్గొన్నారు.

● ఉష శ్రీ వారి విచిత్ర దాంపత్యం షూటింగు జనవరి 24 నుండి 26 వరకు జరిగింది. హీరాలాల్ సారథ్యంలో, చంద్రశేఖరరెడ్డి పర్యవేక్షణలో శోభన్, విజయనిర్మల నటించారు.

● సావిత్రి కంబైన్స్‌వారి వింత సంసారం షూటింగు జనవరి 18 నుండి ఫిబ్రవరి 6 వరకు జరుగుతూ వున్నది. సావిత్రి దర్శకత్వంలో జగ్గయ్య, రమాప్రభ, రాజబాబు, అల్లు రామలింగయ్య, సాక్షి రంగారావు, ప్రభాకరరెడ్డి, రామ్మోహన్, సి.హెచ్. నారాయణరావు, లీలారాణి, సంధ్యారాణి అండ్ సావిత్రి పాల్గొన్నారు

● ఎస్ వీ ఎస్ పిక్చర్స్ నిండు దంపతులు ఫిబ్రవరి 4 న జ్యోతిపిక్చర్స్‌ద్వారా విడుదలవుతుంది. దర్శకుడు శ్రీ విశ్వనాద్

వెంకటరత్నంగారి నోటి వెంట వచ్చింది. ఈ పాటను ఆచార్య ఆత్రేయ రచించగా, సుశీల గొంతు మహదేవన్ సంగీత సారధ్యంలో తీయగా పలికింది. ఈ శృంగార ఘట్టం సురేష్ మూవీస్‌వారి కలర్ చిత్రం 'ప్రేమనగర్'లో కనిపిస్తుంది. డి. రామానాయుడు భారీ యెత్తున నిర్మించే యీ చిత్రంలో నాగేశ్వరరావు నాయకుడు. వాణిశ్రీ నాయిక. నవయుగ విడుదల.

## జగ్గయ్య షష్ఠి పూర్తి

వాహిని నుండి ఏ. వి. ఎం.కు వెళ్ళాను. నాల్గవ ఫ్లోర్‌లోకి ప్రవేశించాను. అది పెద్దహాలు, హాలు నిండా కుర్చీలు అమర్చబడి వున్నాయి. ఎక్కడ చూచినా తోరణాలయం. అమ్మలక్కలు, అయిన వాళ్ళ యిండ్లకు పేరంటానికి వెళ్ళుతున్నారా అనిపించింది. ఒకామెను 'ఎక్కడికి వెళ్ళున్నారమ్మా' అని అడిగాను. జగ్గయ్యగారికి షష్ఠిపూర్తి వుత్సవం కోలాహలంగా జరుగుతూ వుంది. అక్కడికి వెళుతున్నాము అంది ఆ ముత్తయిదువ. అయితే ఆ కన్నులపండువయిన దృశ్యాన్ని నేనూ చూడాలనుకున్నాను. సెట్టులో పది నిమిషాలు ఆగానో లేదో గలగల గాజుల చప్పుళ్ళు వినిపించాయి. అందమయిన అమ్మాయిల నవ్వుల శబ్దం వచ్చిన దిశవైపు నా దృష్టిని మరల్చాను. హాలు మధ్యలో సావిత్రి, జగ్గయ్యగార్లను పీటల మీద కూర్చోబెట్టి, వాళ్ళిద్దరి చుట్టూ యిరవైమంది భామలు కోలాటపు కర్రలతో, కోలాహలంగా ఆట పాటల్లో మునిగి తేలుతూ వుండడాన్ని చూచి ఆ వృద్ధ దంపతులు ఆనంద బాష్పాలు రాల్చారు. జగ్గయ్య, సావిత్రిని చూచినప్పుడు అది దంపతులులాగా కనిపించారు. సరిగ్గా అదే భావాన్ని దాశరథి పాటలో వెల్లడించారు

'అది దంపతులు మీరు
పుణ్య దంపతులు మీరు
కలకాలం వర్ధిల్లాలి...ఆ...ఆ...'

ఈ రసవత్తరమైన సన్నివేశాన్ని 'వింత సంసారం' చిత్రానికిగాను సావిత్రి రమణీయంగా చిత్రీకరించింది.

వెను (?) క్షమిత చిత్రం 'వియత్నాం వీడు'



'విచిత్రదాంపత్యం'లో రాజబాబు మీనాకుమారికి తాళి కట్టబోతున్నాడా!

చూచాను. శివాజీకి యే మాత్రం తీసిపోని విధంగా జగ్గయ్యగారి వేషభాషలు వున్నాయి. ప్రెసిడెంట్ పద్మనాభం పాత్రలో జగ్గయ్యలో కొత్త అందం, ఆకారం, అభినయం కనిపించింది. పదిమంది కన్నా మిన్నగా వుంది సావిత్రి యొక్క కట్టు, బొట్టు; తెలుగు చిత్రాన్ని శ్రీమతి సావిత్రి, దిడ్డి శ్రీహరిరావులు నిర్మిస్తున్నారు. మల్లిపట్ల సూరి మాటలను కోదండపాణి సంగీతాన్ని, దండపాణి కూర్పును, శేఖర్ — సింగ్ ఛాయాగ్రహణాన్ని, బి. ఎస్. కృష్ణ శిల్పాన్ని నిర్వహిస్తున్న యీ చిత్రానికి సావిత్రి డైరెక్టర్.

## హోటల్ జాలీలో కిస్‌మిస్ డ్యాన్స్

ఏ. వి. ఎమ్. నుండి శారదాకి వెళ్ళాను. రెండవ ఫ్లోర్‌లోనికి అడుగు పెట్టాను. 'హోటల్ జాలీ' అనేది



'రాజకోట రహస్యం'లో సత్యనారాయణ, దేవికతో 'షమిటే' చెత్త

ద్దు కనిపించింది: ఈ హోటల్‌కు పెద్ద పెద్ద వ్యాపారస్థులు, విలాస జీవితాన్ని గడిపే పెద్దమనుష్యులు వస్తారని తెలిసింది. ప్రతిరోజూ అందమైన అమ్మాయిల డ్యాన్స్ ప్రోగ్రాము కూడా వుంటుందని తెలుసుకున్నాను. ఇంతకీ ఈ హోటల్ ప్రొప్రయిటర్ యెవరనుకుంటున్నారు? సినిమా నటుడు ప్రభాకరరెడ్డి. ఆయన అదే వూరితో మంచి ప్రాక్టీస్ వున్న ప్లీడరట. ఆయనే జాలీ హోటల్‌కు అధినేత అట. నేను కాస్సేపు ఆగాను. నవనాగరిక దుస్తులు ధరించిన యువతీ యువకులు జంటజంటలుగా వచ్చారు. హిప్పీల్లాంటి అబ్బాయిలు, జిప్సీల్లాంటి అమ్మాయిలు వచ్చి డైనింగ్ టేబిలు ముందు కూర్చుని టిఫిన్ తినడానికి వుపక్రమించారు. ఆడిటోరియం వంక చూసాను. జిగ్‌జిగేలు మనిపించే జవ్వని తన శరీరాన్నంతా వంచుతూవుంటే, ఆమె అవయవాల పొంగును హోటల్‌కు వచ్చిన జనమంతా కళ్లప్పగించి చూడసాగారు. ఆమె ఆటలో, పాటలో రసవట్టు గోచరించింది. ఆమె పేరు కిస్‌మిస్.

# సినిమా

'తీస్కో కోకాకోలా
ఏస్కో రమ్ము సారా
చూస్తే మజా, గుటకేస్తే నిషా
కలిపికొట్టు మొనగాడా' అంటూ

ఆమె తూలుతూ పాడుతూ ప్రతివాడిని రమ్మని పిలుస్తూ వుండడాన్ని చూచిన కె. ఎస్. ఆర్. దాస్ 'చాలు-కట్' అనడంతో దేవరాజ్, కె. ఎస్. రెడ్డి వున్న పళాన నిలచిపోయారు. పై పాటలోని మజాను కవి ఆరుద్ర, సంగీతసారధి సత్యం, గాయకి ఈశ్వరి కలిసి అందించారు. పింజల సుబ్బారావుగారి కుమారుడు నాగేశ్వరరావు నిర్మించే ఈ క్రయిమ్ థ్రిల్లర్‌లోని ప్రధాన పాత్రలను రామకృష్ణ, విజయలలిత, సత్యనారాయణ, రాజబాబు, ప్రభాకరరెడ్డి, జ్యోతిలక్ష్మి, త్యాగరాజు, రమాప్రభ, ధనశ్రీ, కిస్‌మిస్ పోషిస్తున్నారు.

## విజయలలిత హితబోధ

అదే స్టూడియోలోని మూడవ ఫ్లోర్



'అత్తనుదిద్దిన కోడలు'లో
కె. యస్. రామారావు, గీతాంజలి

లోకి వెళ్లిన నాకు విజయలలిత తారసపడింది. ఏమిటమ్మా, యిక్కడున్నావ్? అని అడిగాను: 'ఏం చెయ్యమంటారు? మొన్ననే ఎం. ఏ. డిగ్రీ పుచ్చుకున్నాను. మనదేశంలో జరుగుతున్న అక్రమాలను, అత్యాచారాలను అరికట్టడం యెలా సాధ్యం అని ఆలోచించాను. నాలాంటి చదువుకున్నవాళ్లు దేశంకోసం కొన్ని కష్టాలు ఎదుర్కోవాలి; సంఘంలోని చీడపురుగులను నీతి మండపానికి పంపించాలి.' అందుకే ఈ జిప్సీ వేషం ధరించాను' అంటూ వుండగా 'కమాన్ షాట్ రెడీ' అనేడి పిలుపు వినపడడమే తరువాయి, విజయలలిత చెంగు చెంగున యెగురుతూ సెట్లోకి వెళ్లింది. నేను కూడా ఒకమూలగా కూర్చున్నాను.

'వేషం వేషం రయ్యో
అంతా మోసం రయ్యో
మోసంచేసే దగాకోరునే
మొనగాడంటారయ్యో

లేతే మొనగాడంటరయ్యో' అంటూ విజయలలిత అక్కడ గుమికూడిన ప్రజలకు హితబోధ చేసింది. ఈ గొడవ అంతా



'తప్పుకాదు-బాబూ ...', వెనుక అక్కినేని నాగేశ్వరరావు, శాంత... వెనుక విజయభాను

పూర్ణా ఆర్ట్స్ పిక్చర్స్‌వారి 'కూతురే కోడలు' చిత్రంలో కనిపిస్తుంది. అట్లూరి పూర్ణచంద్రరావు, జి. చంద్రశేఖర్ నిర్మిస్తున్న ఈ చిత్రంలో శోభన్‌బాబు కథానాయకుడు. ఏమిటండీ టైటిల్ యేదోలాగుంది, అని నిర్మాత పూర్ణచంద్రరావును అడిగాను. 'ఒక ప్రమాదంలో విడిపోయిన తల్లీ బిడ్డలు వేర్వేరుచోట్ల పెరిగి పెద్దవారవుతారు. తన తల్లి గారాబంగా పెంచిన కుమారునికి వేరేచోట పెద్దదైన స్వంతకూతురు భార్యగా వస్తుంది. తనుగన్న కూతురే విచిత్రపరిణామ పర్యవసానంగా తన పంచన పెరిగిన కుమారునికి అర్ధాంగిగా అవగా తనకు కోడలు వచ్చిన వింతకథ. అందుకే 'కూతురేకోడలు' టైటిల్ పెట్టాము, అని జవాబిచ్చారు పూర్ణచంద్రరావు.

## సెట్‌లో యమునానదీతీరం

శారదానుంచి వీనస్‌కు వెళ్ళాను. నేను వెళ్ళిన సమయానికి ఉషశ్రీ నిర్మాత చిన్నపరెడ్డి హడావిడిగా యెక్కడికో పయనం కాబోతూ, నన్నుచూచి 'సెట్టుకు వెళ్ళండి' అయిదు నిమిషాల్లో నేను వస్తాను' అని చెప్పారు. సెట్లో యమునా నదీతీరాన్ని చూడగలిగాను. రాధ వేషంలో విజయనిర్మలను చూసాను. కృష్ణుడు కనిపించలేదేం? అని ప్రొడక్షన్ నరసింహారావుకు అడిగాను. ఇంకా స్పాట్లో కనిపిస్తారన్నాడు. ఏమిటీ దృశ్యం అని సహాయ దర్శకుడు మన్నెం రాధాకృష్ణను అడిగాను. 'రాధామాధవుల ప్రణయ పురాణం' అన్నాడతను. ఇలాంటి స్వప్నదృశ్యం 'విచిత్రదాంపత్యం'లో కనిపిస్తుంది.

విజయనిర్మల రాధగా తన్ను వూహించుకుని, తన భర్త శోభన్‌బాబును కృష్ణుడి రూపంలో తలపోస్తూ, తియ్యటి కలలో వూగిసలాడుతుందట. ఈ స్వప్నదృశ్యానికిగాను కవి నారాయణరెడ్డి ఒక కమ్మటి పాట వ్రాసారు.

"నా మనసే వీణియగా పాడనీ
నీ వలపే వేణువుగా మ్రోగనీ."

ఈ పాట చిత్రీకరణ జరిగిపోతే, షూటింగు దాదాపు పూర్తయినట్లే అన్నారు నిర్మాత చిన్నపరెడ్డి. ఈ చిత్రానికి పి. చంద్రశేఖరరెడ్డి దర్శకుడు.

## సోమరిపోతు

[illegible]

నిండా తినడం, తనివితీరా నిద్రపోవడం తప్ప మరొకటి తెలియదతనికి. ఎక్కడ పడితే అక్కడ నిద్రపోతాడు. ఒకరోజు యింటినుండి బయల్దేరి ఒక చెరువు గట్టుకు వెళ్ళాడు. అక్కడే పడుకుని గుర్రుపెట్టి నిద్రపోసాగాడు. ఒక నాగుపాము అతని తలవద్ద పడగవిప్పి నాట్యం చేస్తూవుంది. మాంచి నిద్రలోవున్న చలానికి పామువున్న సంగతి యెలా తెలుస్తుంది. ఆ చెరువులో నీళ్ళ పట్టు

# సినిమా

శిక్షా ముగిసి వచ్చిన వెన్నెరబడ్డె నిర్మల ఆ భయంకర దృశ్యాన్ని చూచింది. సీమకు భక్తిపూర్వకంగా నమస్కరించింది. ఆ సీమ తిన్నగా తప్పుకుంది. 'బావా, బావా' అంటూ నిర్మల అరిచింది. అప్పటికి మెలకువ వచ్చింది బలానికి, 'ఏమిటి బావా, ఎంత ఘోరం జరగబోతుందో తెలుసా' అంటూ జరిగినదంతా చెప్పింది. అంతేకాదు. తన బావ యొక్క సుగుణాలను పొగుడుతూ పాడసాగింది.

పులకరించిన విరగబోడ
అపురూపమైన వదలబోడ
వాడే నా మొగుడు
సోమరిపోతులకు వాడే సరదా కులే

అంటూ వెన్నెరబడ్డె నిర్మల పాడిన పాటను నారాయణరెడ్డి వ్రాయగా, వెంకటేష్ అధ్వర్యంలో సుశీల కల్పనా చిత్ర వారి 'సోమరిపోతు' చిత్రానికిగాను పాడింది. భమిడిపాటి కథ, మాటలను వ్రాసిన ఈ చిత్రం నవ్వులజల్లును కురిపిస్తుంది. వి. రామచంద్రరావు దర్శకత్వాన్ని, కె. ఎస్. ప్రసాద్ ఛాయను నిర్వహించారు. కె. బాబూరావు నిర్మిస్తున్న ఈ చిత్రంలో జ్యోతిలక్ష్మి ఒక కొత్త తరహా పాత్రను నిర్వహించింది. పూర్తి విడుదల.

-శ్రీనివాస్

టి. ఆర్:

# నేషనల్ బుక్ ట్రస్ట్ అధ్వర్యంలో సమ్మేళనం

నేటి తెలుగు కవిత కొంత సాంప్రదాయిక పద్ధతిలో నడుస్తున్నది. మరికొంత మధ్య మార్గంలో కొనసాగుతున్నది. అత్యాధునిక కవిత్వం కేవలం తిరుగుబాటు రూపంలో ప్రతిధ్వనిస్తున్నది. ఈ కవిత అంతా సాంప్రదాయిక ఛందస్సులలో, గేయాలలో, కేవలం వచనంలో వేర్వేరు విధాలుగా వెలువడుతూ, విభిన్న దృక్పథాలున్న పాఠకుల, శ్రోతల మన్ననలందుకుంటున్నది. కొంతమందికి బాగా వెగటు కూడా కలిగిస్తున్నది. ఇది ఈనాటి ఆధునిక కవిత పరిస్థితి. అతిత్వరితంగా విలువలు మారిపోతున్న మన సమాజంలో ఇది చాలావరకు సహజమే.

జనవరి 1వ తేదీన మదరాసులో యూనివర్సిటీ ఎక్జామినేషన్ హాలులో జరిగిన కవి సమ్మేళనం దీనికొక చక్కని తార్కాణం. ఇది నేషనల్ బుక్ ట్రస్ట్ నాలుగవ ప్రదర్శన సందర్భంలో రచనసంస్థ ఏర్పరచిన సమావేశం. ఈ సంస్థ కార్యదర్శి బి. యస్. ఆర్ కృష్ణ ఈ సమ్మేళనం ప్రారంభిస్తూ స్వాగతం చెప్పారు. విద్వాన్ విశ్వం దీనికి అధ్యక్షత వహించారు.

శ్రీశ్రీ, పి. గణపతిశాస్త్రి, తిరుమల రామచంద్ర, ఆరుద్ర, దాశరధి, నారాయణరెడ్డి, చల్లా రాధాకృష్ణశర్మ, విద్వాన్ విశ్వం, హేమలత, లలితాపీటర్స్ ఈ సమావేశంలో పాల్గొన్నారు. సుప్రసిద్ధ నేపథ్యగాయకులు పి. బి. శ్రీనివాస్ నాటి సమ్మేళనంలో పాల్గొన్న కవులొక్కొక్కరిని అభినందిస్తూ తమ రచన శ్రావ్యముగా పాడి వినిపించారు. ఈ సమ్మేళనానికి ప్రారంభంలో నేటికాలపు కవితను గురించి లలితాపీటర్స్ సంగ్రహంగా ప్రసంగించారు. కవి సమ్మేళనం ముగిసిన తరవాత యుడవల్లి రమ భరతనాట్యం జరిగింది. దీనితో ఆ నాటి కార్యక్రమం ముగిసింది.

తను ఘాతుకచర్యలన్నీ విరమించి నలుగురితోను కలిసి రావలసిందని తీవ్ర హింసావాదులనుద్బోధిస్తూ ఆరుద్ర మొట్టమొదట చదివిన వచన కవిత శ్రోతల నాకట్టుకున్నది. శ్రీశ్రీ అత్యాధునిక కవుల రచనల ఆంగ్లానువాదాలు కొన్ని చదివి వినిపించారు. దాశరథి, నారాయణరెడ్డి, విద్వాన్ విశ్వం తమ సరికొత్త రచనలతో సభ్యుల నలరించారు. తిరుమలరామచంద్ర తాము రచించిన సంస్కృత శ్లోకాలు కొన్ని చదివి వినిపించారు. పి. గణపతిశాస్త్రి తమ గేయాలు కొన్ని పదస్వుల కందించారు. చల్లా రాధాకృష్ణశర్మ చక్కని సూక్తులు కొన్ని సంప్రదాయ కవితా రూపంలో సభ్యుల కెరుకపరిచారు. హేమలత హిందీ కవితలందించారు.

ఇలాగ కేవలం సంప్రదాయ పద్ధతి మొదలుకుని, అత్యాధునిక హింసాత్మక విప్లవ ధోరణి దాకా విస్తరించిన ఆధునిక కవిత ఈ సమావేశంలో ప్రతిధ్వనించింది. మద్రాసులో చాలామంది సహృదయులీ సమ్మేళనానికి విచ్చేసి, ఆయా ధోరణుల కవితలన్నీ శ్రద్ధగా ఆలకించారు. ఇలాగ ఇంద్ర ధనస్సులాగ, వేర్వేరు వన్నెల కవితలందించిన ఈ సమావేశం చెన్నపురిలో ఇటీవల జరిగిన సారస్వత సదస్సులన్నిటిలోను ఎన్నదగిన కవి సమ్మేళనంగా రూపొందింది.

—శాస్త్రి.

## కుమారి కళ్యాణి నృత్య ప్రదర్శనం

సంగీత విద్వత్ సభ, కళావాణి [రిజిష్టర్డు] ఆధ్వర్యాన కాకినాడ సూర్యకళామందిరంలో కుమారి కళ్యాణి నృత్య ప్రదర్శనం జరిగింది. సంగీత విద్వత్ సభ అధ్యక్షులు ఆమెకు సభవారి కానుక నందజేశారు.

శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి విరచితమయిన కోలు నైతివా రంగస్వామి, త్యాగరాజకృతి తెర తీయగరాదాలో అభినయం, తరంగం, పూర్వరంగం, భామకలాపం, సత్యభామా సాంత్వనం, దశావతారాలు, పదం, గోపికాకృష్ణ అంశాలని ప్రదర్శించింది.

శ్రీ మల్లిక్, శ్రీమతి రమాదేవి గాత్రం, వెంపటి ముక్తేశ్వరరావునట్టువాంగం, కె. కామేశ్వరశర్మ వీణ, కోదండం మృదంగం, గోపాలశర్మ వయొలిన్, వెంకటేశన్ ఫ్లూట్ మేళవించారు. [కు. వి.]

## చి॥ తాత భానుమతి వీణాగానం

ఉగాది కల్చరల్ ఎకాడమీవారి సంక్రాంతి ఉత్సవాల సందర్భంలో చిరంజీవి తాత భానుమతి వీణ కచేరి జరిగింది. సుమారు రెండున్నర గంటల పాటు జరిగిన ఈ కచేరి శ్రోతల్ని ముగ్ధులని చేసింది. చిరంజీవి భానుమతి ఉగాది కల్చరల్ ఎకాడమీ అధ్యక్షులు శ్రీ తాత వి. ఎస్. సోమయాజులుగారికుమార్తె. కాన్వెంట్‌లో ఎనిమిదవ తరగతి చదువుకుంటున్నది. పదకొండేళ్ల ప్రాయంగల ఈ బాలిక గత మూడేళ్ళుగా వీణని అభ్యసిస్తున్నది. ఈ కొద్ది కాలంలోనే చక్కని ప్రావీణ్యాన్ని సంపాదించిన చి. భానుమతి భవిష్యత్తులో మంచి వైణిక విద్వాంసురాలు కాగలదని ఆమె కచేరి విన్నవారెవరికైనా అన్పించడంలో అతిశయోక్తి లేదు. (కు. వి.)



చిరంజీవి తాత భానుమతి

## జమునయింట్లో విందు

తమతోపాటు పని చేసిన యూనిట్‌కి విందు చేయడం తారల చరిత్రలో కొత్తకాదు గాని— యూనిట్‌తో పాటు పత్రికా విలేఖరులను కూడా సమావేశ పరచడం ఒక ప్రత్యేకతే! ఈ ప్రత్యేకతని, రిపబ్లిక్‌డేనాడు జమున నిల్పుకున్నారు. మనసు—మాంగల్యం చిత్రం విడుదలయిన సందర్భాన్ని పురస్కరించుకొని ఆరోజున జమున తమయింటి వద్ద చిత్రం యూనిట్‌కి, పత్రికా విలేఖరులకు షడ్రసోపేతమైన విందును ఏర్పాటు చేశారు. తను పనిచేసే ప్రతిచిత్రం యూనిట్‌కి ఇలాంటి, విందును ఏర్పాటు చెయ్యనున్నట్లు జమున ప్రకటించారు. వారితోపాటు పత్రికా విలేఖరులను కూడా గౌరవించడం ఆమె అభిమానానికి మంచి నిదర్శనం... —సి.

## 'కళారాధన' నృత్య ప్రదర్శన

సంక్రాంతినాడు నిప్పు సర్వీస్ మెన్స్ అసోసియేషన్ వారి సహాయార్థం కడపలో కళారాధన వెరైటీడాన్స్ పార్టీవారు జిల్లాకలెక్టరు, డి. ఎస్. పి., పలువురు పురప్రముఖుల సమక్షంలో సుమారు మూడు గంటల సేపు వివిధ రకాల నృత్యాల ని ప్రదర్శించారు. కూచిపూడి క్లాసికల్, జానపద, పాశ్చాత్య నృత్యాలు సోది, పాము మొదలైన అంశాలతో నిండి ఉన్న ఈ నృత్య ప్రదర్శన ప్రేక్షకులకి ఆసక్తి కలిగించింది. అసోసియేషన్ వారు డి. ఎస్. పి, గారి అధ్యక్షతన హాస్య నటుడు శ్రీ అల్లురామలింగయ్యకిసన్మానం చేశారు. —[ఒ. వి.]

* * *

శ్రీ దుర్గా నాట్య కళామండలి, చిక్కడపల్లి, హైదరాబాదు, 24 వ వార్షికోత్సవం ఇటీవల రవీంద్ర భారతిలో జరుపుకున్నది. ఈ వార్షికోత్సవమునకు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సమాచార మంత్రి శ్రీ అక్కిరాజు వాసుదేవరావు అధ్యక్షత వహించారు. మండలి 24వ వార్షికోత్సవ సూచనగా, 24 జ్యోతులను ప్రముఖ రంగస్థల సినీ నటులు శ్రీ కె. రఘురామయ్యగారి కుమార్తె శ్రీమతి సత్యవతి వెలిగించడంతో సభ ప్రారంభమయింది. మండలి అధ్యక్షులు సి. కమలాకర రావు స్వాగతం చెప్పారు. శ్రీ కె. రఘురామయ్య మండలి ప్రచురించిన సంచికను ఆవిష్కరించారు. కార్యదర్శి ఏలా సుబ్బారావు నివేదికను సమర్పించారు. సహాయ కార్యదర్శి ఏ. పి. పి. వి. సత్యనారాయణ వందన సమర్పణ చేశారు. అనంతరం మండలి సభ్యులు శ్రీ చిల్లర భావన్నారాయణ రచింప బడిన గుడిగంటలు నాటకాన్ని ప్రదర్శించారు.

## తెలుగు కవిత్వపు పోటీ

ఆంధ్ర ప్రదేశ్‌లోని ప్రాచ్య కళాశాలల విద్యార్థులలో తెలుగు కవితా రచనను ప్రోత్సహించుటకై మాకళాశాలలో 18—1—71వ తేదీ మధ్యాహ్నము గం. 2—00 లకు పోటీ నిర్వహించబడును. అభ్యర్థులు ఒక గంట వ్యవధిలో ఇచ్చిన విషయము గూర్చి వ్రాయవలసి యుండును. సలక్షణ భాషా చ్ఛందములనే ఉపయోగించవలెను. ఎంట్రన్సుతో సహా కళాశాలలోని అన్ని తరగతులలో చదువు విద్యార్థులను పాల్గొనవచ్చును. ఒక కళాశాలనుండి యెందరైనా రావచ్చును. వారి ఖర్చులు వారే భరించవలెను. ఉచిత వసతి మాత్రము కలదు. విద్యార్థినులకు ప్రత్యేక వసతి కలదు. మొదటి బహుమతి రు.50— రెండవ బహుమతి 30—రు మూడవ బహుమతి రు.20 ఆవెలగల కోరిన పుస్తకములు యోగ్యతా పత్రముతో సహా 28.1.71 సాయంకాలము 4—30 గంటలకు జరుగు కళాశాల సంస్థాపకులు జన్మదినోత్సవ సభలో బహూకరించబడును. ప్రిన్సిపాల్ నిర్ణయంపై ఉత్తర ప్రత్యుత్తరములు వివరణములు వుండవు. రాదలచిన అభ్యర్థులు తమ దరఖాస్తులు 14—1—71 వతేదీ కందునట్లు పంపవలెను. వచ్చునప్పుడు తమ కళాశాల ప్రిన్సిపాల్‌నుండి ధ్రువ పత్రము తెచ్చుకొనవలెను.

యేలూరిపాటి అనంతరామయ్య

ప్రిన్సిపాల్, కొంచల వెంకట కృష్ణమూర్తి సంస్కృత కళాశాల, గుంటూరు.

## సినీమా తారలు : ఇతర అభిరుచులు!



సినిమాలలో నటించడమన్నది సామాన్యమయిన విషయం కాదు. సన్నివేశాన్ని బట్టి పాత్ర స్వభావాన్నిఅనుసరించి నటించాలి. అందుకు ఎంతో నేర్పు, ఓర్పు అవసరం! పాత్ర పోషణ సరిగా రావటం, రాకపోవటం అన్నది— ఆర్టిస్ట్ మూడ్ మీద ఆధారపడివుంటుంది. ఎన్నిసమస్యలున్నా, గొడవలున్నా కనిపించిన వాళ్లందర్నీ చిరునవ్వుతో పలుకరిస్తూ ఆ మూడ్ తెచ్చుకొని పాత్రలో లీనమై నటించాలి. ఇవన్నీ ప్రత్యేకంగా గమనించిన వారికి గాని తెలీవు. చూసేవాళ్లకి వాళ్లలోని గ్లామర్, డబ్బు, హోదా మాత్రమే కనిపిస్తాయి.

* * *

ఏరోజుకారోజు షూటింగ్ హడావిడితో పాటు, ఎన్నో సమస్యల్ని పరిష్కరించుకొంటూ ఎంతో బిజీగా ఉండే ఆర్టిస్ట్‌లకు కూడా., మామూలు వారికి ఉండే అభిరుచుల్లాంటివి ఉంటాయి. వాటి పట్ల కూడాఎంతో ఉత్సాహం కనపరుస్తూ ఉంటారు. ఏమాత్రం అవకాశం దొరికినా తమ అభిరుచుల్ని ఆచరణలో పెట్టే ప్రయత్నం చేస్తుంటారు. ఇంత బిజీలో కూడా స్వంత అభిరుచులపై మొగ్గుచూపటం చూస్తే వారి ఉత్సాహానికి ఆశ్చర్యం వేస్తుంది.

మగ ఆర్టిస్ట్‌లలో కన్న ఆడ ఆర్టిస్ట్‌లలోనే యీ అభిరుచులు ఎక్కువేమో అనిపిస్తుంది.

శ్రీమతి భానుమతి చక్కని కథారచయిత్రి. మునిమాణిక్యం వారి కాంతం లా—అత్తగార్ని ఆంధ్రదేశంలో బాగా పాపులర్ చేశారు తమ కథల ద్వారా. ఆమె ఎంత బిజీగావున్నా రచనా వ్యాసంగాన్ని విడిచి పెట్టలేదు. అలాగే శ్రీమతిజానకి కూడా చెయ్యితిరిగిన రచయిత్రి. జానకి కథలు రాశారేమో తెలీదుగాని, ఎన్నో చక్కని వ్యాసాలు రాశారు. ఎవరూ చెప్పుకోలేని ఆత్మకథని ధైర్యంగా, మంచి శైలిలో, చిన్న చిన్న వాక్యాల నిర్మాణంతో అందంగా రాశారు. జమున సాధుజంతువుల పట్ల ఎంతో సానుభూతి చూపుతారు. బ్లూక్రాస్ సంస్థలో సభ్యురాలు. గృహాలంకరణలో కూడా ఆమె చాలా శ్రద్ధ కనపరుస్తారు. వాణిశ్రీకి బొమ్మలు తయారు చేయటంలోను, బొమ్మల్ని అలంకరించటంలోను ఆసక్తి మెండు. జయలలిత చక్కని చిత్రకారిణి. బొమ్మలు బాగావేస్తారు. రేఖాచిత్రాలే కాదు, పెయింటింగ్ [నైఫ్ పెయింటింగ్]లో నేర్పరి. ఏమాత్రం తీరిక దొరికినా పెయింటింగ్ చెయ్యాలనుకుంటారు. శ్రీ యస్. వి. రంగారావుకి వేట అంటే యిష్టం. వేటకి వెళ్లాలంటే అడవీ, తగినంత టైమూ వుండాలి. కనుక మామూలు తీరిక దొరికితే వేటకు వెళ్లేవారాయన. పూర్వం తీరికగా వుండేరోజుల్లో తూర్పుగోదావరిజిల్లాలోని అడవుల్లోకి తరచూ వేటకు వెళ్తుండేవారు. ఇప్పుడూ ఆయనకి ఆ వేట సరదా వుంది.

నాకు తెలిసిన వారి గురించి మాత్రమే యిక్కడ మచ్చుకి పేర్కొన్నాను. ఇంతకీ ఎందుకు చెప్పొచ్చానంటే— ఏవృత్తిలో వున్నా, వ్యక్తులకి రుచులు, అభిరుచులూ ప్రత్యేకంగా కొన్ని వుంటాయి. అవి వారిలో అభివృద్ధి చెందుతూనే వుంటాయి తప్ప, తొలగి పోవు! అని.

— మోహన్ కుమార్

# పుస్తకాలు

## మొగలిపొదలు : (నవల)

శ్రీమతి శిఖా(గంటి) వెంకటరమణ. 232 పేజీలు రూ. 5.

## వేయబోవని తలుపు : (నవల)

శ్రీమతి తురగా జానకీరాణి క్రౌన్ ఆక్టేవో 191 పేజీలు. రూ. 4. ప్రచురణ నవజ్యోతి పబ్లికేషన్స్, ఏలూరురోడ్డు, విజయవాడ—2.

జీవితంలో వెలుగు కంటె చీకటినే హెచ్చుగా ప్రదర్శించటం శ్రీమతి వెంకటరమణగారి అలవాటు. ఇటువంటి ధోరణిలో నడిచిన ఆమె నవలలు కొన్ని లోగడ చదివాం. ఇప్పుడీ మొగలి పొదలు కూడా అదే జాడను అనుసరించింది.

చెడుగునే ఆధారం చేసుకుని మునుగడ గడిపిన గోపాలం దిగజారిపోవటంలో ఆశ్చర్యం లేదు. శ్రీనివాస్ సరస్వతి అనే ఇద్దరు పిల్లల్ని ఇచ్చి అతని భార్య పోయింది ద్వితీయం సుభద్ర ఆ తరువాత ఆతడూ అవతారం చాలిస్తాడు. కూతురు సరస్వతి కూడా క్షయవల్ల మరణిస్తుంది. భర్త పోయిన సుభద్ర శీలం వక్రగతి పట్టుతుంది కొడుకు శ్రీనివాస్, రాజేశ్వరిని పెళ్ళాడతాడు కాని ఆమె మరో యువకుణ్ణి రుచి మరుగుతుంది

మొత్తంమీద ఈ నవలలో మనకి మొగిలి రేకుల ముళ్ళే గుచ్చుకుంటాయి కాని, వాటి సౌరభాన్ని ఆనందించాలంటే కష్టమే.

* * *

మొగలి పొదలలో సుభద్రను పోలిన పాత్ర కమల. ఈమెను [illegible]ంచిన కథనమే వేయబోవని తలుపు

కమలకు వరసకి కూతురు కామాక్షి. కామాక్షికి అక్క వరస రాధ. పెళ్ళిసంబంధం ప్రస్తావనలో చెల్లెల్ని అపార్థం చేసుకుంది రాధ. కాని, ఆ అపోహ క్రమంగా తొలగిపోయి, ఇద్దరికీ ఏకీభావం కుదురుతుంది. రాధ తన బాధలన్నీ వెలపోసుకోవటంతో ఆమె మనస్సు తేలికపడింది. స్వభావంలో చెల్లెలు అక్కలాగా, అక్కచెల్లెల్లాగా మారిపోయారా అనిపించేటంత సునిశితంగా జీవితాన్ని అర్థం చేసుకుంది, కామాక్షి.

అటువంటి కామాక్షికే సవిత్తల్లి ఒక సమస్య అయి కూచుంది. తండ్రి పోయిన ఇన్నాళ్లకి గర్భవతి అయిన కమల ఇప్పుడు నిండు చూలాలు ఆ పుట్టే బిడ్డ కమల శిశువు కాదు. కనుక దాన్ని ఏ శరణాలయానికో అప్పగించి, పిన్నిని మాత్రం దగ్గిర పెట్టుకుందామని కామాక్షి అనుకుంది, ఊరికి బయల్దేరేటప్పుడు.

కాని, తీరా ఊరు చేరుకున్నాక కథ అడ్డం తిరిగింది— తల్లి పోయింది, బిడ్డ మిగిలింది అనాథ. అయినా ఉదార హృదయం గల కామాక్షి [illegible]ంది: అక్కను నేనుండగా, వాడు అనాథ [illegible]తాడూ?

[illegible] బస్తీ వాతావరణాలు, రాజకీయ [illegible] వాటిని నాశయించుకు బతికే రకరకాల వ్యక్తులు, వారి వ్యక్తిత్వాలు— వీటతో కూడిన రసవత్తర ఘట్టాలతో రక్తికట్టిన నవల ఇది.

— శివకుమారి

## అక్కయ్యే మళ్ళీ పుట్టింది ;

రచన: శ్రీమతి వేదవతి 151 పేజీలు.

## సంతృప్తులు :

[రెండు నవలికలు] కృష్ణ రచన 122 పేజీలు. ఈ రెండూ కలిపి ఒక సంపుటి. ఒక్కొక్కటి రెండేసి రూపాయిలు ప్రచురణ : యం శేషాచలం అండ్ కో, మద్రాసు, సికింద్రాబాదు, మచిలీపట్నం.

కృష్ణన్నే కన్నది దేవకీదేవి. అయినా, పెంచి పెద్దచేసి మురిసే భాగ్యం యశోదదే అలనాటి యశోదమ్మ భాగ్యం కాంతమ్మ వదినకి కలిగింది ఎందునా కాకుండాపోయింది సరస్వతక్కయ్య.

సరస్వతికి లేకలేక పుట్టిన కవలబిడ్డ రూ తనకు కాకపోగా, ఆ తరువాత మళ్ళీ ఆమె తల్లి అయ్యే యోగ్యత లేకపోయింది. తను రోగిష్టిది. దానికి తోడు, లేనిపోని అనుమానాలతో మన శ్శాంతి లేకుండా చేశాడు, మాయదారి మొగుడు.

అంతటి యాతనా ఎంతో సంతోషంగా అనుభవించింది. జీవితంలో సుఖంగా వున్నట్టే కనిపిస్తూ, విరక్తితో వేదాంతిలా కన్ను మూసింది.

కొన్నేళ్ళు గడిచాయి. సరస్వతక్కయ్య తమ్ముడు వాసు ఒక ఇంటివాడయ్యాడు. అతడికో చిన్ని పాపాయి! అంటే, సరస్వతే మళ్ళీ ఇలా వెలిసిందా?

జీవితంలో ఒడుదుడుకులు అప్పుడు వాటికి తోడు కావాలని మనం లెచ్చి పెట్టుకునేవి కొన్ని చెరసి—అన్నీ కలిసి— హాయిగా నడిచి, సుఖాంతంగా ముగిసిన నవల ఇది.

* * *

ఆలుమగల మధ్యని అనుమానం రానే కూడదు వచ్చిందా—అది మరి పూడుకోవడం కల్ల. ఇటువంటి సమస్యకు బలి అయిందే, వేదవతిగారి నాయిక సరస్వతి.

అయితే—ఉష శ్రీ చిత్రించిన లీలావతి తీరే వేరు. ఈమె సౌందర్యాధిదేవత. తెలిసో తెలియకో ఏరికోరి ఆమెను చేపట్టాడు, వెంకట్రాయుడు చౌదరి

శోభనంనాటి మర్నాడు ఆమె వాంతి చేసుకుంది! కాని, చౌదరి కంగారుపడలేదు, గొడవ చెయ్యలేదు. నిదానంగానే తమాయించుకున్నాడు. అయినా, ఏమనుకోవాలి? ఆ ఆలుమగల ప్రణయ సుధాకలశంలో ఇది విషబిందువా? తొలి కబళంలోనే గుంకరాయా? నమ్మశక్యమయిన సంగతేనా?

హంగులన్నీ ఉన్నవాడు గనక, ఆ విషబిందువు మూలాన్ని చౌదరి కనుక్కోగలిగాడు. కనుక్కొని చేయగలిగిందేమిటి?

తొలగించలేదు గాని, తీరా లీలావతి తెగిస్తే చౌదరి ఏం చెయ్యగలడు?— ఈ సందర్భాన్ని కట్టె విరక్కుండా పాము చావకుండా చిత్రమయిన మలుపు తిప్పారు, ఉషశ్రీ.

ఈ నవల చివరని సమీక్షకుల కొక చిన్న హెచ్చరిక చేశారు, రచయిత కానయితే— పేరుకం జెందిన యిట్టి కాంత ఉచిత వ్యాపారముబ్ నేర్తురే? అని కవివాక్కు. పసందయిన కోడె నాగు పడగ విప్పి ఆడినంతసేపూ ఆనందంగానే వుంటుంది తరవాత ఒక్కుమని కాటేస్తే, ఆ తస్సు పామిది చదువు, మరి?

— శివకుమారి

## నాస్వామి

భాషాప్రవీణ చింతల పాటి నరసింహ దీక్షిత శర్మ విరచితమైన సద్యకావ్యం నెల రూపాయి. 32 పేజీలు ప్రచురణ నరసింహ పేర జిల్లా పరిషత్ హైస్కూలు, లచ్చమ్మపేట, గుంటూరు జిల్లాకు రాయాలి

## విద్యాజ్యోతి

ఎర్రప్రగడ నాగమూర్తిరాజు సంపాదకత్వంలో వెలువడుతున్న విద్యా విషయిక మాసపత్రిక విడి ప్రతి 50 పైసలు. సాలుచందా ఆరు రూపాయలు ప్రతులకు శ్రీ చింతలపాటిబాపిరాజు ధర్మసంస్థ, చిన నిండ్రకొలను. ప. గో. జిల్లా.

## ముత్తిపదాలు

యిద్దెండ రఘురామారెడ్డి, రచించిన జానపద గేయ కావ్యం ముత్తిపదాలు ముత్తినాయిక గాను జాన్ నాయకుడుగాను పల్లెపాటల్లో అల్లి తొలిరచనలోనే ప్రసిద్ధ జానపద గేయరచయితల స్థాయినందుకున్న రఘురామారెడ్డి కృషి ఎంతయినా ప్రశంసనీయం, ప్రతిమాటా ప్రతిపాటా చదివి ఆనందించ తగ్గ రీతిలో సాగిన ఈ కవిత్వం రసజ్ఞులకు బాగా మెప్పిస్తుంది 82 పేజీల పుస్తకం వెల రెండున్నర రూపాయలు చైతన్య కళాపరిషత్తు కార్యాలయం జడ్చర్ల, మహబూబ్ నగరం జిల్లా

## రంగుల రాట్నం

నాటిక. పత్రికా రచయిత శ్రీ శ్రీకృష్ణ కలం నుంచి వెలువడిన నాటిక 'రంగులరాట్నం.' ప్రదర్శనకి అనుకూలమైన ఈ నాటికలో ఇతివృత్తం బాగున్నది రచన సరళంగా వుండి జనాన్ని రంజింప జెయ్యగల్గేదిగా వుంది. ఇదే పుస్తకంలో 'పల్లెకాటి శివయ్య' అనే ఏకపాత్రాభినయం కూడా చేర్చారు. నటీనటులకు ప్రోత్సాహకరంగా వుండే ఈ పుస్తకం వెల రూపాయిన్నర. ప్రతులకు ప్రసాద్ పబ్లికేషన్స్, అర్. అగ్రహారం, గుంటూరు—3.

---

## జవాబు

(44 వ పేజీ తరువాయి)

మొత్తం 27 త్రిభుజాలు

Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press; 6 & 7 Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.